# భారతి

సాహిత్య మాసపత్రిక
అక్టోబరు 1978

ఎదురు తిరిగే పదాలు

నిఖిల్

వ్యవహారంలో వ్యాకరణం

ఈశ్వరచరణ్

ఆపిల్ పూలు

మిఖైల్ మిఖైలోవిచ్ కోట్స్యుబిన్‌స్కీ

ప్రతీతి

భగవతీకుమార్‌శర్మ

హైందవ తర్కశాస్త్రం

నాగభూషణం

సోషలిస్టు అవాస్తవికతలు

వెంకయ్య

రాబర్ట్‌సన్ ఆర్థిక ఆలోచన

రావు

వల్లభాభ్యుదయము

శేషాచార్యులు

ఇంకా ప్రభాతం, బుచ్చిబాబు, రాధాకృష్ణశర్మ, సత్యనారాయణ, రాంమోహన్‌రాజు, మల్లెల, సంపత్కుమారాచార్య, కేవస్వీ, బ్రహ్మానంద, నరసయ్య, కొమరయ్య, పద్మనాభస్వామి, జవహర్‌లాల్, గంగప్ప ఇతరుల రచనలు

వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)



అక్టోబరు 1978

సంపుటము : 55 సంచిక : 10



విడిపత్రిక వెల రూపాయిన్నర

# బంజరు భూముల్లో బంగారం పండిద్దాం

దున్నుకోను సెంటు భూమైనా లేందే సాలంతా పొట్టకు వెళ్లదు.

ఇది యీనాటి సమస్యకాదు.

ఎవరిస్తారు, ఎప్పుడిస్తారు ? - అన్నది ప్రశ్న.

కాలం చేసిన యీప్రశ్నకు సమసమాజం బదులిస్తుంది.

స్వాతంత్ర్యం వచ్చింది. శతాబ్దాల తరబడి నలిగి దరిద్ర నారాయణుల్లా మిగిలిన బలహీన వర్గాలపట్ల ప్రభుత్వానికి పట్టింపు హెచ్చింది.

**1973** భూ పరిమితి చట్టం చురుగ్గా అమలౌతూంది. జూన్ **1**వ తేదీ నుండి "భూ స్వాధీన పక్షోత్సవాలు" జరుపుకొన్నాం; భూములు కేటాయించిన పేద వర్గాల వారందరికీ భూస్వాధీన కార్యక్రమం విజయవంతంగా సాగుతున్నది. ఆ పక్షం రోజుల్లో **73,847** మందికి సుమారు **1,32,000** ఎకరాల భూమి స్వాధీనం చేశారు. **65,983** మందికి ఇళ్ల స్థలాలకోసం **4,837** ఎకరాల భూమిని స్వాధీన పరిచారు.

మన రెక్కల్లో శక్తివుంది. ఇక్కడ సాగుచేయాలన్న మనోధృతి వుంది. ఈ నాగటి కర్రు కింద మన భుక్తివుంది. ఇది బంజరైనా సరే, బంగారం పండిద్దాం రండి.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు.

16/78–79



# విషయానుక్రమణిక

## అక్టోబరు 1978





# వాన కురిసిన రాత్రి రాలిపడిన స్మృతులు

మట్టి వాసన చుట్టూ అల్లుకున్న బాల్యం
 మళ్ళీ తాకుతుంది గుండెని
చిత్రంగా కళ్ళముందు మెరిపిస్తుంది
వెండి తీగల వాన జల్లుతో కాసిన బంగారపు ఎండని
పచ్చా పచ్చటి కోనల కానల నీడల్లో జరిగిన
కుక్కా నక్కల పెళ్ళిని

జడివానకి తడిసిన దేవాలయాలమీది బూతుబొమ్మలు
వెచ్చటి ముచ్చటైన రహస్యాల్ని విప్పుతాయి
ఆకాశం నుంచి దేవతలు అర్ధరాత్రి దిగొచ్చి
అమ్మ పక్కన కొత్తపాపను పడుకోబెట్టారనే కట్టుకథ
 తెరని
అద్భుతంగా వొయ్యారంగా తొలగించేస్తాయి

చినుకుల్లో నవ్వుతూ నడిచే రంగుల పొంగుల బొమ్మల
 వెనక
చిలిపి చిలిపి ఈలల్ని వింటూ
చికిలించి నవ్వుతుంది చీమచింతచెట్టు

చీకటి పందిటి నుంచి రాలే
చినుకుల మల్లెల కింద
అనంత స్వప్న లోకాలను
అరమోడ్పు కన్నులలో నిలుపుకొని
కాలాతీతమైన ఆనందంతో పరవశిస్తూ
వీణ మీటుతూంటుంది
నా అనుభూతి

# జీవరవళి

కవితా సామగ్రినంతా మూటగట్టి నెట్టేస్తే
 వొక్క నవ్వు మిగిలింది
విడిపోను విడిపోనంటూ

రాత్రంతా ఎదురు చూసిన కన్ను
తలసి మూత బడుతున్నప్పుడు
వొక స్వప్నం పలకరించింది
నేనైనా దక్కుతాను లెమ్మంటూ

దూకి చావాలని కొండ కొమ్మును చేరుకుంటే
గాలి కెరటం సోకి జాలిగా పలికింది
నిన్ను నమ్మిన నా గతేమిటంటూ

అనంత నిశ్శబ్దంలో లీనం కాబోయే నన్ను
ఆప్యాయంగా వెనక్కి లాక్కుంది
జీవ రవళి !

- కేఎస్వీ



# వ్యవహారంలో వ్యాకరణం

## శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

నా దేశం భారతదేశం
పరవస్తు చిన్నయసూరుల
వరణీయ బాల వ్యాకరణం.

ఇందులో —
అక్షరాలు అరవై కోట్లు
అచ్చులు రెండే రెండు వందలు
ప్రజానాడి నాదాలు
ప్రజావాణి నినాదాలు
ఏవైనా ఇవే ప్రాణాలు.

ఇక్కడ —
సంధి పరిచ్ఛేదం
సర్వం అచ్చులకే అంకితం
హల్లు కేవలం అనాదృతం.

రోటీ కపడా మకాన్ త్రికం
ఏదైనా లాకేత్వం ఏకాదేశం.

ఈ వ్యాకరణంలో —
క్రియ మీద పరిచ్ఛేదం లోపించింది.

ఆకారాంత స్త్రీలింగ ప్రజాప్రేరణ,
పంచవర్ష పంచశీల ప్రణాళికా పూరణ
జిహ్వా మూలీయంతో సమసించింది.

ఈ దేశంలో —
అధికారులు కచటతపలు
మామూలు పరమైతే గజడదబలు
నాయకులు వర రుచులు
వాక్కరణానికి స్వరపేటికలు
భ్రూనేత్ర హస్త విక్షేపాలు వార్తికాలు
వాని ప్రయోగాలు క్రమ నిరపేక్షకాలు.

అన్యయుష్మదస్మత్ కార్యాలు
వారికి ఉత్తరోత్తరాలు బలియాలు.
వారి వర్ణమాలతో
పదవి మాత్రమే స్థిరం
ప్రజాహితం ద్రుతం.

ఎన్నికలలో ఎన్ని కలలలో
ఇస్తారు ధర్మ దర్శనం నిత్యం
గెలిచినా ఓడినా నిషేధంబు తుల్యం.

ఇక్కడ ఓటరు పాపం! జ్ఞీతృ ఒక్కక్షణం
పని తీరగానే గురు విరహితం తల్లక్షణం.

పరిచ్ఛేదం ఏదైనా —
గాంధీగారు అధికారసూత్రం
ఆయన పేరు వ్యవహారికం
కాని బోధన అభంగ తరంగ మృదంగం.

మా లోపల —
ఆశయాల సూత్రాలు బహుళం
ఆచరణ పరిచ్ఛేదాలు వైకల్పికం
ఐనా అవి యథాప్రయోగం గ్రాహ్యం.

నా దేశం భారతదేశం
పరవస్తు చిన్నయసూరుల
అలిఖిత బాల వ్యాకరణం



# చీకటి కప్పిన దుప్పటీ!!......

శ్రీ వి. సంపత్కుమారాచార్య

నా కుక్షినిండా...కాకపోతే గుండెల్నిండా...లేదంటే మస్తిష్కంనిండా ఉన్నాయి
మినుకు మిణుగురు దీపాల్నించి తళతళల తారాపంక్తులవరకూ !
ఓ మూల సూర్యుడూ ... చంద్రుడూ ... ఇతరగ్రహాలూ
ఇంకా పత్తా దొరకని భవిష్యద్గ్రహాలతో సహా ! ... కాని
చీకటి గౌరవంగా కప్పిన దుశ్శాలువని గర్వంగా చూసుకుంటూ
సమస్యల చలినించి కాపాడుకుంటూ
కునికిపాట్లు తీస్తున్నాను ... నేను !! ...

ఆ తమోనిచోళం దానంతటదే చిల్లుపడో ... చిరిగో ... లేకపోతే
నాకే వెర్రిపుట్టి (బుద్ధివచ్చి) పీలికలు చేస్తేనో
ఆ దారుల్లోంచొస్తాయి ... నిద్రాభంగమైన
తారల గ్రహాల దీపాల కాంతి కిరణాలు !! ...

అయితే నల్లటి చీకటి దారాలతో నేసిన ఈ రల్లకం
అంత తేలికగా చిరుగుతుందా ?
అదే అంత తేలికైతే
శతాబ్దాల రెక్కల్ని అజ్ఞాన సూత్రానికి గుచ్చి ఆనందించే నేను

ఆ డయబాలికల్ హాబీలోనే ఎందుకు మునిగుంటాను ?
నేను చేసే చేష్టలకి లోకాన్ని బాధ్యంచేసే తెలివితప్ప
మరే విజ్ఞానాన్నీ సంపాదించని నేను
ఈ పెర్పెట్యువల్ వింటర్‌లోనే ఎందుకు వణికిపోతాను ?
అదే అంత తేలికైతే
తారల గ్రహాల మధ్యనించి మనఃచక్షువులతో
నన్ను నేను చూసుకోనా ? నాలోనే విశ్వాన్నూహించనా ?
మనుష్యుల్లో ... జంతువుల్లో ... పక్షుల్లో ... పురుగుల్లో
నా భాగస్వామ్యాన్ని పరిశీలించుకోనా ?
ఆకుల్లో ఓ ఆకునని ... చీమల్లో ఓ చీమనని
పేడపురుగునించి పేదఘూశ్వం వరకూ
అన్నీ నేనేనని గ్రహించనా ??

లోపలికి చెయ్యేట్టి చీకటిని పెరకెయ్యనా ?
గుండెల్ని తొలిచి నిండా వెలుగులనే నింపనా ??

# రాజకీయవాది

## శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

అతడు పిల్లలకోడి
  పదవిలోఉన్న ప్రతిక్షణం;
అతడు ఈకలు తీసిన పక్షి
పదవిలో లేని మరుక్షణం.

అధికారం చెలాయించేది అతడు
అశాంతి వ్యాపించి, భద్రత లోపించినప్పుడు
'శాంతి భద్రతలు సంరక్షించండి'
అని హితబోధ చేసేదీ అతడే.

ప్రజాభిమానం అతని మూలధనం
అతని ఉన్నతి కది ఏకైక సాధనం;
ఈ విషయం అతనికి తెలియకపోదు
అయినా తప్పదు మతిమరుపనే వాదు

పాపం, అతని వృద్ధిక్షయాలు
ప్రజల ఓట్లలో దాగివున్నాయి

పదవిలో ఉన్నప్పు డతని చూపు
ప్రజలమీద ప్రసరించదు—పాపం.

అతని మాటలు పంచదార చిలకలు
నిజమైతే అవి అభ్యుదయ సోపానాలు
పత్రికల దాహాన్ని అవి తీరుస్తాయి
ప్రజల తలపుల్ని అవి మారుస్తాయి.

అతడంటే నాకు గౌరవం
పదవిలో ఉన్నప్పుడు
    అసామాన్యుడు కనుక.

అతడంటే నాకు జాలి
పదవిలో లేనప్పుడు
    సామాన్యుడు కనక.

అతడంటే నాకు అభిమానం
ప్రజలకోసం పాటుపడతాడు కనక.

# ఆశ

## శ్రీ గద్దె బుచ్చిబాబు

రమణీయ స్వప్నపక్షాల నల్లార్చుకుంటూ,
    ఊహల ఊపిరితో, ఊసుల గ్రాసంతో,
జీవనసముద్ర కష్టసుఖతరంగాలపై ప్రభవించిన
    సమీర డోలికల నూగుతూ,
భ్రమాశ్రకచాపాల పరంపరను అధిగమిస్తూ,
    మనోవాంఛా వీణావేణు నాదద్వయానికి
హృదయోద్వేగ మృదంగలయ విన్యాసాన్ని
    సరస సంగీత సమ్మేళనం చేసుకుని,
వెన్నంటివచ్చే ఆవేదనా గ్రీష్మార్కుడి తీవ్రాతపాన్నీ,
చుట్టూ ముసిరిన ఓటమి నిస్పృహల సుడిగాలుల్నీ
    లక్ష్యపెట్టక,
తీయని మాటల నీలిమబ్బుల చలువపందిళ్ల కిందుగా
ప్రోత్సాహ వర్షతుషారంతో తడిసి హర్షపులకితమైన మేనితో.
    భవిష్యద్వియత్తలంపై
        ఆనందాశాముఖంగా మెడచాచి
        నిరంతరం నిర్విరామంగా పయనించే
            విచిత్ర విహంగం ...

# వర్షం

శ్రీ కలువకొలను రాంమోహన్ రాజు

వర్షం ...
అభాగ్యురాలెవరో రాల్చే కన్నీళ్లలా వర్షం
శర పరంపరలా వర్షం
తమో వాహినినుండి జారిపడుతున్న
వర్షపు బిందువులు, నిస్సహాయుడైన
విప్లవయోధునిమీదికి పోలీసు తూటాల్లా
ఎంతకీ తెమలడంలేదు

వర్షమంటే ఆకాశకాంత పన్నీరు చిలికినట్టుగా
వుంటుందని విన్నాను గానీ ఇదేమిటి ?
విధవరాలి వికృత రోదనలా వున్నది !
వర్షంలోతడిసి గులాబీలు పులకరిస్తాయనుకున్నాగానీ,
రోడుపక్క జీవులు నిరాశ్రయులవుతారనుకోలేదు
పర్జన్య గర్జనకు నెమళ్లు పురివిప్పి ఆడుతాయను
కున్నాగానీ
కోకిలగూడు కూలిపోతుందని ఊహించనే లేదు
నిశా గర్భంలోంచి రాలే చినుకులు
చెట్టు కింద బక్క చిక్కిన ప్రాణుల వణుకులు
భూమికి అభ్యంగనం చేయిస్తున్న వర్షం
మెదడులో భావాలని జోకొడుతున్నది

# ఎదురుతిరిగే పదాలు

నిఖిల్

ఆకాంక్ష ఆవిరై
అనంతంగా దిగంతాలనిండా !
లోపల కాగి మసలే ఆశలే తప్ప
ఆశయాల అంచులను తాకుతూ
సాధించవలసిన గమ్యం
నిలిచిపోయింది అర్ధాంతరంగా !
వాక్యంలోకి వొదికి వచ్చే పదాలు
అభివ్యక్తినే కుంటుపరిచినపుడు
తృప్తి అనేమాట
బతుకునే గిరగీసి శాసించినపుడు
అదుపు తప్పే శబ్దాలను
కాంక్షల కళ్ళేనికి కట్టి
కదం తొక్కించినపుడు
కదిలేది కవిత్వం
నడిచేది జీవితం.



శ్రీ కందుల నాగభూషణం

# హైందవ తర్కశాస్త్ర పరిచయం

## ఈనాటి శాస్త్రీయ పోకడలకు సరిపోయే ఆనాటి భావాలు

### విషయ సూచిక

# తొలిమాట

(భండార్కర్ ఇన్‌స్టిట్యూట్ వారు ప్రచురించిన అన్నంభట్టు యొక్క తర్క సంగ్రహాన్ని చదివిన మీదట, నేను అడపా తడపా తర్క శాస్త్ర విషయాలను గురించి వ్రాసికొన్న నోట్సును యీ రచన రూపంలోకి తీసికొనిరాగలిగాను. దీన్ని ఒక కొత్త దృష్టితో వ్రాశాననే నా నమ్మకం.

ఈ రచన తర్కశాస్త్రం నేర్చుకొనేందుకు ఉపయోగపడాలనే దృష్టితో వ్రాయలేదు. ఈ రోజు శాస్త్రంలో కొత్తవిగా చలామణీ అవుతున్న కొన్ని భావాలను అన్నంభట్టూ, అతనికి ముందే మరి కొందరూ, వివరించారనే విషయాన్నీ, ఆ వివరించిన విషయాలేవో అవీ, పాఠకుల దృష్టికి తేవటం మాత్రమే యీ రచన యొక్క లక్ష్యం.

ఈ రచనలో దోషాలుంటే చదువరులు నాకు వాటిని తెలియపరచాల్సిందని కోరుతున్నాను.)

కందుల నాగభూషణం
48—8—15 ద్వారకానగర్,
విశాఖపట్నం—530016.

# 1. స్థూలంగా కొన్ని విషయాలు

## 1. 1) హైందవ తర్కశాస్త్రం రూపొందిన విధానం :

మనం సాధారణంగా ఒక నిర్ణయాన్ని గురించి మాట్లాడేటప్పుడు అది న్యాయంగా ఉందనో, లేదనో, లేక ఆ విషయాన్నిగురించి చాలా మీమాంస జరిగిందనో అనటం అలవాటైన సంగతి. న్యాయం అనటంలో ఉద్దేశ్యం హేతుబద్ధంగా ఉందని. మీమాంస జరిగింది అనటంలో అర్థం చర్చ జరిగిందని. న్యాయ, మీమాంస అనే ఈ రెండు మాటలు రెండు తత్వ[1]విచార పంథాలకు పేర్లు. మొదట్లో మీమాంసికులనబడే తత్వ విమర్శకులే 'న్యాయ' అనే మాటను వాడుక చేసారు. కొంత కాలానికి, ఈ మీమాంసికుల భావాలతో పూర్తిగా ఏకీభవించని కొందరు ''న్యాయ'' అనే మీమాంసికుల మాటనే తీసికొని, దాన్నే తమ తత్వానికి పేరుగా పెట్టుకొన్నారు. వీరిని, వీరి అనుయాయికులను, నైయ్యాయికు లంటారు. సత్యాన్వేషణకై నైయ్యాయికులు అవలంబించిన పద్ధతి చర్చ. దీన్ని ఇంగ్లంలో Dialectics లేక Disputation అనవచ్చు. క్రీ॥ పూర్వం దాదాపు 3వ శతాబ్దికి చెందిన గౌతముడు (Gotama) అనే సుప్రసిద్ధ నైయ్యాయికుడు న్యాయసూత్రాలను రచించాడు. హిందువుల తత్వ విమర్శనా పద్ధతుల్లో ముఖ్యమైనవి నాలుగు. అవి—సాంఖ్య, న్యాయ, మీమాంస, వేదాంతాలు. సాంఖ్య సూత్రాలను కపిలుడు, మీమాంసను గురించిన సూత్రాలను జైమిని వ్రాసారు. చివరిదైన వేదాంత పద్ధతిలో 'అద్వైతం, విశిష్టాద్వైతం, ద్వైతం' అనే మూడు చీలిక లేర్పడ్డయ్. ఈ మూడింటిని వేదాంతమనే వ్యవహరిస్తారు. కాలక్రమేణ జీవాత్మ పరమాత్మల సంబంధ భావాలను ప్రచారంచేసే వేదాంతం జనసామాన్యాన్ని ఆకట్టుకోటం చూసి, మిగతా మూడు పద్ధతుల అనుయాయికులు వారి పద్ధతులను కూడా యీ విధమైన భావాలతో జోడించటం జరిగింది. పతంజలి చెప్పిన యోగ సూత్రాలతో సాంఖ్యను జోడించి సాంఖ్య—యోగాలనీ, కనాదుడు చెప్పిన వైశేషిక సూత్రాలతో న్యాయను జోడించి న్యాయ—వైశేషికలనీ, వేద భాగమైన ఉపనిషత్తులతో మీమాంసను జోడించి పూర్వ — ఉత్తర మీమాంసలనీ, మూడు జంటపేర్లతో వ్యవహరించబడే తత్వ విధానాలను రూపొందించారు

సూత్రీకరణకు ముందే చాలా భావాలు ప్రచారంలో ఉండటం, ఆపైనే వాటిని సూత్రీకరించటం శాస్త్రవిషయంలో సాధారణం.

న్యాయ, వైశేషికలు సూత్రరూపాల్లోకి రాకమునుపే, అంటే, క్రీస్తు పూర్వం 5వ శతాబ్దినాటికే, వీటి భావాలు పండితులకు బాగా తెలుసునని చెప్పవచ్చు. సాంఖ్య, పూర్వమీమాంస, న్యాయ, వైశేషిక విధానాల్లో తర్కశాస్త్ర విషయాలు యిమిడి ఉన్నాయేగాని, వాటిని ప్రత్యేకంగా విడదీసి ఒకచోట ఎవరు పొందుపరచలేదు. హిందూ పండితులు మోక్షానికి దారిచూపే జ్ఞానసాధనంగా మాత్రమే ఏ శాస్త్రాన్నైనా అభ్యసించి కృషి చేసారే కాని,

1 తత్వం అంటే మూలవిషయాలూ, వాటి క్రమమూ అని చెప్పవచ్చు.

శాస్త్రాన్ని శాస్త్రం కొరకే అభ్యసించి కృషి చేయకపోవటమే ఇందుకు ముఖ్యకారణం.

## జ్ఞానాన్ ముక్తిః
## జ్ఞాన సాధనం శాస్త్రం

అనే సూక్తి యీ విషయాన్నే స్పష్టపరుస్తోంది. హోమకుండాల నిర్మాణానికై జ్యామితికి సంబంధించిన బీజగణితాన్నీ, యజ్ఞయాగాదుల ఆచరణకై నక్షత్ర శాస్త్రాన్నీ, దేవాలయ నిర్మాణానికై వాస్తుశిల్ప శాస్త్రాలనూ వృద్ధిలోకి తెచ్చారు. జైనులు గణితశాస్త్ర జ్ఞానాన్ని తమ మతంలోని ఒక పవిత్ర భాగంగా పరిగణించటంవల్ల యీ శాస్త్రానికొక్కదానికే ఎక్కువ దోహదం కలిగి, కొంతవరకు, స్వతంత్ర ప్రతిపత్తి ఏర్పడ్డట్లు కనిపిస్తుంది. 11, 12వ శతాబ్దాల తరువాత హిందూ పండితులు శాస్త్రాలలోని ముఖ్యవిషయాలలో కృషి వదలివేసి, వ్యాఖ్యానాలు, వ్యాఖ్యానాలకు వ్యాఖ్యానాలు వ్రాయటంలోనూ, చిన్న విషయాలమీద పెద్ద వివాదాలు లేవతీసి వాటిల్లో తమ సామర్థ్యాలను ప్రదర్శిస్తూ తమ శక్తిని వ్యర్థం చేస్తూ వచ్చారు. దాంతో ముఖ్యమైన విషయాలలో కృషి క్షీణించి పోయింది. అయితే అదృష్టంకొద్దీ, తర్కశాస్త్రంలో యీ పరిస్థితి 17వ శతాబ్ది నాటికి కొంతమారింది

మౌలిక విషయాలకు స్వచ్ఛత చేకూరుస్తూ, తర్కశాస్త్రాన్ని సూటిగానూ, సులభంగానూ గ్రాహ్యమయ్యేటట్లు, అన్నంభట్టు[2] 'తర్కసంగ్రహ', 'తర్కదీపిక' అనే గ్రంథాలను రచించి, పండితులను ఆహ్లాదపరిచాడు. 'సిద్ధాంత ముక్తావళి'ని వ్రాసిన విశ్వనాథ పంచాననుడు కూడా యీ కోవకు చెందినవాడే.

అన్నంభట్టు కొండవీడులో గరికపాడ (డు?) అనే గ్రామంలో జన్మించి, 12 సంవత్సరాలు న్యాయతత్వాన్ని అధ్యయనంచేసి, చాలాకాలం శిష్యులకు న్యాయను బోధించిన నైయ్యాయికుడని చెప్తారు. నవీనశాస్త్రాల పురోగమనానికి అన్నంభట్టు[3] విశ్వనాథుల గ్రంథాలు అనువుగా దారిచేసాయి. కాని, మన దురదృష్టంకొద్దీ ఏ కారణం చేతనో ఆ దార్లో ఎవరూ ప్రయాణం చెయ్యలేదు. కనుక పరిస్థితులు అనుకూలంగా ఉన్నప్పటికీ పురోగమనం జరగలేదు.

## 1. 2) తర్కశాస్త్రంపై అభిప్రాయాలూ, అపోహలూ:

హిందూ పండితులలో కొందరు తర్కశాస్త్రాన్ని చిన్నచూపు చూసినట్లు కనిపిస్తుంది. దీనికి కారణం దాని స్వరూపం, సారాంశం వారికి సరిగా అర్థం కాకపోవటమే అనిపిస్తుంది.

**a)** కొందరి ఉద్దేశ్యంలో తర్కం అనేది ఒక శాస్త్ర విషయానికి ఉపాంగమే కాని, ముఖ్యవిషయముకాదు. అంటే, ఇది ఒక పనిముట్టు లాంటిది అని వారు చెప్తారన్నమాట. ప్రతిశాస్త్రమూ, ఉపయోగపడేటప్పుడు పని ముట్టే అవుతుంది. అలాంటప్పుడు, యీ శాస్త్రానికి మాత్రమే దాని ప్రాముఖ్యతను తీసివేయటం సరి కాదు కదా!

**b)** కొందరు తర్కాన్ని 'శుష్కవాదం' అని కూడా అంటుంటారు. తర్క శాస్త్రంలో వాదం ఎప్పుడు శుష్కమౌతుందో, అప్పుడు ఆ కారణంగానే వర్జనీయం కూడా అవుతుందనే వివరణ అందులోనే ఉంది. కనుక, శాస్త్రం శుష్కవాదాలను సమర్ధించదని స్పష్టమౌతూనే ఉంది. దోషం శుష్కవాదాలు చేసేవారివే కాని శాస్త్రానిది కాదు.

**c)** మరికొందరు తర్కశాస్త్రాన్ని ఊహ అని వివరిస్తారు. ఇది కొన్ని సందర్భాలలో మాత్రమే సరియైనది. ఆ సందర్భాలు 'అర్థాపత్తి'[4] అనే ప్రమాణాన్ని వాడినప్పుడు వస్తాయి. చాలా మంది ఊహను తర్కంలో భాగంగా మాత్రమే స్వీకరిస్తారు. కొంత మంది భాగంగా కూడా స్వీకరించరు. అందువల్ల తర్కశాస్త్రాన్ని మొత్తం అంతా కలిపి ఊహ అని చెప్పటం సరికాదు.

**d)** ఇంకా కొంతమంది, తర్కమూ, దానికన్నా మంచి తర్కమూ, దానిపై కోవకు చెందే మరీ మంచి తర్కమూ ... అంటూ తర్కాల పరంపరను గురించి చెప్పుతుంటారు. ఇక్కడ తర్కం అంటే వాదములో తెలివైన సమయస్ఫూర్తి అనే భావం కన్పడుతుంది. హేత్వాభాసంలేని (అభాసుకాని హేతువాదం, అంటే, దోషంలేని హేతువాదం, అంటే, Logic without fallacy). శాస్త్రబద్ధమైన నిర్ధారణనే తర్కం అంటాం. అదే ''సు'' తర్కం.ఇందులో మేలైన రకం అనేది వేరే ఉండదు.

**e)** ఒక్కొక్కప్పుడు లాఘవతర్కం అనే పదం ఎదురౌతుంది. దీన్ని ఆంగ్లంలో Principle of Parsimony అంటారు. దేనికైనా మనం అనేక కారణాలను ఊహిస్తే, వాటి అన్నింటిలోనూ సులభతమమైన దాన్ని స్వీకరించటమే లాఘవతర్కం. సులభమైన ప్రతిదీ సరియైనది కానక్కరలేదు కదా! కనుక లాఘవతర్కం అనేది తర్కంలో భాగం కాదు.

---

2 అన్నంభట్టు 15వ శతాబ్దంవాడు కాక 17వ శతాబ్దం వాడని భావించటమే సరియైనదని అనిపిస్తుంది. దీనిని గురించి భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ వారి తర్కసంగ్రహ ప్రచురణలోని ఆంగ్లపీఠికలో కొంత చర్చ ఉంది.

3 డా॥ రాజారామన్నగారి ఉపన్యాసం, భవన్స్ జర్నల్, ఫిబ్రవరి 1, 1978.

4 ఈ ప్రమాణాన్ని గురించి ముందర తెలిసికుంటాం.

f) కొన్ని సందర్భాలలో యుక్తి అనే మాటను వాడ్తారు దీన్ని రెండు అర్థాలలో వాడటం ఉంది. మొదటిది, సద్హేతువాదం అనే అర్థం. ఈ అర్థంలో వాడినప్పుడు, యుక్తి అంటే శాస్త్ర బద్ధమైన హేతువాదమౌతుంది ఇక, రెండోది సమయస్ఫూర్తి అనే అర్థం. అందువల్ల సందర్భాన్నిబట్టి యుక్తి అనే మాటకి అర్థాన్ని నిర్ణయించుకోవాలి.

g) శంకరాచార్యుడు శృత్యనుగ్రహీత (శృతి–అనుగ్రహీత) తర్కం అనే మాటను వాడుతాడు. దీన్ని గురించి యిక్కడ చర్చించటం మన ఉద్దేశ్యం కాకపోయినా, క్లుప్తంగా విషయాన్ని సూచించాలి. పరమార్థ విషయాలను చర్చించటంలో కూడా తర్కవిధానాన్ని వాడవలసి వస్తుంది. ఆ సందర్భాల్లో వేదప్రమాణాన్ని భంగపరచని విధంగా తర్కశాస్త్రాన్ని వాడుకోవాలనేదే శంకరుడు ఆమోదించిన శృత్యనుగ్రహీత తర్కం.

## 1. 3) ఈ రచన లక్ష్యాలు :

మనం అవలంభించే దృక్పధంమీద, అంటే, ఏఏ స్వీకృతాలను (Assumptions, axioms ను) తీసికొని, తర్కాన్ని వాడుతామో వాటిమీద, మనం నిర్ధారించే సిద్ధాంతాలు ఆధారపడి ఉంటాయి. ఏ పంథాలో నడిస్తే, ఏ సిద్ధాంతాలు వస్తాయో, వాటి జాబితాలను తయారుచేసి చూపటం ఈ రచన లక్ష్యం కాదు తర్కశాస్త్ర స్వరూపం ఏమిటో, మన అనుభవంలో ఉన్న కొన్ని సాధారణ విషయాలు హిందూ తర్కశాస్త్రంలో ఏ విధంగా అన్వయమౌతాయో విశదీకరించటమే మొదటి లక్ష్యం.

హిందూ తర్క శాస్త్రవేత్తలు వివరించిన కొన్ని భావాలు యీనాడు శాస్త్రంలో కొత్తవిగా చలామణి అవుతున్న భావాలతో ఏ విధంగా ఏకీభవిస్తున్నాయో, ఆ విషయాన్ని తెలుపటం ఈ రచన యొక్క రెండో లక్ష్యం.

# 2. ప్రమాణాలు

## 2. 1) జ్ఞానార్జన :

వైదిక కర్మకాండల ద్వారా ముక్తిని పొందవచ్చునని మీమాంసికులు కొందరు తలచారు. ఇది సరికాదనీ అవి మనశ్శుద్ధిని కల్గించేంతవరకే ఉపయోగపడుతయ్యనీ, ఆ తరువాత చింతన, పరామర్శల ద్వారా సత్యాన్వేషణ జరిపితే కాని మానవుడు ముక్తిని పొందజాలడనీ, నైయ్యాయికుడైన గౌతముడు బోధించాడు. జ్ఞానార్జనకి అవసరమైన శాస్త్రాలను చక్కగా అభ్యసించాలి. ఈ ఆశయంతోనే అన్నంభట్టు 'తర్క సంగ్రహం, తర్కదీపిక' అనే శాస్త్ర గ్రంథాలను రచించినట్టు కన్పిస్తుంది. జ్ఞానం సంపాదించాలంటే, పదార్థాలు, వాటి సంబంధాలు, భేదాలు, మొదలైన విషయాలను తెలుసుకొని, ఆపైన ఆలోచన, మననం, వివేచన, మొదలైన విధాల్లో కృషి చెయ్యాలి. అందువల్ల జ్ఞానార్జనకి ఏ పద్ధతి ననుసరించినా, ప్రత్యేకమైన అర్థాలతోవాడే ఏదో రకమైన పదజాలం, అవీ, ఇవీ ఉంటాయి. అన్నంభట్టు సర్వాన్ని ఏడు పదార్థాలుగా విభజించాడు. ఇక్కడ పదార్థం అనే మాటను వ్యుత్పత్తి అర్థంలో వాడాడు. ఒక అర్థం గల పదంతో పిలువదగ్గ వాటిని ఒక పదార్థం కింద చెప్పాడన్నమాట. ఈ ఏడింటిలోనూ ద్రవ్యం (Matter) మొదటి రకం. ద్రవ్యం మళ్ళీ 9 విధాలు. రెండో పదార్థం గుణం (Quality). గుణం మళ్ళీ 24 విధాలు. మూడో పదార్థం కర్మ (Action). సామాన్య (Generality), విశేష (Particularity), సమవాయ (Inherence), అభావ (Negation) అనేవి. మిగిలిన నాలుగు పదార్థాలు. పృథివి, ఆపః (నీరు, అంటే ద్రవపదార్థం), తేజస్సు, వాయువు, ఆకాశం (ఆంగ్లంలో Ether అనే టటువంటిది), కాలం, దిక్కు (ప్రదేశం లేక space), ఆత్మ, మనస్సు అనే తొమ్మిదీ ద్రవ్యాలు. ఈ రకమైన జాబితాలను వివరించటం, వాటిని గురించిన భావం కొంతైనా కల్గించటం మంచిదని చెప్పటం జరిగింది. పదార్థం అనే మాటను తీసికొందాం. అందరు పండితులు దీన్ని ఒకే విధంగా నిర్వచించలేదు. రకాలలోకి విభజనలు ఎవరి అభిరుచులనుబట్టి వారు చేసారు. గౌతముడు పదార్థాలను 16గా విభజించాడు. వేదాంతుల్లో కొందరు 'సత్, చిత్' అనే రెండు పదార్థాలనే గుర్తించారు. మరికొందరు 'సత్, చిత్, ఈశ్వర' అనే మూడింటిని గుర్తించారు. సాంఖ్యులు 25 పదార్థాలను, మీమాంసికులు 8 పదార్థలను వివరించారు. కాని అందరి లక్ష్యం ఒకటే. వీటిని గురించి తెలుసుకొన్నాక, వివిధ ప్రమాణాల ద్వారా తెలియవచ్చే విషయాలను తర్కించి, చర్చించి, దీర్ఘంగా ఆలోచించి, సుజ్ఞానార్జన చేసి, మోక్షసాధన విధానాన్ని తెల్పటమే అందరి లక్ష్యమూనూ. అందుకనే 'వినినంతనె వేగపడక వివరింపతగున్' అనే సూక్తిని చాలా గొప్ప అనుభవంతో చెప్పిన మాట అని తెలుస్తోంది.

## 2. 2) ప్రమాణం అంటే ఏమిటి ?

ఇప్పుడు జ్ఞానార్జనను తత్వాత్మకంగా పరిశీలిద్దాం. జ్ఞానార్జన ఎల్లా సాధ్యమౌతుంది? ఆర్జించిన జ్ఞానం ఎప్పుడు ఆమోదకర మౌతుంది? అనే అతి ముఖ్యమైన ప్రశ్నలు ఎదురౌతాయి. దేన్ని గురించైనా కలిగిన జ్ఞానం ఆమోదయోగ్యమైన విధానంలోనే కలిగిందని నిర్ణయించితే ఆ విధానాన్ని ఒక 'ప్రమాణం' అన్నారు. ప్రమాణాలను సాధారణంగా ఎనిమిది విధాలుగా చెప్తుంటారు. అవి – ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అనుభవము, అర్థాపత్తి, యోగదృష్టి, ఆప్తవాక్యము. అందరూ అన్నింటినీ ఒప్పుకోరు. హిందూ పండితు లందరూ మత దృష్టితోనే ఈ విషయాలను చర్చించారని యిదివరకే చెప్పుకున్నాం కదా! కనుక, వీరందరూ శబ్ద ప్రమాణాన్ని ఒప్పుకొంటారు. చార్వాకు లనేవారు ప్రత్యక్ష ప్రమాణాన్నొక్కదాన్నే ఒప్పుకొంటారని

చెప్తారు. హిందూ పండితు లందరూ ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాలను ఒప్పుకొంటారు. మిగతా అయిదింటిలో మాత్రం కొందరు కొందరు కొన్నింటినే ఒప్పుకొంటూ ఉంటారు.

## 2. 2. 1) ప్రత్యక్ష ప్రమాణం

చూపు, వాసన, స్పర్శ, రుచి, వినికిడి – వీటిద్వారా, అంటే కళ్ళు, ముక్కు, చర్మము, నాలుక, చెవులు అనే యింద్రియాలు చేసే పనులవల్ల మనం ఏవిషయాన్నైనా తెలిసికొంటే, ఆ జ్ఞానం మనకు కలిగిన విధానమే ప్రత్యక్ష ప్రమాణం.

జ్ఞానానికి ఆధారం ఏమిటనే ప్రశ్నను చర్చిస్తున్నామే కాని, ప్రమాణ విధానంలో ఏ దోషాలున్నాయి అన్న విషయం గురించి వివరించటానికి పూనుకోవటంలేదు. మనకు కలిగిన జ్ఞానం ఎంత వరకూ వ్యక్తిగతం ? ఎంతవరకు దేశకాల పరిమితం ? అలాంటి ప్రశ్న లనేకములు ఉంటాయి. వీటికి జవాబులు చాలా ఆసక్తి కలిగించేవే అయినా, మనకు ఆ పరిశీలన ప్రస్తుతం అనవసరం.

## 2. 2. 2) అనుమాన ప్రమాణం :

ఒక హేతువునుంచి సాధ్యాన్ని (ఫలితాన్ని, లేక నిగమనాన్ని) నిర్ధారించటంద్వారా కలిగే జ్ఞానార్జన విధానాన్ని 'అనుమాన ప్రమాణం' అంటాం. ఈ జ్ఞానం మనకు మనస్సుద్వారా మాత్రమే కలుగుతుంది. ఈ అనుమాన ప్రమాణమే తర్కశాస్త్రానికి ఆయువుపట్టు. దీన్ని గురించి ఎక్కువగా మున్ముందు తెలుసుకొంటాం.

## 2. 2. 3) ఉపమాన ప్రమాణం :

జ్ఞానాన్ని ఉపమానంద్వారా సంపాదిస్తే, ఆ విధానమే 'ఉపమాన ప్రమాణం'. ఉదాహరణలో వ్యక్తంచేసిన న్యాయమే మనం పరిశీలిస్తున్న సందర్భంలో కూడా వర్తిస్తుందని నమ్మతామన్న మాట. నయ్యాయికులు ఉపమాన ప్రమాణాన్ని ఒప్పుకొంటారు. ఇతరులు చాలామంది దీన్ని ప్రమాణంగా పరిగణించరు. పోలికద్వారా ఊహచెయ్యటానికి ఉపమానం పనికివస్తుందే కాని, మనం పరిశీలిస్తున్న సందర్భం ఆ ఉపమానాన్నిఎంతవరకు పోలిఉంటుందో, దాన్నుంచి ఎంత భేదిస్తుందో తెలియదు.

ఉపమానాధారమైన వాదన అనుమాన ప్రమాణంలో ఐదు అంగాలతో ఉండే హేతు – సాధ్య తర్క భాగానికి (Syllogismకి) మొదటిమెట్టు. మనకు తెలిసిన చాలా సందర్భాల్లో ఒక న్యాయం వర్తిస్తూ ఆ న్యాయం భంగపడే ఉదాహరణలేవీ తెలియకపోతే, ఆ న్యాయాన్ని సర్వసత్యంగా సూత్రీకరిస్తాం. ఈ సూత్రీకరణను విస్తృతీకరణ (universalization) అనవచ్చు. ఈ సూత్రంతో సరిపోయేటట్లు కనపడే కొత్త సందర్భం వచ్చినప్పుడు, ఆ ఫలితమే యిక్కడ కూడా వర్తిస్తుందని స్వీకరిస్తాం. అంటే; ఒక్కటే ఉదాహరణనుంచి కాక అనేకమైన ఉదాహరణల నుంచి (విరోధ ఫలిత జ్ఞాన అభావాన్ని మద్దతుగా తీసికొని) ఫలితాన్ని సంపాదించే ప్రక్రియకు ఉపమాన ప్రమాణం నాంది అనటంలో సందేహంలేదు. హిందూ పండితులు వివరించిన రీతిగా ఐదు అవయవాలతో నిర్మాణం చేయాల్సిన హేతు – సాధ్య తర్క భాగాన్ని గురించి మళ్లీ తర్వాత విపులంగా తెలుసుకొంటాం.

## 2. 2. 4) శబ్ద ప్రమాణం :

## a) అర్థయుక్త వాక్య ప్రమాణం :

శబ్దప్రమాణం అంటే కర్ణేంద్రియానికి కేవలం వినబడే చప్పుడు కాక, (సామాన్యంగా ఒక వాక్యరూపంలో ఉండే) అర్థవంతమైన పదజాలం తెలిపే విషయం.

ఈ ప్రమాణానికి సంబంధించిన ఆనాటి చర్చలలో యీనాడు మనకు చిత్రమైనవని అనిపించేటటువంటివి కొన్ని వాదోపవాదాలు జరిగాయి. అవి చాలావరకు నిరుపయోగమైనవి కూడాను. పాశ్చాత్యులు ఊహించిన ether వంటి ద్రవ్యంగా ఆకాశాన్ని హిందూశాస్త్రవేత్తలు నిర్వచించారు. ఇది శూన్యం కాక సర్వత్ర వ్యాపించిఉండే ద్రవ్యమని వారు భావించారు. శబ్దం ఆకాశపు గుణమని కూడా వారు స్వీకరించారు. చప్పుడు మన చెవులకు ఏ విధంగా సోకుతుందో వారు గ్రహించలేకపోయారు. అందువల్లనే అది వారికి ఒక ముఖ్యప్రశ్న అయింది. సర్వత్ర వ్యాపించి ఉండే ఆకాశంలో భాగమై, మన కర్ణములందుండే ఆకాశంద్వారా, చప్పుడును ప్రత్యక్షంగా వినగలుగుతున్నామని అనుకొన్నారు.

అర్థవంతమైన వేదవాక్యాలు శబ్దప్రమాణం అవుతాయికదా! ప్రతి శాస్త్రాన్ని హిందూపండితులు పారమార్థిక దృష్టితోనే అభ్యసించి కృషి, చేసేవారని యిదివరకే తెలుసుకొన్నాం. వేదవాక్యాలకు సంబంధించే ప్రయోజనం ఈ శబ్ద ప్రమాణానికి ఉందని స్పష్టమౌతోంది. అందువల్ల శబ్దంయొక్క అసలు స్వరూపాన్ని తెలుసుకోవాలనే కుతూహలం వారిలో బయలుదేరింది. దానితో, శబ్దం నిత్యమా? అనిత్యమా? అనే ప్రశ్నను లేవదీసి, చర్చలు సాగించారు.

ఆకాశం స్పర్శలేనిది కనుక దాని గుణమైన శబ్దం నిత్యం అన్నారు కొందరు. ఈ హేతువులో దోషం ఉందనీ, స్పర్శలేనిది

అనిత్యంగా ఉండవచ్చుననీ, సోదాహరణంగా చెప్పాలంటే స్పర్శలేని బుద్ధి అనిత్యమనీ చెప్పేతూ దీన్ని మరికొందరు ఖండించారు.[5]

అర్థవంతమైన వాక్యాన్ని ఆప్తుడో, గురువో, చెప్పితే, దాన్ని, ఆప్తవాక్య ప్రమాణమనీ, సత్యాన్వేషియైన మేధావి చెప్పితే దాన్ని యోగదృష్టి ప్రమాణమనీ, రెండు ప్రత్యేక ప్రమాణాలను త్వరలోనే తెలుసుకోబోతున్నాం.

ఏదోరకంగా అర్థం చెప్పటానికి వీలున్న వాక్యాలన్నీ ప్రమాణాలు కానక్కరలేదనే విషయం వేరే చెప్పాల్సిన అవసరంలేదు కదా! కనుక, యికమీదట సుజ్ఞాన దాయకమైన వాక్యాలను గురించే మనం ముఖ్యంగా పరిశీలించాలి.

## b) వేద ప్రమాణం :

కొత్త జ్ఞానాన్ని ప్రసాదించే ముఖ్యమైన వాక్యాలకే యీ శబ్ద ప్రమాణాన్ని ప్రత్యేకంగా వర్తింపచేస్తూ, ఆ వాక్యాలను వేదంలోనివిగా తీసికొందాం. అంటే ఇక నుంచి శబ్ద ప్రమాణాన్ని వేద ప్రమాణంగా తీసుకొంటూ మన్నమాట. హిందూ పండితులు వేదాన్ని ప్రమాణంగా స్వీకరించటంలో అసహజత్వమేమీలేదు. నిజం చెప్పాలంటే, ఏ మతాన్ని అనుసరించే పండితులు ఆ మతములోని మూల గ్రంధాన్ని (లేక గ్రంథాలను) ప్రమాణంగా స్వీకరించటం సహజమే కదా!

వేదం అపౌరుషేయం కనుక అది ప్రమాణం అని కొందరంటారు. అపౌరుషేయం అంటే దాన్ని రచించిన కర్త లేడని అర్థమే కాని, దీనిని రచించినది మానవులెవరూకాక, దైవమే అని అర్థం కాదు అని కొందరి భావం. రచించిన కర్త లేనేలేనప్పుడు, ఆది లేకుండా, అన్ని కాలములందూ, అది ఉన్నది అనే అర్థం చెప్పాల్సి వస్తుంది. ఆంగ్లంలో eternal అని చెప్పే సందర్భం అన్నమాట. ఈ అర్థం ప్రకారం ఋషులు వేదాన్ని ఉన్నదాన్ని ఉన్నట్టుగా తెలుసుకొన్నారని కూడా చెప్పాల్సి వస్తుంది.

అపౌరుషేయం అనే కారణంగా కాక, వేదంలోని భాగాలను పరస్పర విరోధభావాలు రాకుండా అన్వయం చేయవచ్చుననే అభిప్రాయంతో, కపిలుడు, మొదలైన సాంఖ్యులు వేదాన్ని ప్రమాణంగా ఒప్పుకొంటారు

అయితే, వీరందరూ ఏ విషయాన్నైనా పరిశీలించకుండా గుడ్డిగా నమ్మటం సరికాదని ఒప్పుకొన్నవారే. అలాంటప్పుడు వేదంలోని అన్ని భాగాలను ప్రమాణంగా తీసికోవాలా, లేదా? అనే ప్రశ్న వస్తుంది. వేదంలో జీవాత్మ పరమాత్మల సంబంధ విషయాలైన వేదాంత భాగమే కాక, మనము నిత్యమూ ఆచరించవలసిన విధులూ, స్తోత్రాలూ, సత్యాసత్యాలకు సంబంధములేని సంగతులూ, శాస్త్రబద్ధంగా నిర్ధారించేందుకు వీలుండే అంశాలూ కూడా ఉన్నాయి. ఈ సందర్భంలో రెండు విషయాలను చెప్పాలి.

1. శంకరుడి గురువైన గోవిందపాదునికి గురువు గౌడపాదుడు. ఈ గౌడపాదునికి బౌద్ధమత మందెక్కువ గౌరవముండటమే కాక, వేదోక్తమైన కొన్ని సిద్ధాంతాలను బౌద్ధమతంలోని కొన్ని ముఖ్యాంశాలతోనూ, హేతు — సాధ్యవాదంతో వచ్చే ఫలితాలలో కొన్నింటితోనూ, అన్వయించవచ్చునని భావించాడు.

2. వేదాలలో చెప్పిన దేవతల ఉనికి, వర్ణనలు, వంటివి సత్యాసత్యాలకు సంబంధంలేని విషయాలు. కాబట్టి శాస్త్ర విధానాలకు అతీతమైన (వ్యక్తిగత) నమ్మకాలమీద ఆధారపడి ఉండే వేదాంత భాగాన్ని మినహాయిస్తే, మిగతా వేదభాగాన్ని ప్రమాణంగా ఒప్పుకోవలసిన అవసరమేమీ కనపడదు. ఆగమాలను (వేదాధార సంప్రదాయాన్ని) కూడా తర్కించాలని పావులూరి మల్లన తన 'గణిత గ్రంథంలో' (పావులూరి గణితం అనే తాటాకు ప్రతి, ఆంధ్ర విశ్వ కళా పరిషత్తు లైబ్రరీలో ఉంది.) మొదటి పద్యంలో చెప్పిన భాగం ఈ క్రింది విధంగా ఉంది —

> '... ... ... ...
> తర్క వ్యాకరణాగమాది బహు శాస్త్రప్రోక్త నానార్థ సం
> పర్కాభి వ్యవహారమున్ ... ...
> తర్కింపన్ గణిత ప్రవృద్ధి వెరిగా దొక్కొండెరింగించునే'

ఇతను తర్కం గణితంలో భాగమని స్వీకరించినట్లు కనబడుతుంది. ఈనాడు symbolic logic ను గణితంలో వాడుతున్న దృష్ట్యా గణిత తర్కాలమధ్య తత్వాత్మక భేద మంత లేదనే చెప్పవచ్చు. ఇది వేరే విషయం గనుక వదలివేద్దాం.

'పెద్దలు చెప్పినదానిని తర్కించరాదు, నీకేమి తెలుసునని విమర్శిస్తున్నావు?' అని ఆంక్షను విధించటం చాలా పొరపాటనీ,

---

5 ఒక సాధ్యానికి హేతువుగా చెప్పినది ఆ సాధ్య అభావంతో విరోధించకపోతే, దానిలో హేత్వత్వం సంపూర్ణంగా లేదని గ్రహించవలసి ఉంటుంది కదా! ఈ రెండు విరోధ (అంటే, సాధ్య, సాధ్యాభావ) విషయాలలో ప్రతిదానికి ఇది కొంత వరకే కారణం కావచ్చు. ఇటువంటి హేతువుద్వారా సాధ్యాన్ని చెప్తే ఆ దోషాన్ని 'అనైకాంతికం' అంటారు.

శబ్దానికి స్పర్శ గుణం లేదనే భ్రమలో పడ్డారు ఆనాటి హిందూ పండితులు. వారిలో కొందరు స్పర్శరాహిత్యాన్ని హేతువుగా తీసికొని, శబ్దానికి నిత్యత్వం సాధ్యంగా ఆపాదించారు. దీనిలో అనైకాంతిక దోషం ఉంది. ఎందుకంటే స్పర్శ రాహిత్య స్వభావం శబ్దానికి నిజంగానే ఉందనుకొన్నా, ఆ స్వభావం అనిత్యతతో విరోధించదని బుద్ధిని ఉదాహరణగా, చెప్పవచ్చును కనుక.

ప్రతి విషయాన్నీ హేతుబద్ధంగా విమర్శించి, తద్వారా జ్ఞానార్జన చేయటమే హిందూ పండితులు ఎప్పటికప్పుడు చూపిన మార్గమనీ, నొక్కి చెప్పాల్సిన అవసరం యీనాడెంతైనా ఉంది.

పరమార్థానికి సంబంధించిన విషయాలలో వేదాన్ని ప్రమాణంగా తీసుకోకపోతే మనకు కొంత తీరనిలోటు మిగిలిపోతుందని కొందరి (వేదాంతుల) అభిప్రాయం హేతువాదం ద్వారానే పరమాత్మాన్వేషణ చేసేయెడల దేవుడు ఉన్నాడనే నమ్మకంలో విరోధ భావాలేమీ లేవు అనే ఘట్టం దగ్గర యీ అన్వేషణ ఆగిపోతుంది. పరబ్రహ్మం సచ్చితానంద స్వరూపం అనే భావం కలుగటానికి వీలుండదు. ఇది లోటా? కాదా? అనేది ఎవరికి వారు నిర్ణయించుకోవాలి.

పై కారణాలవల్ల వేదప్రమాణంయొక్క ప్రాముఖ్యత పరమార్థ చింతనకు సంబంధించి ఉండే సందర్భాలలో మాత్రమే నని చెప్పవచ్చు

## 2. 2. 5) అనుభవ ప్రమాణం :

బ్రహ్మ జ్ఞానానికి సంబంధించిన విషయాలలో కొందరు అనుభవాన్ని ఒక ప్రమాణంగా తీసికొంటారు.

మిగిలిన సందర్భాలలో, అనుభవం అనేది ఒక కొత్త ప్రమాణం కాదు. మిగతా ప్రమాణాల ద్వారా తెలిసికొన్నదే అవుతుంది. అందువల్ల యీ సందర్భాలలో అనుభవాన్ని స్వతంత్ర ప్రతిపత్తిగల ప్రమాణంగా స్వీకరించనక్కరలేదు.

## 2.2. 6) అర్థాపత్తి ప్రమాణం :

ఉచితమైన ఊహను (లేక ప్రతిపాదనను) అర్థాపత్తి అంటారు.

ఉదా : పీనో దేవదత్తో దివా న భుంక్తే

అనగా—లావుగావుండే దేవదత్తుడు దివమందు భోజనం చేయడు అనే సందర్భంలో "దేవదత్తుడు రాత్రులందు భోజనం చేస్తాడు" అనే ఊహను చేస్తే, ఆ ఊహ అర్థాపత్తి అవుతుంది. ఎందుకంటే ఈ ఊహ ఉచితంగానే ఉంది. దేవదత్తుడు పగలు భోజనం చేయడు, అయినప్పటికి, బలిసి ఉన్నాడు అనే పొంతనా లేని రెండు అంశాలను సమన్వయపరచే ఊహ ఇది. ఇతడు రాత్రి వేళ భోంచేస్తున్నాడన్న కొత్త జ్ఞానాన్ని మనకు కలిగిస్తోంది

యీ ప్రతిపాదన. ఈ కొత్తజ్ఞానం మనకు అర్థాపత్తి ప్రమాణం ద్వారా వచ్చినదంటాం. దీనిని అందరూ ప్రమాణంగా ఒప్పుకోరు. కొందరు వేదాంతులూ, మీమాంసికులు దీనిని ఒప్పుకుంటారు. ఇక నైయ్యాయికులు దీనిని ఒప్పుకొంటారు కాని, దీనికి స్వతంత్ర ప్రమాణ ప్రతిపత్తిని యివ్వరు. ఇది అనుమాన ప్రమాణంలోని కేవల వ్యతిరేకి కిందికి వస్తుందని వారంటారు. అర్థాపత్తిని కేవల వ్యతిరేకిగా తీసికోటం ఎంతవరకూ భావ్యమో, తెలిసికోటానికి ఆ ఉదాహరణను ఇంకొంచెం లోతుగా పరిశీలిద్దాం. ఉచితమైన ఊహ లన్నింటిని చెప్పి, దానిలో ఒక ప్రతిపాదనను మాత్రం అర్థాపత్తిగా విడదీసి చెప్పి, మిగతా ఊహల నన్నింటిని ఖండిస్తే, మన అర్థాపత్తి కేవల వ్యతిరేకి అవుతుంది. పై ఉదాహరణలో మిగతా అన్ని (ఉచితమైన) ఊహలను వివరించటం మరి జరుగలేదు కదా! ఒక వేళ, దేవదత్తుని శరీరం జబ్బువల్ల పొంగి ఉందేమో ? మరి వేరే కారణమేమైనా ఉందేమో ? అందువల్ల యీ అర్థాపత్తి కేవల వ్యతిరేకి అనటం సరికాదు. కనుక, అర్థాపత్తిని అంగీకరించక పోవటమో, లేనిపక్షంలో దానికి స్వతంత్ర ప్రమాణ ప్రతిపత్తి నివ్వటమో చెయ్యాలి

అర్థాపత్తిని ఆమోదించేవారు తద్వారా కలిగే జ్ఞానంతో విరోధించే కొత్త విషయాన్ని ఎదుర్కొనేంతవరకూ, ఆ జ్ఞానంలో తర్కాత్మక దోషమేమీ లేదనే భావిస్తారన్నమాట.

అర్థాపత్తిని ప్రమాణంగా ఒప్పుకొన్నామనుకోండి పైగా, ఆ ఊహను తప్ప వేరే ఏ ఇతర ఊహనూ చేయలేకుండా కూడా ఉన్నామనుకోండి. అటువంటి సందర్భంలో ఆ ఊహకు మనం మంచి విలువను సహజంగా యివ్వాలి. ఎందుకంటే, యీ ప్రతిపాదనవల్లనే కాని వేరేవిధంగా పైకి విరోధభావాలుగా కనబడేవాటిని సమన్వయపరచలేకపోతున్నాం కదా ! తరుచు, యిటువంటి ప్రతిపాదన ఒక తత్వాత్మక స్వీకృతంగా రూపొందుతుంది.

ఈ శతాబ్దంలో ప్రతిపాదించబడిన తరంగ గమన శాస్త్రం **(Wave mechanics)**లో ఒక ఉదాహరణ దీనికి సరిపోతుంది. కణ రూపంలో ఉండి వెలుతురు సరళరేఖల మార్గంలో ప్రసారమౌతుం దనీ, అందువల్లనే నీడల అంచులు స్పష్టంగా ఏర్పడుతాయనీ, చాలాకాలం క్రిందే గ్రహించారు. అటు తరువాత కొన్ని కారణాల వల్ల వెలుతురు తరంగాలుగా ప్రసారమౌతుందని భావించారు. అయితే ఒకేకాలంలో వెలుతురు రెండు రూపాల్లోనూ ప్రసరిస్తూ ఉంటుందని చెప్పటానికి వీలులేక తికమకపడ్డారు. దు బ్రాగ్లీ **(De Broglie)**, ష్రాడింగర్ **(Schrodinger)**లు తరంగి గమన శాస్త్రాన్ని ప్రతిపాదించి, ఆ చిక్కును విడదీసి, విషయాలను సమన్వయంచేసి, నోబెల్ బహుమతుల నందుకొన్నారు. "ప్రయోగానికి ముందు వెలుతురులో కణ, తరంగ గుణాలు రెండూ యిమిడి ఉంటాయి. వెలుతురును ఈ రెండు గుణాల్లో ఏదో ఒకే గుణాన్ని ప్రదర్శించేవిధంగా మనం చేసే ప్రయోగం చేస్తుంది" అని వారి ఊహ. ఏ గుణాన్ని ప్రదర్శిస్తుందో అది ప్రయోగంమీద ఆధారపడి ఉంటుందనే ఈ ఊహను అర్థాపత్తిగానే చెప్పాలి.

## 2. 2. 7) యోగదృష్టి ప్రమాణం :

గొప్ప మేధావులు బహుకాలం ఏకాగ్రతతో ఆలోచించి, గ్రహించే విషయాలను స్వీకరించటంద్వారా వచ్చే జ్ఞానాన్ని యోగ దృష్టి ప్రమాణంద్వారా వచ్చిందంటాం. తపస్సు ఫలితంగా తెలిసికొని ఋషులు (లేక గురువు) విశదీకరించిన విషయాలు యీవిధంగా సంపాదించిన జ్ఞానభాగమే అవుతాయి. దీనిని **Transcendal perception** అంటారు. వారు నిరంతరం జరిపిన యోచన ఏ విధంగా నడిచిందో నిర్ణయించటానికి కూడా వీలులేనిదై ఉండ వచ్చు. ఈవిధమైన కృషివల్ల వారికి స్ఫురించిన విశేషాలకు మనం తప్పకుండా చాలా విలువ నివ్వాల్సిందే! సందేహంలేదు. ఉదాహరణకి న్యూటన్, శ్రీనివాస రామానుజములు అసాధారణమైన స్ఫురణ శక్తిని **(Intuition based on thinking with extreme concentration)** కలిగి ఉండేవారని మనకు తెలుసు. కాని, అంత మాత్రంచేత, వారు చెప్పిన ప్రతివిషయం ఆమోదించవలసినదేనా ? వారు చెప్పిన వాటిల్లో కొన్ని హేతుబద్ధముగ లేవని తరువాత తెలుసుకొన్నారుకదా?

అందువల్ల పెద్దలు కూడా ఒక్కొక్కప్పుడు భ్రమకు లోనౌతారనే కారణంగా యోగదృష్టి ప్రమాణాన్ని మీమాంసికుల్లో కొందరు ఒప్పుకోరు.

## 2. 2. 8) ఆప్తవాక్య ప్రమాణం :

నమ్మతగినవారు (అంటే, మోసము, డంబము లేనివారని మనం నమ్మేవారు) తమకు తెలిసిన విషయాన్ని మాత్రమే, మన హితవుకోరి చెప్పుతున్నారని మనం భావించినప్పుడు వారు చెప్పిన దాన్ని స్వీకరిస్తే వచ్చే జ్ఞానం ఆప్తవాక్య ప్రమాణంవల్ల కలిగిందంటాం. దీనినే ఆర్యవాక్య ప్రమాణమని కూడా అనవచ్చు.

ఈ ప్రమాణాన్ని సాంఖ్యులు ఒప్పుకొన్నారు. కాని, సాంఖ్య—యోగాలను కలిపి అనుసరించేవారు, దీన్ని ఒప్పుకోరు.

చేష్ట, ఏతిహ్య (సంప్రదాయం) మొదలైన ప్రమాణాలను కూడా కొందరు స్వీకరిస్తారు. వీటిలో ప్రత్యేకంగా శాస్త్రీయ జ్ఞానాన్ని ప్రసాదించే శక్తి తగినంతగా లేదనే ఉద్దేశంతో వీటిని వదలివేస్తున్నాం.

*(ఇంకా ఉంది)*

శ్రీ విక్రాల శేషాచార్యులు

# శ్రీనాథుని వల్లభాభ్యుదయము

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే.
భగవద్గీత ౪ అధ్యాయే ౮ శ్లోకః.

అన్నట్లు భూమిలో దుష్టులు ప్రబలి, శిష్టులను బాధించు నప్పుడు భగవంతుఁ డవతరించి దుష్టులను దునిమి, శిష్టులను బ్రోచును. దానితో ధర్మము ప్రతిష్ఠితమగును. శిష్టులు ధర్మావలంబులు కనుక. నృసింహ – రామ – కృష్ణా ద్యవతారము లిట్టివే కదా ?

అట్లే తొల్లింటి కలియుగములో భగవంతుఁడు పుణ్యాధికుఁ డయిన సుచంద్ర మహారాజునకు తనూజుఁడై, లోకకంటకుఁడైన నిశుంభుఁడను దానవాధిపుని అమిత బలసమేతుని సమర రంగమున హతమార్చి, త్రిభువనములకు భవ్యమును చేకూర్చి, ఆంధ్ర నాయకుఁ డని విఖ్యాతిఁ గాంచెను. ఇట్టి యవతార పురుషులు అవతారను చాలించిన వెనుక ఆయన యే దేవుని యంశముతో జనించెనో మహర్షులు కనుఁగొని, ఆ దేవతకు చెందిన ఆగమశాస్త్ర ప్రకార మాయనను బ్రతిష్ఠించి పూజించెదరు ఇవే అర్చావతారములు. ఈ యర్చావతారములలో భగవంతుఁడు నెలకొనియుండును గనుక ఆ యర్చామూర్తులు తమనునమ్మి,కొలుచువారిని కాచుచునేయుందురు. ఇట్టి చరిత్రములను మహర్షులు పురాణములలోఁ దెలిపుదురు. ఇట్లు అర్చామూర్తిగఁ బ్రతిష్ఠితుఁ డయిన భగవంతుని అవతార–భక్త పరిత్రాణాది చర్యలను దెలిపెడి పురాణ భాగములకు క్షేత్ర మాహాత్మ్యము లనియు, స్థల పురాణము లనియుఁ బేళ్లు. ఇట్టి స్థల పురాణములు చాలవరకు తెనుఁగులో ననువాదము చెంది–కొన్ని ముద్రితములై సూర్యాలోక భాగ్యము నొంది యున్నవి. ఆంధ్ర నాయక స్వామివారిచరిత్రము నాకు తెలిసినంతవరకు రెండు–మూడు పురాణములలో నున్నట్లు తెలియుచున్నది. ఈ యాంధ్ర నాయక స్వామి కృష్ణాజిల్లా దివి తాలూకాలో [1] శ్రీకాకుళ మనెడు క్షేత్రమున వేంచేసి యున్నవారు కనుక వారి యవతారాది చరిత్రముఁ దెలిపెడి పురాణభాగము శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమని పేరు కలది.

ఈ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యము మహా పురాణములలోని బ్రహ్మాండ పురాణము ఉత్తర ఖండములోని 'నారద సంహిత'లోనిది. (౯౭ వ అధ్యాయము మొదలు ౧౦3 వ అధ్యాయము కడవరకు మొత్తము ౧౭ అధ్యాయములు కలది) చాల కాలమునాడు మచిలీపట్నములో ముద్రితమైనది కలదు. ప్రకాశం జిల్లా కందుకూరు తాలూకాలో కలికివాయ గ్రామమునందు మా తండ్రిగారు విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి కళానిధి శ్రీమాన్ కీ. శే. విక్రాల రామచంద్రాచార్యులవారు మా యింట స్థాపించిన మా సొంత సరస్వతీ పుస్తక భాండాగారములో నీ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యము వ్రాసిన యొక తాళపత్ర గ్రంథ ముండినది. కాని యీ యచ్చు గ్రంథము తాటాకుల గ్రంథములలోని కొన్ని శ్లోకముల, కొన్ని కథలును భిన్న ప్రకారములుగ నున్నవి. మా యింటిలోని తాటాకుల పొత్తములోని ౪–౫ శ్లోకములు[2] మండ లక్ష్మీనరసింహాచార్య ప్రణీతమైన "ఆంధ్ర కౌముది" యను సంస్కృత భాషతో రచితమైన తెనుఁగు వ్యాకరణ గ్రంథము మొగట నొక సందర్భములో కవి చేర్చి యున్నాఁడు. ఈ శ్లోకములు మా పెద్దలు వ్రాసుకొనిన మా యింటిలోని తాళపత్ర గ్రంథములో నున్నవి. కాని పూర్వోక్తమైన మచిలీ పట్టణములో నచ్చైన గ్రంథములో లేవు. మా యింటిలోని తాళపత్ర గ్రంథము నేను పారాయణము చేసినది యిప్పుడదృశ్యమైనది.

జ్ఞాపకముననున్న అందలి శ్లోకములను పాఠకుల యెఱుక కొఱకు వ్రాయుచున్నాను :

"శ్లో॥ పురా స్వాయం భువమనోః కాలే కలియుగే కిల। కాకులే రాజవర్య స్య సుచంద్రస్య తనూభవః;॥ ... ఆంధ్ర విష్ణుస్సురయుతో నిశుంభ దను జాపహః। అభవ త్సర్వ దేవైశ్చ వేష్టితో లోక పూజితః॥...శ్రీశైల భీమ కాళేశ ద్వార త్రితయ సంయుతం। ప్రాకారం సుమహ త్కృత్వా ... ప్రమథైర్వృతః॥...తదా ప్రభృతి త త్క్షేత్రం త్రిలింగ మితి విశ్రుతమ్...॥" ఇత్యాది.

మఱియొకటి – చెంగల్పట్టు జిల్లా సత్యవేడు పోస్టు ఈగా వారి పాలెములో శ్రీ వైఖానస గ్రంథమాల వారి క్యాటలాగులో శ్రీ కాకుళ క్షేత్ర మాహాత్మ్యము 0–4–0 అని యొకటి కనుపించుచున్నది. ఆ గ్రంథమిప్పు డలభ్యమని తెలిపినారు. ఇది యే పురాణములోనిదో ? నేను చూడలేదు.

మఱియొకటి–1923 వ సంవత్సరములో శ్రీ ప్రోలిపెద్ది వేంకట రామశర్మగారు 'శ్రీకాకుళ శ్రీహరి శతకము' అను తెనుఁగు శతక మొకటి చెన్నపురిలో అచ్చువేయించుచు నందు ముందు వారు వ్రాసిన ముందు మాటలలో మఱియొక దానిని తెలిపియున్నారు. ఆ మాట లివి:– "ఈ నడుమ "శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్య"మను సంస్కృత గ్రంథ మొకటి ముద్రింపఁబడెను. అదియు బ్రహ్మాండ పురాణాంతర్గత మనియే కలదు పై శ్లోకము లందున్నవేమోయని

పరిశీలించితిని గాని కానరాలేదు. అందలి కథాంశమునకును, మీఁది శ్లోకముల కథాంశమునకును సంగతియే లేదు. ...

ఇచ్చట "పై శ్లోకము లందున్నవేమో యని పరిశీలించితిని గాని కానరాలేదు" అను పంక్తిలోని "పై శ్లోకము" లనఁగా ముందు త్రిలింగ శబ్దాను శాసనమునందలి శ్లోకముల విషయము ప్రస్తావన కనుక ఆ త్రిలింగ శబ్దాను శాసన సముద్ధృత శ్లోకము లని తెలియఁ దగును.

ఇక నాంధ్రములో – భట్లపెనుమర్తి కోదండ రామకవి విరచితమైన [3]వల్లభాభ్యుదయ మను పేరుగల శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యము పద్య కావ్యము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో నున్నట్లు ౧౯౫౫ వ సంవత్సరములో విశ్వదాత ఆంధ్రపత్రికా భారతీ సంపాదకులైన శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుగారు ముద్రింపించిన ఆంధ్ర వాఙ్మయ సూచికయం దముద్రిత గ్రంథముల పట్టికలో చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారపు గ్రంథపట్టికలో కనుపించుచున్నది. ఇది అచ్చైనట్లు కానరాదు. కనుక ఇది యే పురాణములోని ఆ క్షేత్ర మాహాత్మ్యమున కను వాదమో తెలియదు.

మఱియొకటి ముఖ్యమైనది – శృంగార నైషధాది బహు ప్రబంధకర్త శ్రీనాథుఁడు కూడా[4]"వల్లభాభ్యుదయ"మను పేరుతో శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యమును శ్రీకాకుళ స్వామికే అంకితముగ విరచించెనని తెలియుచున్నది. ఈ విషయము యం. శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాద్ (ఎమెస్కో)వారు 1972 వ సం॥రములో ముద్రింపించిన వినుకొండ వల్లభరాయుని క్రీడాభిరామము మొదట బి. వి. (బొమ్మకంటి వేంకట) సింగరాచార్య విరచిత "సమాలోకనము" లో ౧–౬ తావుల తెలుపఁబడియున్నది అందులోనొకటి–౫౬ (LVI)వ పుటలో "శ్రీనాథుఁడు శ్రీకాకుళాధీశ్వరుఁ డగు తెలుఁగు రాయని దర్శించి, యతని కంకితముగా వల్లభాభ్యుదయము చెప్పెను గదా !"అని ఈ విషయములు శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారి 'క్రీడాభిరామ పీఠిక'లోనివి యట. కావున శ్రీనాథుఁడు "వల్లభాభ్యుదయము" అను పేరుతో శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్యము నచ్చట స్వామికే యంకితముగ రచించెనని తెలియనై యున్నది. ఇంకను నీ శ్రీమాన్ బి. వి సింగరాచార్యులవారు తమ "సమాలోకనము" లో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రుల వారియు శ్రీనాథుని వల్లభాభ్యుదయము ను గుఱించిన పంక్తులనున్ను ఉదాహరించియున్నారు.

మఱియును పూర్వోక్తులైన శ్రీ ప్రోలిపెద్ది వేంకటరామ శర్మగారే "శ్రీకాకుళ శ్రీహరి శతకము"కు తొలుత వ్రాసిన ముందు మాటలో— "ఇప్పటికి నూరేండ్లకుఁ బూర్వము వల్లభాభ్యుదయ మను పేర నీ శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యము ప్రబంధ రూపమునఁ దెలిగింపఁబడినది. అది యిప్పుడు దొరకి యున్నది. ఆ తెలుంగు ప్రబంధకర్త తనకు దొరకిన సంస్కృత గ్రంధము తార్మారుగా నున్నదని చెప్పుకొన్నాఁడు. అచ్చుపడిన యీ సంస్కృత స్థల మాహాత్మ్యమునకును, నీ తెనుఁగు గ్రంధమునకును బహుభేదము లున్నవి...త్రిలింగ శబ్దానుశాసనోద్ధృత శ్లోకములకు, సంస్కృత స్థల పురాణమునకునుఁ, దెలుఁగు పద్యకావ్యమునకును సంగతి లేదంటిని." ఇత్యాదిగఁ దెలిపియున్నారు. ముద్రితమైన సంస్కృత స్థల పురాణమునకును, ఇటఁ బేర్కొనిన శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్య ప్రబంధమునకును బహు భేదము లున్నందున నీ తెనుఁగు ప్రబంధ మేపురాణములోని శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యమున కనువాదమో ? ...ఇందుచేత–శ్రీ వేంకటాచల మాహాత్మ్యము, వరాహపురాణము, వామనపురాణము,పద్మపురాణము,భవిష్యోత్తర పురాణము,బ్రహ్మాండ పురాణము, స్కాందపురాణము మున్నగు పదిరెండు పురాణములలో నుక్తమై నట్లును, మైసూరు రాష్ట్రములోని శ్రీ యాదవాచల (మేలుకోట) మాహాత్మ్యము మున్నగు ఐదు పురాణములలో నుక్తమైనట్లును, నీ శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యము కొన్ని పురాణములయం దుక్తమైనట్లు తెల్లమైనది.

కనుక నీ పై క్షేత్రములయు శ్రీరంగ కాంచీ ప్రభృతులైన మఱికొన్ని క్షేత్రములయు ననేక పురాణోక్త మాహాత్మ్య ప్రతిపాదక భాగములను ఎత్తి ఒక్కటిగ నచ్చువేసిన విధమున నీ శ్రీకాకుళ క్షేత్ర మాహాత్మ్య భాగములు వివిధ పురాణోక్తములైనవి సంపాదించి, యొక్కటిగ ముద్రింపఁదగినవి.

ఆంధ్రములో ముద్రితములై ఉపలభ్యమానములైన శ్రీనాథుని రచనలలో 1. శృంగారనైషధము, 2. భీమఖండము, 3. కాశీఖండము, 4. హరవిలాసము, 5. శివరాత్రి మాహాత్మ్యము

మానవాంకితములైన పౌరాణిక కావ్యములు. 6. పల్నాటి వీరచరిత్ర మానుష చరిత్రము 7. పండితారాధ్య చరిత్ర మతగురువుల చరిత్రయని పేరు తెలుపుచున్నది. 8 శాలివాహన సప్తశతి, 9. మరుత్తరాట్చరిత్ర, 10. రసికాభిలాషము లెట్టివో? మఱియు శ్రీనాథుని చరిత్రములలోను, శ్రీనాథుని గ్రంథముల పీఠికలలోను శ్రీనాథుని రచనలుగ కనుపించుచున్న 11. నందనందన చరిత్రము 12. ధనంజయ విజయము 13. మానసోల్లాసము కూడా అంతరించిననందున నెట్టివో తెలియరాకున్నది.

1–2–3–4–5 అంకెలుగల మొదటి పౌరాణిక కావ్యములైదు మానవాంకితములు కాగా పౌరాణిక ప్రబంధమైన ఈ వల్లభాభ్యుదయ మాతని గ్రంథములలో దేవతాంకితమైనది. ఏ మతమునకు, నే దేవునకు చెందినదైనను శ్రీనాథుని కవిత్వము సుధామధురమైనది ఆంధ్రభాషా సరస్వతికి నలంకారమైనిదియుకదా?

మఱియు భగవత్కథలతో భగవదంకితముగనే విరచించిన శ్రీనాథుని ఈ "వల్లభాభ్యుదయ" ప్రబంధమున్ను సంపాదించి ప్రచురించినచో నాంధ్రభారతికిఁ బోయిన ఒక అమూల్యరత్న భూషణమును సంపాదించి యొసంగినట్టులే యగును.

కాన నిది శ్రీమానవల్లి రామకృష్ణకవి (తిరుపతి)గారియో, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారియో, శ్రీమాన్ బి. వి. సింగరాచార్యులవారియో గ్రంథసంచయములలో నొండె లేక మద్రాసు, కాకినాడ, తంజావూరు మున్నగు తావులనుండు లిఖిత గ్రంథశాలలలో నొండె సంపాదించి, భాషాభిమానులు ప్రచురించఁదగినది.

ముఖ్యముగ కృష్ణాజిల్లా దివితాలూకాలో మచిలీపట్టణము (బందరు)వద్దనున్న శ్రీకాకుళ క్షేత్రమునకుఁ జెందిన వివిధ పురాణాంతర్గతములైన సంస్కృత గ్రంథములను, ఆంధ్రములో శ్రీనాథుని వల్లభాభ్యుదయము, భట్లపెనుమర్తి కోదండరామకవి విరచితమైన వల్లభాభ్యుదయ ప్రబంధమునున్ను ఆ దేవస్థాన పాలకవర్గమువారు వ్యయ ప్రయాసలకు వెనుదీయకసంపాదించి, ప్రచురించి శ్రీకాకుళక్షేత్ర మాహాత్మ్యము శ్రీ ఆంధ్ర నాయకస్వామివారి దివ్యావతారచారిత్రమును జనులకు చాటి, ఆంధ్ర సాహిత్యాభివృద్ధిఁ గావించుట ముఖ్యకర్తవ్యము.

[5]తిరుపతి మున్నగు తావుల దేవాలయముల పరిపాలక వర్గములవా రాయాక్షేత్రమాహాత్మ్య గ్రంథముల నీ ప్రకారము ప్రచురించి యుండుట అంద తెఱింగినదే.

## అధోజ్ఞాపికలు

1 ఈ శ్రీకాకుళము మాహాత్మ్య విశేషములనుబట్టి మహర్షులచే అష్టోత్తర శత దివ్య దేశములుగ నెన్నుకొనఁబడిన వాటిలో నొకటి. చూ. 1897లో తూప్పుల్ వేంకటాచార్యులుగారు వాజపేయం కృష్ణశాస్త్రులుగారిచేతను శ్రీమత్కల్యాణ పుర్యాభరణాయమాన బెంగుళూరు బుక్‌డిపో ముద్రాక్షరశాలయందు ముద్రితమై బెంగుళూరు తులసీవనవాసి తూప్పుల్ వేంకటాచార్యులగారిచే పరిశోధితమైన స్తోత్ర రత్నాకరము ౫౯వ పుటలో శ్రీవిష్ణోరష్టోత్తర శత దివ్యదేశస్తోత్రములో 'కాకుళేత్వాంధ్రనాయకం" అని శ్లో॥ ౧౦౫.

2 ఈ వ్యాసమునందు పేర్కొనఁబడిన మండ లక్ష్మీనరసింహాచార్యునిచే సంస్కృత భాషతో రచింపఁబడిన "ఆంధ్ర కౌముది" వ్యాకరణ గ్రంథము. సంస్కృత సూత్రములును వృత్తిన్నీ నాగర లిపిలోను, ఉదాహరణములు తెనుగు లిపిలోను 1896 సం॥ర ప్రాంతములో విశాఖపట్టణము ఆర్ష ముద్రాశాలలో అచ్చువేయఁబడి, మదరాసు యూనివర్శిటీ వారివలన విద్వత్పరీక్షకు పఠనీయ గ్రంథముగ నేర్పరుపఁబడినది. సుమారు ౯౨ పుటలు కలది.

ఆర్షప్రెస్, విశాఖపట్టణము అను తావున దొరకును

11–12–13 అంకెలుగల గ్రంథములు 1959సంవత్సరములో చెన్నపురిలో శ్రీ వావిళ్ల ప్రెస్సువారు ప్రచురించిన కాశీఖండము మొదట వేదము, శ్రీలక్ష్మీనారాయణశాస్త్రులవారు వ్రాసిన "శ్రీనాథుఁడు" 24వ పుటలోఁ దెలుపఁబడినవి

11 నంద నందన చరిత్రకు బదులు 1966వ సంవత్సరములో వావిళ్లవారి ప్రచురణము హరవిలాసము మొదట శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులవారు వ్రాసిన పీఠికలో నందనందన శతకమని యున్నది. మఱియుఁ గొన్నిఁటను నిట్లే యున్నది. 12 ధనంజయ విజయమునకు బదులు కొందఱు ధనంజయవిలాసమని శ్రీనాథుని గ్రంథముల పీఠికలలోఁ బేర్కొనినారు.

3–4 ఆంధ్రనాయకస్వామివారియొక్క ఆంధ్రవిష్ణువు మున్నగు అనేక నామములలో నొక్కటియైన ఆంధ్రవల్లభుఁడను పేరునందు నామైక దేశే నామగ్రహణమ్మను శాస్త్రము ననుసరించి ఆంధ్రకవులు తాము వ్రాసిన ఈ స్వామివారి చరిత్రములకు, వల్లభాభ్యుదయములని పేర్లిడిరి యని తలంచనగును.

5 దక్షిణ సింహాచల ప్రభావః, అని సంస్కృతములో చెప్పఁబడెడు సింగరాయకొండ స్థలపురాణము సకల ప్రమాణసార మనెడు గ్రంథములో ౧౩ అధ్యాయములలోను, శతానంద సంహిత యను మఱియొక గ్రంథములో ౧౫ అధ్యాయములలోను చెప్పఁబడియున్నది. ఈ రెండు పురాణములలోని శ్రీ సింగరాయకొండ క్షేత్రమాహాత్మ్యము పూర్తిగ ౧౫ అధ్యాయములు నాచేత తెనుగున వచనరూపముగ ననువదింపఁబడియున్నవి. "శ్రీ మదాంధ్ర దక్షిణ సింహాచల ప్రభావము"అను సింగరాయకొండ స్థలపురాణము అని పేరుగల ఈ గ్రంథము కొలది కాలములో ముద్రణభాగ్యము నొంది, సూర్యాలోకము నొందనున్నది.



# ఎక్కడిదీ పాట?

## మల్లెల

నువ్వు కదలిరా సోదరా ...
	చెట్లు, కొండలు, నదులు సెలయేళ్ళూ
	ప్రకృతి సమస్తం ...
	ఒక పక్షిలా ఎగిరొచ్చి
	నీ భుజం కొమ్మమీద వాలుతుంది.

చూశావా !
	నీ గూటిని నువ్వే బంధించుకున్నావ్ తలుపులు
	మూసేసి ...,
	ఎవరు నీలో ఖైదు
	ఆ ఎముకల గూటిలో పక్షులుఐదు.

కవిత్వం తోటల్లో, ఊహల శాద్వలాలపై
	పువ్వులు జోకొట్టే క్షణాలు
	ఎందరో మేధావుల్ని ట్రాగుబోతుల్నిచేసి
	కాలం వృక్షానికి ఉరితీసేశాయ్ జాగ్రత్త!

మీ యింట్లో నీ గదిలో
	నువ్వే బానిసవు నీ నియంత ఒంటరితనానికి.
	నగ్న అద్వైతానికి జలతారు మాయ తెరలాంటి
	ఆ గాజు కిటికీ తలుపులు పగులగొట్టి

	కళ్ళ జైళ్ళలోంచి ఆ చూపుల శాస్త్రజ్ఞుల్ని
	విడుదల చేసేయ్ !

చూడు ...
	గుడ్డి వీధి గాయకుడు గొప్ప విప్లవగీతం
	పాడుతున్నాడు,
	శూన్యం గొడుగు నీడలో ...,
	వీధి లాంతరు మసలి వెలుతురులో తడుస్తూ ...
	'ఎక్కడిదీ పాట ?'
	... ... ... ...
	"అడుక్కుతినే ఆరవయ్యేళ్ళ బ్రతుకు లోయల్లోంచి"

అర్థమయిందనుకుంటా ...
	విప్లవ పుష్పానికి పురిటిగది ఏదో ?
	స్వేచ్ఛా విహంగానికి గూడు ఎక్కడో ?

విప్లవమంటే —
	ఒంటి మీద గుడ్డలు బహిష్కరించి
	కత్తులు నగ్నంగా రక్తంలో మునక లేయడమా ?
	చీకటి సముద్రాలను పీల్చి
	వెన్నెల సెలయేళ్ళను
	చిరుదీపం చివరిశ్వాసవఊకూ ఊదడమా ?...



శ్రీ దోనెపూడి వెంకయ్య

# సాహిత్యంలో సోషలిస్టు అవాస్తవికతలు

శ్రీ పిరాట్ల గారి వ్యాసాన్ని విమర్శిస్తూ జులై '78 'భారతి'లో శ్రీ జ్వాలాముఖి ఒక వ్యాసాన్ని వ్రాశారు. సోషలిస్టు వాస్తవికత అంటూ వ్రాస్తూ శ్రీ గురూజీ, శ్రీ జె. పి, శ్రీ సుబ్రహ్మణ్యస్వామి, శ్రీ వాజపేయీ, జనతాపార్టీ, ఇలాఅందరినీ ఉదహరించారు. తాను సోషలిస్టునని వివేకానందుడు కూడా చెప్పాడని అన్నారు అంబేడ్కర్‌ను ఉదహరించి మనుస్మృతిని గర్హించారు. ఈ సందర్భంగా వారు చెప్పిన సోషలిస్టు వాస్తవికతలలోని ''అవాస్తవికతలు'' యేమిటో తెలియజేయవలసిన అవసరం వుంది.

విప్లవం అన్నమాట వినపడగానే మన దేశంలో అనేకులు మార్క్సిజంతో జోడించి మాట్లాడుతుంటారు. ఇది ఒక పెద్ద పొరపాటు. మార్క్సిజం అనేది పుట్టటానికి చాలాకాలం ముందే అంటే 1649లో క్రామ్‌వెల్ ద్వారా విప్లవం జరిగింది. 1778లో అమెరికాలో విప్లవం జరిగింది. 1789 లో ఫ్రెంచి విప్లవం జరిగింది వీటి అన్నింటి కంటె ఎన్నోవేల యేండ్లకు పూర్వమే ప్రపంచంలోని మొట్టమొదటి విప్లవం భారతదేశంలో వైదిక యుగంలో జరిగింది. రాజకీయాలకు అతీతంగా నిరంతరాధ్యాత్మిక సాధనా నిరతులై వుండే ఋషుల నేతృత్వంలో ఆనాటి ప్రజలు తిరుగుబాటు చేసి, అత్యాచారాలు సాగిస్తున్న క్రూరుడయిన వేనుడు అనే రాజును సంహరించివేశారు. రోమన్‌ను రోములస్ అప్పటికింకా వధించివుండలేదు ఆబేల్‌ను కాఇన్ యింకా అప్పటికి చంపలేదు దానికి అనేక శతాబ్దాలకు ముందే ఇది జరిగింది.

వామదేవుడు నిరంకుశత్వానికి వ్యతిరేకంగా జరిగిన రక్త విప్లవాన్ని బలపర్చినట్లు భీష్ముడు చెప్పాడు. శుక్రాచార్యుడు కూడా దుష్టుడయిన పాలకునికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయవలసిందని ఆదేశించాడు. అసలు విప్లవకారులకు భగవద్గీతను మించిన మార్గదర్శక గ్రంథం మరేముంది? జ్యేఫ్రో ఫెయిర్‌బర్న్ ''రివల్యూషనరీ గెరిల్లా వార్‌ఫేర్'' అన్న తన గ్రంథంలో ''కర్మణ్యేవాధి కారస్తే...'' అంటూ 2000 సం॥ల క్రితం భగవద్గీతలో వివరించబడిన మానవ జీవన పరిస్థితులనూ, విలువలనూ గురించిన ప్రగాఢమయిన అవగాహన ఆధునిక యుద్ధాలలో నశించిపోయింది అని వ్రాశాడు.

విప్లవాలలో యుద్ధాలలో హింస అనివార్యమవుతుంది. అర్జునుడు అనుసరించింది హింసాయుత విధానమే. అయితే కర్మయోగి అయిన అర్జునుడికీ, సంకుచిత స్వార్ధ దృష్టి తప్పితే మరొకటి తెలియక తామే విప్లవకారులమని భ్రమించే ఈనాటి రాజకీయ సిద్ధాంతవాదులకూ ఆకాశానికీ పాతాళానికీ వున్న అంతరం వుంది.

తుపాకీ గొట్టం ద్వారానే రాజకీయాధికారం లభిస్తుందన్న మావో సూక్తిని నక్సలైట్లు బహుళ ప్రచారం చేస్తుంటారు. అయితే 70 యేండ్లకు ముందే లోకమాన్య తిలక్, ''భారతదేశంలో ఆంగ్ల సామ్రాజ్యం తుపాకీ గొట్టంమీద నిలబడి వుందనే సత్యాన్ని పాఠకులు సులభంగానే గ్రహించగలరు'' అని వ్రాశాడు. శివాజీ, రాణాప్రతాప్, గురుగోవింద సింగ్ మొదలయిన వీరుల చరిత్రలు, 1857నుండి 1947 వరకు జరిగిన పోరాటకాలంలోని స్వాతంత్ర్య వీరుల విప్లవ గాథలు ప్రసిద్ధమయినవే. కాబట్టి రాజకీయాలలో హింసా విధానం భారతదేశానికి నూతనమైనదేమీ కాదు. ఇదీ విప్లవ కేంద్రమే. కాని హింసాయుత విప్లవమే ఉత్తమమనీ, ఏకైకమార్గమనీ భారతీయ సిద్ధాంతం కాదు. అనివార్యమయిన సమయాలలో కూడా అది ఒక ధర్మాధర్మ సంఘర్షణగా జరిగింది గాని అన్యథాకాదు.

హింసాయుత విప్లవ పోరాటాలను గురించి మార్క్సిస్టులు పదే పదే ఉపదేశాలిస్తుంటారు గాని, 1847 లో ఏంగెల్సు ''సామ్యవాద సిద్ధాంతం'' అనే తన గ్రంథంలో ''విప్లవాలు అనేవి వ్యర్థమయినవి, హానికరమయినవి; ఇది సామ్యవాదు లందరూ బాగా అవగతం చేసుకొన్న సత్యమే,'' అని వ్రాశాడు. ఈమధ్య జాతీయ వాద కమ్యూనిస్టు పార్టీలు కొన్ని హింసాయుత విప్లవంతో నిమిత్తం లేకుండానే రాజకీయాధికారాన్ని పొందవచ్చునని ప్రతిపాదించిన విషయం కూడా తెలిసిందే. కాబట్టి విప్లవం ద్వారా రాజ్యాధికారం వస్తుందని శ్రీ జ్వాలాముఖి అన్నమాట వాస్తవికతను జోడించి అన్న మాటకాదు.

కొన్ని దేశాలలో మార్క్సిస్టులయిన విప్లవ నాయకులు తమ దేశీయులకు దేశభక్తి పాఠాలు నూరిపోస్తున్నారు. నిజమైన దేశభక్తి అంతర్జాతీయతా వాదంలోని ఒక అవిభాజ్య అంగం అనికూడా వారు వత్తి చెబుతున్నారు. 1951 లో వియత్నాం కమ్యూనిస్టు నాయకుడు హోచిమిన్ ఇలా అన్నాడు: ''మన దేశీయులు ఎంతో దేశభక్తులు. మన పితృ భూమిపై దండయాత్ర జరిగిందంటే గతంలో వలెనే యిప్పుడు కూడా వారిలో దేశభక్తి కట్టలు త్రెంచుకొని విరాడ్రూపంగా హింసామార్గంలో ప్రవహిస్తుంది. ఆ రక్తపు యేరుల్లో పడి దేశద్రోహులు, ఆక్రమణదారులు మునిగి కొట్టుకొని పోతారు.''

ఇలా కమ్యూనిష్టు దేశాలలో ఈనాడు మార్క్సిజాన్ని జాతీయసంస్కృతీ సాంప్రదాయాలతో సమన్వయపరిచే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ''జాతీయకరణ'' కావాలనే ధోరణి కనిపిస్తున్నది. మార్క్సిజాన్ని ''చీనీకరణ'' మొనర్చాలని మావోచేసిన బృహత్‌కృషి మనకు తెలుసు. ఇలా జాతీయ మొనరింపబడిన మార్క్సిజానికీ పుస్తకాలలో లభించే మార్క్సిజానికీ అసలు సంబంధమే కనిపించటంలేదు. ఈనాడు మార్క్సిజం జాతీయవాదంగా పరిణామం చెందుతున్నదంటే అది ఫక్తు వాస్తవికత.

ఈ స్థితిలో దేశభక్తిని భగాస్వామ్య వ్యామోహంగా దేశ ప్రజల స్థితిగతుల్ని విస్మరించే ఎల్లల భక్తిగా శ్రీ జ్వాలాముఖి విమర్శింప జూస్తున్నారంటే వారు కన్నెత్తి లోకంవైపు చూడటం లేదన్నమాట. కాని అది వారి యిష్టారాజ్యం అవుతుందేమోగాని సోషలిస్టు వాస్తవికదృష్టి మాత్రం కాదు. అది అవాస్తవికత.

కమ్యూనిష్టు ఉద్యమంలోని చీలికలను మనం గమనించినట్లయితే మరొక సోషలిస్టు అవాస్తవికత అవగాహనకు వస్తుంది. రష్యాలో విప్లవం వచ్చిన 50 యేండ్ల లోపలే కమ్యూనిస్టు ఆలోచనలలో విభేదాలు ఆరంభమయినాయి. కమ్యూనిజంలోని వివిధ అంశాలపైన తగాదాలు చెలరేగాయి. ఇంకా రేగుతున్నాయి. ఈనాటి పరిస్థితి యేమిటి? రష్యాదృష్టిలో చైనా రివిజనిస్టు. చైనా దృష్టిలో రష్యా రివిజనిస్టు (కృశ్చేవ్ మావోపై దుమారం లేపితే మావో చైనా హనుమంతుడిపై ఒక పద్యం వ్రాసి ఆ రివిజనిస్టు భూతాన్ని ఓడించేలా చేయి అని ప్రార్థించాడట) ఈ యిద్దరి దృష్టిలో యుగోస్లావియా రివిజనిస్టు. డాంగే దృష్టిలో నంబూద్రిపాద్ రివిజనిస్టు. నంబూద్రిపాద్ దృష్టిలో డాంగే రివిజనిస్టు. ఈ యిద్దరి దృష్టిలో చారుమజుందార్ రివిజనిస్టు. చారు మజుందార్ దృష్టిలో డాంగే, నంబూద్రిపాద్‌లు రివిజనిస్టులు. ఇలా ప్రపంచంలోని కమ్యూనిష్టులందరూ పై స్థాయినుండి క్రింది స్థాయివరకూ ఒకరి కొకరు ప్రసాదించుకున్న ప్రమాణ పత్రాలను అన్నింటినీ ఒకచోట చేర్చి లెక్కలు కడితే, ప్రపంచంలోని కమ్యూనిష్టులందరూ దారితప్పినవాళ్లు అనే సత్యం అవగతమవుతుంది. ఇలాంటివే తమలోని చీలికలు మరికొన్ని చెప్పి యిదంతా శ్రీ పిరాట్ల గారికి అర్థంకాని ఆల్జీబ్రా అని తమ సోషలిస్టు అవాస్తవికతను ఆల్జీబ్రాగా శ్రీ జ్వాలాముఖి ప్రదర్శించారు

సిద్ధాంతరీత్యా ఆలోచించినప్పుడు కమ్యూనిజానికి పట్టిన ఈ దుర్గతిని చూస్తే ఎంతో విచారం వేస్తుంది. 50, 60 యేండ్ల స్వల్ప వ్యవధిలోనే ప్రగతిశీలురమని చెప్పకొనే దేశాలుసైతం తమ సిద్ధాంతాలనుంచి వైదొలగిపోయే దుస్థితికి దిగజారిపోయాయంటే, యిక సమాజాన్ని సుస్థిరంగా బహుకాలపర్యంతం నిలిపి వుంచ గలిగే స్తోమతు ఎక్కడనుంచి వస్తుంది? వివేకానందుడు తన ఉపన్యాసంలో, ''నేను కూడా ఒక సమాజవాదినే. సమాజవాదం ఒక సమగ్ర దర్శనమని కాదు. కాని ఆకలివల్ల మరణించటంకంటె ఒక్క కబళం లభించినా మంచిదే,'' అని అన్నాడంటే, క్షుధార్తులను చూసి ఆయన ఎంతగా తపించిపోయినాడో తెలుస్తుంది గాని, సమాజవాద మతదీక్ష పుచ్చుకున్నాడనికాదు. ఇదే విషయంమీద ఒకసారి పాశ్చాత్య తత్త్వజ్ఞులు వివేకానందునితో ఇలా అన్నారు: ''మీ ఆధ్యాత్మిక ప్రబోధాలను మేము అంగీకరిస్తాము. అయితే నూతనమయిన మా ఆలోచన ఒకటి వుంది అది సమాజవాదం. దానిని మీరు స్వీకరించండి. ఆర్థికరంగంలో మీరు మా ఆలోచనను గ్రహించండి. ఆధ్యాత్మికరంగంలో మేము మిమ్ము అనుసరిస్తాము.'' స్వామిజీ ఇలా అన్నారు. ''సోదరా! మంచిదే. నూతనమయిన మీ ఈ ఆలోచన (సమాజవాదం) యింకా ప్రయోగావస్థలోనే వుంది. మాది అత్యంత ప్రాచీనమయిన జాతి. వేల సంవత్సరాల వయస్సుగల జాతి. మేమేమీ మూర్ఖవాదులంకాదు. అయితే మీ సమాజవాదాన్ని ఒప్పుకునేముందు దానికి ఒకస్థాయి చిక్కిందా లేదా అనేది చూడనివ్వండి. దీని ఆధారంమీద ఒక సమాజం కనీసం 500 యేండ్ల పాటు అయినా వృద్ధిచెందినట్లు మాకు ప్రమాణం లభించాలి. అంతేగాని, యింకా ప్రయోగావస్థలోనే ఉన్నదానిని స్వీకరించమంటే ఎలా? అది మా వల్లకాదు.''

వివేకానందుడు పెట్టిన గడువు 500 యేండ్లు. 500 యేండ్లదాకా అక్కరలేదు. 50 యేండ్ల అల్పకాలంలోనే సమాజవాద కల్పనలన్నీ కకావికలై గాలికి కొట్టుకొనిపోయాయి. ప్రపంచంలోని కమ్యూనిస్టులందరు తాము దారితప్పిన వాళ్ళమని బిరుదులు తగిలించుకుంటున్నారు. ఆ వాస్తవికత ఒకవైపున కొట్టవచ్చినట్లు కన్పిస్తుండగా తనను సమాజవాదిగా వివేకానందుడే చెప్పుకున్నాడని చెప్పటం సందర్భాన్ని వదిలి ఉదహరించటమే. వివేకానందుడు ఆధ్యాత్మవాది భౌతికవాది కాదు. సమాజవాదానికి ఆధారశిల భౌతికవాదం. వివేకానందుడు భౌతికవాది అని చెప్పటంకంటె అవాస్తవికత మరొకటి వుండదు.

శ్రీ పిరాట్ల చరిత్రను వక్రీకరించారని అభాండాన్ని వేశారు శ్రీ జ్వాలాముఖి. కాని చారిత్రక వక్రీకరణ విద్యావిశారదత్వంలో కమ్యూనిష్టులను మించిన వాళ్లు లోకంలో వున్నారా? వక్రీకరణ అనేది వారికి ఉగ్గుబాలతో పెట్టిన విద్య. అంటే మార్క్సు ఏంగెల్సులు పెట్టిన భిక్ష. దానిని అవిచ్ఛిన్నంగా కొనసాగిస్తున్నారు ఈనాటివరకూ కమ్యూనిష్టు మేధావులు. కార్ల్‌మార్క్సు 1853–1857 సం॥ల నడుమ భారతదేశంపైన 23 వ్యాసాలు వ్రాశాడు. ఏంగెల్సు 8 వ్యాసాలు వ్రాశాడు. 1853లో మార్క్సు ఇలా వ్రాశాడు: ''భారతీయ సమాజానికి చరిత్ర అనేది అసలు లేనేలేదు. కనీసం మనకు తెలిసిన చరిత్రలేదు. ఎవరికీ ఎదురు తిరగక, మార్పు అనేది లేక స్తబ్దంగా పడివున్న సమాజం అది. దానిపైకి దండెత్తివచ్చారు అనేకులు. అలా దండెత్తి వచ్చి సామ్రాజ్యాలు నిర్మించిన ఆక్రమణదారుల చరిత్రనే మనం భారతీయ చరిత్ర అనుకోవాలి. ఇప్పుడున్న ప్రశ్న ఆంగ్లేయులకు భారతదేశాన్ని జయించే హక్కు వున్నదా లేదా అని కాదు. ఆంగ్లేయులు జయించిన భారతదేశంకంటె, టర్కీ వారో, పర్షియన్లో రష్యన్లో జయించిన భారతదేశాన్ని మనం అంగీకరిస్తామా అనేది ప్రశ్న.

''భారతదేశంలో బ్రిటిషు పాలనవల్ల ద్విముఖమయిన ప్రయోజనం సమకూరాలి. మొదట భారతదేశ సంస్కృతీ సాంప్రదాయాలను విధ్వంసం చేయాలి. ఆ స్థానే భౌతిక ప్రగతికి బునాదులు

వేయాలి.'' (ది 22-7-1853 ది న్యూయార్కు డెయిలీ ట్రిబ్యూన్‌లో, ''భారతదేశంలో బ్రిటిషు పాలనకున్న భవితవ్యం'' అన్న కార్ల్‌మార్క్సు వ్యాసం)

మార్క్సిస్టు రచయితలకు ఇక యిదే వేద వాక్యం అయింది. భారతదేశానికి చరిత్ర లేదనటం, భారతీయ సంస్కృతిని తూల నాడటం, నాశనం చేయాలనటం—ఇదీ వారి విద్య. యమ్. యన్. రాయ్ 1922లో ''ఇండియా ఇన్ ట్రాన్సిషన్'' అనే గ్రంథం వ్రాశాడు. అది భారత జాతీయోద్యమానికి మార్క్సిస్టు వ్యాఖ్యానం యివ్వటానికి చేసిన ప్రయత్నం. 1940లో ఆర్. పామీదత్ వ్రాసిన ''ఇండియా టుడే'' అన్న గ్రంథం కూడా మార్క్సిస్టు వక్రీకరణతో వ్రాసిన గ్రంథమే. 1956లో డి. డి. కోశాంబి ''యాన్ ఇంట్రొడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ'' వ్రాశాడు. భారతదేశానికి చరిత్రలేదనే మార్క్సు మాటను ఈయన అంగీకరించలేదు గాని మిగతాది అంతా మార్క్సిస్టు వక్రీకరణే. ''ఇండియా ఫ్రమ్ ప్రిమిటివ్ కమ్యూనిజం టు స్లేవరీ'' అన్న డాంగే వ్రాసిన చరిత్ర గ్రంథం (1948) వుండనే వుంది. ఇవన్నీ చరిత్రగతిని మార్చటానికి, గత చరిత్రను వక్రీకరించి ఆయుధంగా ప్రయోగించాలి అనే మార్క్సిస్టు సూత్రానుసారంగా వికృత మొనరింపబడిన చరిత్రహీన చరిత్ర గ్రంథాలు. మానవ జాతి చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే అన్న మార్క్సు వాక్యంతో సమన్వయపరచి వాస్తవాలను మార్చి కూర్చి పేర్చి వ్రాసిన ఈ గ్రంథాలు రాజకీయపు ఎత్తులకు సాధనాలుగా మాత్రమే రచింపబడ్డాయి. ఇది చరిత్రపట్ల వారుచేసిన ఘోర నేరం. చరిత్ర గతిపై ఆర్థిక పరిస్థితుల ప్రభావం మాత్రమే వున్నదని మార్క్సు అనుకొన్నాడు జాతీయవాద ప్రజాస్వామ్యాల వైపుగా పయనించిన సంస్కృతీ సాంప్రదాయాలు, వ్యక్తి స్వాతంత్ర్యం మొదలయినవానిని గుర్తించలేకపోయాడు. మార్క్సు యొక్క ఈ అవాస్తవిక ధోరణే మార్క్సిస్టు రచనలనిండా వ్యాపించి, సోషలిస్టు అవాస్తవికతగా రూపుదిద్దుకుంది.

ఈమధ్య బ్రిటన్‌లో ప్రొఫెసర్ జూలియస్ గోల్డు ఆధ్వర్యంలో జరిగిన పరిశోధనలో యూనివర్శిటీలలో మార్క్సిస్టులు చేరి, విద్యార్థుల మనస్సులను పెడత్రోవ పట్టిస్తున్నారనీ, మార్క్సిస్టు వక్రీకరణ ద్వారా వికృత మొనరిస్తున్నారనీ వెల్లడి అయింది. (టైమ్సు పత్రిక 14 11-77) భారతదేశంలో శ్రీమతి ఇందిరాగాంధీ హయాము నాటినుండి మార్క్సిస్టు వక్రీకరణ విద్యావేత్తల ప్రాబల్యం యింకా అధికమయింది. ఈ నడుమ యన్. సి ఇ. ఆర్. టి వారు సెకండరీ స్కూళ్లకోసం ప్రచురించిన చరిత్రగ్రంథాలు ఇలాంటి వక్రీకరణవల్ల వికృతమొనర్చబడినవే. వాటి విషయంలో ఇప్పుడు విద్యారంగంలో రేగిన దుమారం అందరికీ తెలుసు. ''మార్క్సిస్టులు చరిత్రను వ్రాయరు. వారు దానిని మారుస్తారు'' (వక్రీకరిస్తారు) అనే సిద్ధాంతానికి బద్ధులై వ్రాసిన ఈ గ్రంథాలే స్కూళ్లల్లో పెట్టాలని వీరు వాదిస్తున్నారు. ఈ సందర్భంగా నెహ్రూ అన్నమాట ఒకటి గుర్తుకు వస్తున్నది. ''గోడలమీద వ్రేలాడే ఫోటోలను మార్చివేసినంత మాత్రాన మీరు చరిత్రగతిని మార్చలేరు''అని 1959లో శ్రీ నెహ్రూ శ్రీ కృశ్చేవ్‌తో అన్నాడు. (1-4-1959-న్యూయార్క్ పోస్ట్).

అవాస్తవికమైన ఈ సోషలిస్టు సాహిత్య వ్యవసాయం హిందీ భాషలో పుష్కలంగానే జరిగింది. ''ప్రోగ్రెసివ్ రైటర్స్ ఎసోసియేషన్'' ప్రథమ మహాసభ ప్రేమచంద్ అధ్యక్షతన జరిగింది. దాని చరిత్ర అంతా ఒక గాథ. చివరకు చివరకు ఈ వామపక్ష రచయితలందరూ ఎవరిదారి వారు చూసుకున్నారు. శ్రీ నరేంద్ర శర్మ, ''భగవాన్ రామచంద్రకీ దయా'' వ్రాయటం ఆరంభించాడు. శ్రీ నరేశ్ మెహతా, ''గాయత్రీ మంత్ర'', ''పాండవోంకే హిమాలయ గమన్'' మొదలయినగ్రంథాలు వ్రాయటం మొదలుపెట్టాడు. కార్ల్‌మార్క్సు మీద ''యుగవాణి''లో సానెట్సు వ్రాసిన సుమిత్రానందన్ పంత్ ప్రభుదత్త బ్రహ్మచారిమీద, ఆ తరువాత హేమవతీ నందన బహుగుణ మీద కవిత్వాలు వ్రాశారు. అత్యవసర పరిస్థితిలో కుటుంబ నియంత్రణపై రచనలు చేసింది. ఇక తెలుగు దేశంలోని ''కసిగల'' రచయితలు, ''దిసమొల'' రచయితలు ఏయే రీతిలో రచనలు సాగిస్తూ ఎలా ఎలా పరిణమించారో చెప్పనక్కరలేదు.

మార్క్సుకు ఏంగెల్సుకు షేక్సుపియర్ అంటే గథే అంటే యిష్టం. గ్రీకు నాటకాలు యిష్టం. తన కుమార్తెలతో తానొక నాటకం వ్రాస్తానని మార్క్సు చెప్పాడు. అయితే వ్రాయలేదు. వ్రాస్తే బాగుండేది అవాస్తవికతలు యింకా వెలికి వచ్చేవి.

ఏంగెల్సు వ్రాసిన మాట ఒకటి వుంది. ''రచయితలు, సాహిత్యవేత్తలు — వీరిలో అంతర్విరోధం ఎక్కువ. వారిలో ప్రతిభ వుంటుంది. కాని వారికి రాజకీయాలు తెలియవు. ఆర్థికశాస్త్రం తెలియదు ఈ విషయాలలో వారు అజ్ఞానులు.'' సోషలిస్టు అవాస్తవికతలలో ఇదొకటి.

మార్క్సుచెప్పిన చారిత్రక భౌతికవాదం 1830-1880 మధ్య కాలంలో తెలిసిన శాస్త్రవిజ్ఞానంమీద ఆధారపడి చెప్పబడినట్టిది. అందుచేత ఆ 50, 60 సం॥ల కాలంలో ఆనాటి శాస్త్ర విజ్ఞానందృష్ట్యా అది సరియైనదే అని భావించబడి వుండవచ్చు. అయితే అది అంతకుముందు కాలానికిగాని, దానికి తరువాత కాలానికి గాని అన్వయించదు. పాషాణ యుగానికి మార్క్సిస్టు సూత్రాలు వర్తించవు. పశుపాలన యుగానికి వర్తించవు. పారిశ్రామిక యుగంలోని అల్పమయిన ఒకానొక కాలఖండానికి ఒకానొక దేశసముదాయానికి మాత్రమే అవి వర్తిస్తాయి. బానిస బానిస యజమానుల సమాజం, భూస్వామ్య వ్యవస్థ, పెట్టుబడిదారీ సమాజం, సమ సమాజం, కమ్యూనిస్టు వ్యవస్థ అని మార్క్సు చేసిన చారిత్రక విభజన అనంతమయిన కాలానికి గాని, అన్ని దేశాలకుగాని వర్తించే విషయం కానేకాదు. కొన్ని సంవత్సరాలకు మాత్రమే పరిమితమయిన మార్క్సుచేసిన ఈ కాలవిభజనకూ, కాలచక్రాన్ని గురించిన భారతీయ కల్పనకూ పోలికేలేదు. మార్క్సుచేసిన యుగవిభజన మూర్తీభవించిన సోషలిస్టు అవాస్తవికత.

కమ్యూనిస్టు మేనిఫెస్టో 1848లో వచ్చింది. రష్యాలో 1917-19లో విప్లవం వచ్చింది. దరిమిలా శాస్త్రవిజ్ఞానం ఎంతగానో పెరిగిపోయింది. ఈ రోజున భౌతిక శాస్త్రవేత్తలు

పదార్థమే అంతిమ సత్యమని అనటంలేదు. అణువును ఛేదించి న్యూట్రాన్, ప్రోటాన్ మొదలయిన వానిని వారు కనుగొన్నారు. ఇంకా ముందుకుపోయి లేసర్ కిరణాలు, కాంకట్‌జర్ కిరణాలు, కాంప్టన్ సిద్ధాంతం—మొదలయిన వానిని కనుగొన్నారు. అంతేకాదు పదార్థమనేది చక్షురాది కరణాలద్వారా బయటకు వ్యాపించినట్టి వ్యక్తిలోని చైతన్యమే, పదార్థం శక్తియొక్క వ్యక్తీకరణమే అని విశ్వసించటానికి ఆధారాలు ఉన్నాయని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు.

శాస్త్రజ్ఞులు మరొక సత్యాన్ని కూడా కనుగొన్నారు. మన దూరదర్శినులు కొంత దూరం వరకే చూడగలవు. కాని ఈ విశ్వాంతరాళం అనంతమయినదిగా వుంది. అంటే మానవుని నేత్రం కొంతదూరంవరకే చూడగలదు. మానవ నేత్రానికి అందని అనంత మయిన ఈ అంతరిక్షం భౌతిక సత్యమే. ప్రత్యక్షమయినవిషయమే.

మనం పరమేశ్వరుణ్ణి ఒక అజ్ఞాతమయిన తత్త్వంగా చెబుతాము. అజ్ఞాతమయిన ఆ భగవత్తత్త్వాన్ని మనం ఎటువైపు నుండి అయినా చేరటానికి ప్రయత్నించవచ్చు. అయితే ఆ అజ్ఞాత తత్త్వాన్ని అందుకొనేందుకు మనస్సుతో ఒక స్థాయినుండి ఇంకో స్థాయికి చేరటంతోనే, అక్కడినుండి మరల ఆ తత్త్వం అజ్ఞాత మయినదిగా, అనంతమయినదిగా గోచరిస్తుంది. ''నత్ర చక్షుర్గచ్ఛతి నవాగ్గచ్ఛతి నోమనో...'' (కేనోపనిషత్) అనేది అనుభవంలోకి వస్తుంది. అలాగే మనకు అజ్ఞాతమయిన ఈ విశ్వాంతరాళపు విస్తీర్ణం చూసినకొద్దీ యింకా ఎంతో వున్నదన్న సత్యం తెలుస్తున్నదన్నమాట. అంటే అజ్ఞాతమయిన విస్తీర్ణం అనేదానిని శాస్త్రజ్ఞులు నిర్మించారు.

రష్యన్ శాస్త్రవేత్తలు శరీరంకంటె సూక్ష్మమయిన ప్రాణ శరీరాన్ని ఫోటో తీయగల్గారు. నశ్వరమయిన ఈ శరీరమే సర్వమూ నని వారెవరూ యిప్పుడు విశ్వసించటంలేదు. భౌతిక శరీరంకంటె సూక్ష్మమయిన శరీరం ఇంకొకటి వున్నదని వారు అంగీకరించారు. ఇలా ఈనాటి శాస్త్రవిజ్ఞానం అజ్ఞాతమయిన సత్యాలు ఎన్నో వున్నట్లు అంగీకరిస్తున్నది.

సత్యం అనేది మన చర్మచక్షువుల జ్ఞానానికి పరిమితమైలేదనే ఉచ్చస్థాయికి శాస్త్రవిజ్ఞానం ప్రగతిని సాధించిన కారణాన, మార్క్స్ చెప్పిన చారిత్రక భౌతికవాదం తప్పని బుజువు అయింది. ఇందువల్లనే ఒక శాస్త్రజ్ఞుడు ఈనాడు భౌతికశాస్త్రం ఆధిభౌతిక మయిపోయిందని పేర్కొనటం జరిగింది. మార్క్సిజం 19వ శతాబ్దానికి సరిపోయి వుండవచ్చు. కాని మనం 20వ శతాబ్దంలో వున్నాం. 20వ శతాబ్దంలో వున్న మనం ఈ శతాబ్దంలోని శాస్త్ర విజ్ఞానపు వెలుగులోనే మార్క్సిజాన్ని చూడవలసి వుంటుంది. అలా చూసినప్పుడు మార్క్సిజానికి కాలదోషం పట్టిందని నిరూపణ అవుతుంది. మార్క్సిజం ఈనాడు ఒక మూఢవిశ్వాసం, ఒక మతోన్మాదం, ఒక బూజు పట్టిన సిద్ధాంతం. ఇట్టి సిద్ధాంతం తర్కబద్ధమయిన జ్ఞానచక్షువు నిస్తుందనటం గొప్ప సోషలిస్టు అవాస్తవికత.

చారిత్రక భౌతికవాదం ఇలా కాలగర్భంలో కలిసిపోయిన కారణంగా మార్క్స్ దర్శనానికి ఉన్న పునాది లేచిపోయింది. వర్గ పోరాట సిద్ధాంతం మట్టిలో కలిసిపోయింది. రష్యాలో వర్గపోరాట సిద్ధాంతానుసారంగానే రాజ్యాధికారం కమ్యూనిష్టులకు హస్తగత మయింది దానిని కమ్యూనిష్టు రాజ్యమన్నారు. నియంతృత్వం వచ్చింది. దానిని శ్రామిక నియంతృత్వం అన్నారు. లెనిన్ మరణించాడు. స్టాలిన్ పాలన వచ్చింది. స్టాలిన్ తరువాత కృశ్చేవ్ వచ్చాడు. కృశ్చేవ్ ఇలా అన్నాడు: ''లెనిన్ మరణానంతరం కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీలోని 70 శాతం సభ్యులు 15 సం॥ల లోపల హత్య చేయబడ్డారు, లేదా జైలులో ఉంచబడ్డారు.'' మిగిలింది 30 శాతమే. అధికారం ఎవరి చేతుల్లోవుంది? కార్మికవర్గపు ప్రతినిధుల చేతులలోనా? లేక కమ్యూనిష్టుపార్టీ చేతులలోనా? లేక స్టాలిన్ ఏజంట్ల చేతులలోనా? అది ఏకవ్యక్తి నియంతృత్వంగా మారింది. కమ్యూనిజం పేరిట రష్యాలో నియంతృత్వ స్థాపన జరిగింది. వర్గరహిత సమాజ స్థాపన అసంభవమని బుజువు అయింది. నియంతృత్వంలో సమాజవాదం ముందుకుపోదు. పెట్టుబడిదారీ వ్యవస్థ నశించవచ్చు. 'కాని కార్మికరాజ్యంమాత్రం రాదు. దీనిని చూసే ఇటలీ, ఫ్రాంసు దేశాలలోని కమ్యూనిష్టు పార్టీలు శ్రామిక నియంతృత్వ సిద్ధాంతానికి తిలోదకాలు యివ్వటం జరిగింది. కమ్యూనిష్టు పార్టీకి రాజ్యాధికారం హస్తగతమయినంత మాత్రన శ్రామిక రాజ్య నిర్మాణం జరుగుతుందనే విశ్వాసం వారిలో నశించటమే దీనికి కారణం. ఇక సమసమాజాన్ని గురించి, ''శక్తికొద్దీ పని, పనికొద్దీ ఫలితం...'' ఇత్యాదిగా చేసిన వర్ణనలు పగటి కలలే, గాలిమేడలే. వాస్తవిక దృక్పథంతో చెప్పిన మాటలుకావు.

ఈ అవాస్తవిక దృక్పథం అనేదోషం మార్క్స్ ఆలోచనలలోనే వుంది. ఉత్పత్తి సాధనాలలో మార్పు వచ్చినప్పుడల్లా ఉత్పత్తి సంబంధాలలో మార్పువస్తుందని మార్క్స్ చెప్పాడు. ఈ సిద్ధాంతంలోనుండే వర్గకలహ సిద్ధాంతం, శ్రామిక నియంతృత్వ సిద్ధాంతం ఆవిర్భవించాయి. గత 70, 80 సంవత్సరాల చరిత్ర ఇందుకు భిన్న మయిన పరిణామాలను మన ముందుంచింది. ఉత్పత్తి సాధనాలు మారగానే అదే అనుపాతంలో సంహార సాధనాలు కూడా మారిపోయాయి. టాంకులు, యుద్ధనౌకలు, అణ్వస్త్రాలు మొదలయిన మారణాస్త్రాలు తయారైనాయి. ఈ మార్పువల్ల ఆధునిక యుద్ధ రీతులలో అనూహ్యమయిన పరివర్తన వచ్చింది. దీనివల్ల రాజ్య శక్తికి ఒక క్రొత్తస్థాయి ఏర్పడింది. ఎందుకంటే ఈ మారణాయుధాలను రాజ్యం కంట్రోలు చేస్తుంది. ఈ సాధనాలు ఎవరి చేతిలో వుంటే వారిదే ఈనాడు రాజ్యం. సైన్యం చేతుల్లోవుంటే సైనిక నియంతృత్వం వస్తుంది. పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లలో ఇదే జరిగింది. కాబట్టి రాజ్యానికి సైన్యాన్ని అదుపులో వుంచేశక్తి కావాలి. ఇప్పటి వ్యవస్థలలో రాజ్యం విలీనమైపోతే లాభంలేదని తెలిసిపోయింది. ఈవిధంగా మార్క్స్ చెప్పిన రాజ్యవిలీనీకరణ సిద్ధాంతం కూడా తారుమారైపోయింది. తప్పని బుజువయింది.

ఉత్పత్తిసాధనాలలోని మార్పుతోబాటుగా మారణాయుధాలు కూడా మారిపోతాయని మార్క్స్‌కు తెలియకపోవటమే ఈ సిద్ధాంతంలోని మూలదోషానికి కారణం. ఫలితంగా కమ్యూనిస్టు పార్టీ

సైనికాధికారు లందరినీ తన గుప్పెటలో వుంచుకొనటం కోసం ఇంకా శక్తినిపుంజుకొని రాజ్యాన్ని బలవత్తరం చేసుకోవలసివచ్చింది. చేసుకోవలసి వస్తుంది. ఇక కార్మికులెక్కడ? కార్మికుల శ్రేయో రాజ్యం ఎక్కడ? ఇదంతా అభూత కల్పన మాత్రమే. అవాస్తవిక ధోరణి మాత్రమే.

చారిత్రక వాస్తవికత అంటే వర్గపోరాటాల వాస్తవికతఅని శ్రీ జ్వాలాముఖి చెప్పారు. ఈ వర్గాల విభజన ఏమిటి? వర్గాలను గురించిన కల్పన ఏమిటి? ఉత్పత్తి సాధనాలు ఉన్నవారు, ఉత్పత్తి సాధనాలు లేనివారు అని కదా మార్క్సు చెప్పాడు. వ్యావసాయిక దేశం కానట్టి ఇంగ్లాండులో వున్న మార్క్సు మస్కిష్కంమీద ఆ దేశ పరిస్థితుల ప్రభావమే వుంది. తూర్పు యూరప్‌లోని వ్యవసాయ దేశాలలోని చిన్న తరహా రైతులను ఏ విధంగా పరిగణించాలి, తెలపండి అని వుత్తరాలు వ్రాస్తే— ఆ సందేహాన్ని మార్క్సు తన జీవితాంతమూ తీర్చనేలేదు. అంతేకాదు. రెండు వర్గాలనూ విభజించి, నిర్వచించి చూపే సరిహద్దు రేఖ ఏమిటో ఖచ్చితంగా ఎవరూ చెప్పలేరు! ఉత్పత్తి సాధనాల మీద ఆధారపడిన విభజన మార్క్సు కాలంలోనే పనికిరాలేదు. శాస్త్రీయదృష్టితో ఆలోచిస్తే అసలు వర్గాలు అనేవి లేనేలేవు. ఒకే వ్యక్తి వివిధ సమయాలలో ఉన్నవాడు గానూ, లేనివాడుగానూ వివిధ పాత్రలను ధరించటం చూస్తుంటాం. వర్గాలు అనేవి భ్రాంతి కల్పితాలు మాత్రమే. రకరకాల స్వార్థాలుంటాయి. అంతే. రిక్షాడ్రైవరుతో మాట్లాడినప్పుడు రిక్షాలాగే వాడు లేనివాడు. ఎండలో రిక్షా ఎక్కటానికి బేరమాడుతున్న వృద్ధుని ముందు అతడే ఉన్నవాడు. పాము ముందఱ కప్ప పీడిత వర్గం. తన చుట్టూ తిరిగే పురుగులను నాలిక జాపి తినేటప్పుడు అదే కప్ప పీడించేవర్గం కుక్క ముందు పిల్లి పీడిత వర్గం. అదే పిల్లి ఎలుక ముందు పీడించే వర్గం. ఈ ఉన్నవారు లేనివారు, పీడించేవారు, పీడితులు అనేవి సాపేక్షములయిన(relative) స్థితులు మాత్రమే. వాస్తవికతలు కావు. ఇక వర్గపోరాటమని చెప్పి లేనిది ఒకటి కల్పించి, దాని ఆధారంమీద చరిత్రనంతా తిరుగవ్రాసి, ఆ వక్రీకరించిన చరిత్ర ఆధారంగా వర్గపోరాటాలు సృష్టించి, చరిత్ర గతిని మారుస్తామనటం శుద్ధ అవాస్తవికత. వర్గవిభజన అనే ఈ సోషలిస్టు అవాస్తవికతను గమనించిన తరువాత మార్క్సిజం అనేది ఒక దర్శనమనే దృష్టికూడా ఎవరికీ వుండదు.

మార్క్సు చెప్పిన ''అచ్చమయినగతి తార్కిక భౌతికవాదా''న్ని పరిశీలిస్తే మరీ అస్తవ్యస్తంగా కనపిస్తుంది. సాంఖ్య దర్శనానికి దగ్గరగా జర్మన్ తత్వజ్ఞుడు హెగెల్ వివరించిన ఈ గతితార్కికతను అర్థం చేసికొన్న వ్యక్తి ఈ ప్రపంచంలో ఒక్కడేననీ, అతడు మార్క్సు అనీ, ఆ మార్క్సు కూడా దానిని తల్లక్రిందులుగా అర్థం చేసుకున్నాడనీ ఒక మాటవుంది. హెగెల్ సిద్ధాంతాన్ని తాను తలక్రిందులు చేసినట్లు మార్క్సు ''దాస్ కేపిటల్'' పీఠికలో వ్రాశాడు. భావాలకు ప్రాధాన్యత యిచ్చాడు హెగెల్. మార్క్సు కాదు పదార్థమే ప్రధానమన్నాడు. ఈ గతి తార్కికవాద సారాంశం యేమిటి? ఒకానొక సామాజిక స్థితి వుందనుకుందాం. అది ఒక ''వాదం''(థీసిస్) అవుతుంది. దానిగర్భంలో నుంచి ఒక ''వివాదం'' (ఆంటీ థీసిస్) పుడుతుంది. ఈవాద వివాదాలకు సంఘర్షణ జరుగుతుంది. అందులోనుండి ఒక ''సంవాదం'' (సింథసిస్) వస్తుంది. అది మరల ఒక ''వాదం'' అవుతుంది. ఈ క్రమం ఇలా సాగుతుంది. ఇలాగే జరుగుతుందని ఒప్పుకుందాము. వాద వివాదాల సంఘర్షణ ఇలా జరుగుతూపోయి, చివరికి వర్గవిహీన సమాజం ఏర్పడుతుంది. అది ''సంవాదం'' అవుతుంది. మరల అదే ఒక ''వాదం'' కావాలి కదా! ?

వర్గ విహీనత అనేది ఆదర్శ సమాజస్థితి అని అంగీకరించినట్లయితే, దానిలో నుండి పుట్టే ''వివాదం'' అంతకు మించిన ఆదర్శస్థితి కావటానికి వీలులేదు. స్వార్థపరులు ఉంటారనీ,సమస్యలు ఉంటాయనీ సైద్ధాంతిక పోరాటం ద్వారా వానిని మార్చటంజరుగుతుందనీ శ్రీ జ్వాలాముఖి అన్నారు. అయితే అది యింకా క్రింది స్థాయి స్థితి అన్నమాటే. ఇది గతితర్కంవల్ల ఆదర్శాభిముఖంగా అభివృద్ధి చెందుతుందని అందాము. చివరికి ఆదర్శస్థితి వస్తుందని మార్క్సిజం చెబుతున్నది. ఆదర్శస్థితి అని దేనిని అంటాము? అంతకంటె ఉత్తమస్థితి లేని దానినే అంటాము. అట్టి ఆదర్శ స్థితిలో నుండి పుట్టిన ''వివాదం'' ఆ ఆదర్శ స్థితి కంటె హీనమయినదిగానే వుండాలి. అప్పుడు క్రమ పరిణామంలో పురోగతికాక అధోగతి ఏర్పడుతుందని అంగీకరించినట్లవుతుంది. ఇది డార్విన్‌కు గాని, డార్విన్‌ను నమ్ముకొని సిద్ధాంత నిర్మాణం చేసిన మార్క్సుకు గాని సమ్మతమయిన విషయంకాదు. పోనీ అలాకాక వర్గ విహీన సమాజంలో ''వివాదం'' అనేది లేదనుకుందామా? ''వివాదం'' అనేది లేకపోవటంచేత మానవ సమాజంయొక్క ప్రగతి అంతటితో నిల్చిపోతుందా? లేక సమ సమాజ స్థాపన జరిగిన క్షణం నుండి గతి తార్కిక సిద్ధాంతం పని చేయటం ఆగిపోతుందా? అప్పుడు ''మానవజాతి చరిత్ర అంటే వర్గ పోరాటాల చరిత్ర మాత్రమే'' అని చెప్పిన సిద్ధాంతం తప్పని ఋజువుఅయినట్లే. అయినా వర్గాలు, వర్గ కలహాలు నసిసిపోయాయి కనుక కాలచక్ర గమనం ఆగిపోదు కదా. వర్గ పోరాటాలు అనంతంగా సాగుతూనే వుంటాయి అని చెప్పజూస్తే, ఆదర్శస్థితి అనేది ఎండమావి అని చెప్పినట్లవుతుంది. కాబట్టి ఎలా చెప్పినా గత తార్కికతలో గతీలేదు, తర్కమూలేదు. వాస్తవికతను గుర్తించగలిగే అవగాహన అసలే లేదు.

నిజానికి వర్గ చైతన్యం వున్న వ్యక్తులతో కూడిన సమాజంలో నుండి వర్గరహిత సమాజం ఉద్భవించటం కల్ల. ఒకవేళ భౌతికంగా వచ్చిందని అనుకుందాము. ఆ వచ్చినది నిలవటం కల్ల. వర్గ చైతన్యాన్ని పెంచితే వర్గాలతో కూడిన సమాజమే ఏర్పడుతుంది. వర్గరహిత సమాజ స్థాపనకు పునాదిగా వర్గరాహిత్యాన్ని గూర్చిన సామాజిక చైతన్యం అవసరం. అప్పుడే వర్గచైతన్య నిర్మూలనం వీలవుతుంది. అంతేకాని వర్గకలహాలను పెంచి,తద్వారా చివరకు వర్గ కలహాలను తుదముట్టించగలమని చెప్పే మార్క్స్ సిద్ధాంతం అవాస్తవికమయిన సిద్ధాంతం. యుద్ధాన్ని అంతం చేయటానికి యుద్ధం అనే నినాదం వంటిదే ఇదీ. వర్గ సంఘర్షణకు ముందూ, తరువాత కూడా ద్వేషభావన పెరిగి తీరుతుంది. ద్వేషం ఆధారంగా సమానత ఎలా సాధింపబడుతుంది? ద్వేషాన్ని రెచ్చగొట్టే

సామ్యవాద ప్రభావం శ్రీ గురూజీ చెప్పినట్లు నీచప్రభావంకాక మరేమవుతుంది? వర్గ రహిత సమాజం సుస్థిరంగా నిలవటానికి ఆధారం సర్వ సంగ్రాహకమయిన ప్రేమ భావన అవుతుంది గాని ద్వేష భావన కాదు తీవ్రమయిన ద్వేషాగ్నిని రగుల్కొల్పి, వర్గ కలహాలను రెచ్చగొట్టి, ఉన్న సామాజిక వ్యవస్థను కూలద్రోసినట్లయితే, తరువాత వచ్చే సామాజిక వ్యవస్థకూడా — అది వర్గవిహీన సమాజ వ్యవస్థే కావచ్చు — అదే త్రోవలో సులభంగా, శీఘ్రంగా నాశనం కాకతప్పదు వర్గ కలహాలవల్ల వ్యక్తులలో అహంకారభావన పెరుగుతుంది. వర్గరహిత సమాజంలో వ్యక్తి త్యాగశీలుడై, నిస్వార్థ బుద్ధియై వుండాలి. విద్వేష కాలుష్య దూషితాలయిన మనస్సులలోని అహంకార భావన మధురి మధురీణమయిన పరమ నిస్వార్థ భావనగా ఎలా మారటం సాధ్యమవుతుంది? అనూహ్యమయిన విషయం ఇది. ఏ మనస్తత్వశాస్త్రజ్ఞుడూ అంగీకరించని విషయం అలా మారుతుందని చెప్పటం ఒక సోషలిష్టు అవాస్తవికత.

సోషలిస్టు సమాజంలో శక్తికొద్దీ పనీ, పనికొద్దీ ఫలితం వుంటుంది. కమ్యూనిస్టు సమాజంలో శక్తికొద్దీ పనీ, అవసరం కొద్దీ ఫలితం వుంటుంది. అయితే, ''ఏ క్రమంలో, వాస్తవికమయిన ఏ సాధనాలద్వారా మానవసమాజం ఈ అత్యున్నత ధ్యేయాన్ని చేరుకుంటుందో మనకు తెలియదు, మనం తెలుసుకోలేము కూడా,'' అని లెనిన్ ఏనాడో చెప్పాడు. (సెలెక్టెడ్ వర్క్స్, లెనిన్; స్టేట్ ఎండ్ రివల్యూషన్— పుట 335) వాస్తవం ఏమిటంటే సోషలిజం, కమ్యూనిజం — వీనికంటె అవాస్తవికమయిన సిద్ధాంతాలు మరిలేవు. ఈ కుందేటి కొమ్మును సాధిస్తాము అని అనటం అమాయకత్వం, లేదా అజ్ఞానం.

ఈ సందర్భంగా మనుస్మృతి ప్రసక్తి తెచ్చారు శ్రీ జ్వాలాముఖి. మంచిదే. దయ్యాలు వేదాలు వల్లించినట్లుగా మనుస్మృతిని కార్ల్‌మార్క్స్ కూడా తన ''దాస్ కాపిటల్'' అనే గ్రంథంలో ఉదహరించాడు (కాపిటల్ వాల్ II, పేజీ 241) చండాలురు అనే పేరుతో—మనుస్మృతిలో అలా చెప్పకపోయినా — శ్రమజీవులందరినీ ఒకే గాటన కట్టివేసి, శ్రీ జ్వాలాముఖి వంచింపజూడటం విచారకరమయిన విషయం. చండాలుడు అంటే ఎవరు? ఒకానొక రీతిగా తన జీవనాన్ని గడిపే వ్యక్తి. పీనుగులపై బట్టలే వస్త్రాలుగా ధరించి, పగిలిన కుండలలో భోజనంచేస్తూ, ఇనుప వలయాలను భూషణాలుగా ధరిస్తూ దేశదిమ్మరులుగా తిరిగేవారిని చండాలురు అని చెప్పబడింది 'మనుస్మృతి'లో. (మను 9/52) ఇలాగే అనేకానేకమయిన యితర వృత్తులతో, జీవన పద్ధతులతో జీవిస్తున్న వ్యక్తులు ఆనాటి సమాజ జీవనంలో వుండటాన్ని గమనించి వారిని ఏ యే నామాలతో సంబోధిస్తుండేవారో మనువు వర్ణించాడు. సూతుడు, వైదేహుడు, మాగధుడు, క్షత్త, ఆయోగవుడు, దస్యుడు, మైత్రేయుడు, నిషాదుడు, దాసుడు, కారావరుడు, సైరింధ్రుడు ఇలా ఎన్నో రకాలయిన వ్యక్తులలో చండాలుడు ఒకడు. చండాలుడు అనే మాటకు ఈనాడు ప్రచారంలోవున్న ఒక దుర్భావాన్ని ఆసరాగా తీసుకుని, ఆ సాకుపై మనుస్మృతిని నిందింప జూడటం అనుచిత మయిన విషయం.

ఇది చాలదన్నట్లు ''చారిత్రకంగా ఆర్యులు మనవారుకారే''? అని ప్రశ్నించారు శ్రీ జ్వాలాముఖి. ఆర్యులు మధ్యఆసియానుంచో, ఐరోపా దేశాలనుంచో వలస వచ్చారంటూ సర్ విలియమ్స్ జోన్సు, ప్రొఫెసర్ గైల్సు మొదలయినవారు చేసిన వాదాలు ఏనాటివి? ఆ తరువాత ఎన్ని చారిత్రక పరిశోధనలు జరిగాయి? ఆ వాదాలన్నీ పటాపంచలు చేయబడి ఎన్నాళ్లయింది? ఈ వాస్తవికతలు యింకా శ్రీ జ్వాలాముఖి గమనానికి వచ్చివుండవు.

ఈ సందర్భంగా ఎవరి అభిప్రాయాలో అక్కరలేదు. శ్రీ అంబేద్కర్‌ను తమ వ్యాసంలో ఉదహరించారు కనుక, వారి అభిప్రాయాలనే చెప్పటం హితకరంగా వుంటుంది. శ్రీ అంబేద్కర్ ఇలా చెప్పారు: ''వేదాలలో ఆర్యులజాతి అంటూ వేరుగా ఎక్కడా చెప్పబడలేదు. ఋగ్వేదంలో ఆర్యశబ్దం 119 పర్యాయాలు వాడబడింది ఎక్కడా జాతి అనే అర్థంలో ఈ శబ్దం ప్రయోగింపబడలేదు. ఆర్యజాతి అనేది ప్రత్యేకంగా ఎక్కడాలేదు. శాస్త్రీయ పరిభాషలలో ఆర్యశబ్దం జాతికి వర్తించదు మాక్సుముల్లర్ కూడా చెప్పింది ఇదే. ఆర్యుల వలస సిద్ధాంతం స్వకపోల కల్పితం. ఊహాగానాలమీద ఆధారపడి చేసిన నిర్ణయం. శాస్త్రీయ పరిశోధనలకు వక్రీకరణ. అది వాస్తవాలపై ఆధారపడి చేసినవాదం కాదు. ఒక సిద్ధాంతాన్ని ముందుగానే ఊహించుకుని, దానిని ఋజువు పరిచేందుకు వాదాలను ఏరితెచ్చుకున్న కుయత్నం ఇది.''

ముఖ్యంగా అంబేద్కర్ చెప్పిన ఈ చివరిమాటలు ఆర్యద్రావిడ వాదానికేకాదు, శ్రీ జ్వాలాముఖి చేసిన వ్యాఖ్యలన్నింటికీ వర్తిస్తాయి.

ఏ దేశ ప్రజలు ఆ దేశభవితవ్యాన్ని నిర్ణయించుకోవాలి గాని పరాయి దేశాల ప్రమేయం వుండరాదనే విషయం జన చైనా చెబితేనే గాని శ్రీ జ్వాలాముఖిలాంటివారికి అర్థంకాదు. జనచైనా అలా చెప్పినప్పటికీ తాము ఊహిస్తున్న ''నూతన ప్రజాస్వామ్య ఆవిష్కరణకు మూడవ ప్రపంచంలో అజేయశక్తిగా రూపొందిన జన చైనా''యే శ్రీ జ్వాలాముఖికి ''విప్లవకేంద్రం'' అవుతున్నదంటే, అది వారి దేశ బాహ్యనిష్ఠనే వెల్లడిచేస్తున్నది. అట్టివారు సమాజాన్ని వర్గాలుగా చీల్చి, సంఘర్షణను సృష్టించాలని ఒకవైపు తహతహలాడుతూ, మరోవైపున దేశవిభజన జరిగిందని విచారించటం, అందుకు హిందువులు కారణం అనటం ఎంత హాస్యాస్పదమయిన విషయం?

అభారతీయాలు, అవాస్తవాలు అయిన ఆదర్శాలకు తమ తమ మనోహృదయాలను అమ్ముకున్నందువల్లనే వారి కన్నులకు హైందవ ధార్మికదృష్టి మతోన్మాదంగా కన్పిస్తుంది. భారతీయ సంస్కృతిలో భౌతిక దృక్పథం లేదనే భ్రమకలుగుతుంది. ధర్మకర్తృత్వ సిద్ధాంతం గతించిపోయిందనిపిస్తుంది.

జనతాపార్టీ పుట్టినందువల్ల దేశవ్యాప్తంగా జరగాల్సిన వర్ణవిభజన వినాయకుడి పెళ్లిలాగా మరోసారి వాయిదా పడిందని శ్రీ జ్వాలాముఖి వాపోయారు. అనివార్యమని అనుకున్న విప్లవం ఇలా అయిపోయింది! ఏం చేస్తాం ''తమ్ముడూ, నీ వెక్కదల్చుకున్న రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు'' అని మాత్రమే హెచ్చరించాలనిపిస్తుంది ఈ సందర్భంలో.



శ్రీ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# ద్రావిడ భాషలలో 'మాతృ' 'పితృ' వాచకాలు *

1. 1. భారతదేశంలో ఆర్య ద్రావిడ భాషా కుటుంబాలు రెండు ఉన్నాయని దాదాపు రెండు వందల సంవత్సరాల నుంచి ఒక సిద్ధాంతం ఏర్పడింది. అంతకు ముందూ, ఇప్పుడూ ఈ దేశప్రజల్ని భారతీయులని పిలవడం వుంది భాషల్లో కనిపించే రూపభేదాల నాధారంగా వీరిని భిన్న జాతీయులుగా; ఆర్య, ద్రావిడులుగా చెప్పవచ్చా అన్నది చాలా పెద్ద ప్రశ్నగా కొందరిని వేధించింది. పై శీర్షిక దృష్టితో శ్రీ అరవిందులవారు రాసిన ఒక వ్యాసం (The origins of Aryan Speech, 1956) ఇక్కడ ప్రస్తావింపబడుతుంది.

1. 2. తమ వ్యాసంలో శ్రీ అరవిందులు చేసిన పరిశీలన సంస్కృతంలోని పితా శబ్దానికి, తమిళంలోని అప్ప శబ్దానికి రూప సామ్యం లేకపోయినా అపత్యమ్, అప్న్యస్, అప్న వంటి సంస్కృత రూపాలకు అప్పతో సంబంధం ఉందనడం అలాగే అంబ, అంబిక, అంబా, అంబి, అంబరీష మొదలైన రూపాల నాధారంగా * అంబ్ అన్న ధాతువుని పునర్నిర్మించారు. * అప్ అన్న ధాతువును కూడా ఊహించారు ఈ రెంటికీ 'to produce' అన్న అర్థాన్ని చెప్పారు. ఆయన వాక్యం చూద్దాం:

'What is there to prevent us from supposing appa 'father' to be the Tamil form for an old Aryan active derivative form; the root corresponding to the passive derivative apatyam ? (పుట. 648)

1. 3. ధాతువును నిర్ధరించడం ఒక కల్పనం (fiction). ఇది ప్రాచీనులూ గుర్తించారు (భర్తృహరి – వాక్యపదీయం – 232). తులనాత్మక పద్ధతి (Comparative method) ద్వారా మూలభాషా రూపాలను పునర్నిర్మిస్తాము. ఈ పునర్నిర్మాణంలో కూడా ఊహ (Conjucture) చాలా అవసరం. తప్పనిస కూడా అందుకే Hockett ఇలా అంటాడు: (1958)

"The Comparative method cannot tell us where, when, or by whom this language was spoken, but it can tell us many structural facts about the language, and we can rest assured that it was indeed spoken somewhere, at some time, by someone" (57–487)

'Structural fact'ని గుర్తించడంవరకే ప్రయోజనంగా కల్గిన భాషాశాస్త్రం శబ్దార్థ సంబంధాన్నిగురించి నిరూపించడంలో చాలా అసమగ్ర సాధనమైపోవడానికి కారణం, రూపాశ్రిత నిరూపణా లక్షణమే.[1] శ్రీ అరవిందులవారి ధాతు పునర్నిర్మాణంలో కూడా ఇలాంటి ఇబ్బందులు ఉన్నాయి.

1. 4 గురుబాల ప్రబోధిక (రంగభట్టు) ఇలా నిర్వచించింది: అబి శబ్దే– అంబ్యతే శబ్ద్యతే బాలైః రిత్యంబా (పుట. 149) అంబజననే–అంబతే జనయతి సర్వమంబికా (పుట. 39) పత్ గతౌ–నపతత్య నేన పితా నరకమితి–అపత్యమ్ (పుట. 367) అప్ వ్యాప్తౌ (పుట. 176).

శ్రీ అరవిందులు అప్ ధాతువంటుంటే గురుబాల ప్రబోధిక పత్ ధాతువంటున్నది. వారు చేసింది అనుచిత విభాగం (wrong Splitting) అని అనలేము. సంస్కృత భాషలో అప్ ధాతువుగా ఈ రూపాలను నిరూపించడానికి ఎంతో ఆధారంవుందని ఆయనే రాశారు. (పుట. 648)

1. 5. నైఘంటికులు, శ్రీ అరవిందులు చెప్పే 'శబ్ద' 'to produce' అన్న ప్రయోగాలకు రెండర్థాలున్నాయి. ప్రపంచోత్పత్తి, శబ్దోత్పత్తి రెండూ అభిన్నాలని తాత్త్వికులు వాదించారు.

---

* ఈ వ్యాసానికి మూలరూపంగా 'The Dravidian Cognates for 'Mother' and 'Father' అన్న ఆంగ్ల వ్యాసం ఆలిండియా ద్రావిడ భాషా శాస్త్రవేత్తల అష్టమ సమావేశం (మధుర, జూన్ 1 2, 3 తేదీలు)లో చదవబడింది. [1978].

1 'భారతదేశంలో భాషాశాస్త్రం' (ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక, 1978. పుటలు 82–83)లో ఈ విషయం వివరింపబడింది.

( John woodroffe, 1–పుటలు1–10) తాత్త్విక దృష్టితో చిన్న పిల్లలు శబ్దించేటప్పుడు ప్రాథమిక దశల్లో గ్రహణ సులభమైన ప, మ లు బయట పడుతాయి. అంబజననే — అన్న వ్యుత్పత్తికి ఈ సర్వార్థాన్నీ చెప్పుకోవాలి. అలా కాకుండా కేవలం రూపాల లోని సాదృశ్యం ఆధారంగా చూస్తే ఎలా ఉంటుందో చూద్దాం.

1. 6. D E. D. గ్రంథం (1961)లో అమ్మ శబ్దానికి ద్రావిడ భాషల్లోని పర్యాయ పదాలను చూపిస్తూ మూల రూపాలుగా;

I త. అమ్మం 'స్తనం', మ. అమ్మిఞ్ఞ 'చనుమొనలు'

క. అమ్మణ్ణి 'చనుమొనలు', తు. అమణి, మరాఠీ. అమా 'తల్లిచన్నులు.'

II సం. అంబా (అంబ, అంబాడా, అంబాలా అంబాలికా, అంబి, అంబిక) ప్రా. అమ్మో, అమ్మహె (సంబోధన) (154) లను ఇచ్చారు. కాని అప్ప శబ్దాలకున్న 'correspondences'కి మూలరూపాన్ని వారు చూపడంలేదు(133). ఈ సమస్యకు ఒక సమాధానం శ్రీ అరవిందులది.

1. 7. అప్/అమ్బ్‌లకు ధాత్వర్థ నిర్ణయం కష్టమవడానికి ద్రావిడ భాషల్లోనే వాటికి విరుద్ధమైన లింగబోధకత కూడా కనిపించడం ఒక నిదర్శనం. అప్ప శబ్దానికి ద్రావిడ భాషల్లో మహత్త్వర్థం (–మహత్) కూడా వుంది.

త. అప్పాత్తై 'అక్క'; అప్పి 'యజమానురాలు'

తు. అప్పె 'యజమానురాలు (అమ్మ); తె. అప్ప 'అమ్మ, అక్క';

కుయి: ఆపి 'అమ్మాయి/భార్య' కువి. అప్ప 'భార్య' ఇలాగే 'అమ్మ' శబ్దానికి మహదర్థం (—మహతీ) వుంది.

తె. నాయుడమ్మ, కృష్ణమ్మగుడి, కృష్ణమనాయుడు ఇలాంటి ప్రయోగాలను గమనించే సీతారామాచార్యులు (1885) కృష్ణమ్మ యనుచో 'అమ్మ' ప్రేమ సూచకంబని యెఱుంగునది (5–5 సూ. వృత్తిలో) అని రాశారు.

ఈ పరిశీలనవల్ల గుర్తించాల్సిన విషయం అప్ప/అమ్మల విషయకంగా నిరూపితమైన ధాత్వర్థం లేదని.

## 2. 1. అప్ప-అమ్మ శబ్దాల విస్తృతి:

కేవలం ద్రావిడ రూపాలుగా నిరూపింపబడటానికి ప్రయత్నించిన ఈ రూపాలు ప్రాకృతంలోను, ఇతర ఇండో యూరోపియన్ భాషల్లోను కనిపించడం ఎంతో ఆసక్తిని రేకెత్తించే విషయం.

2. 2. R. Pischel (1965 ప్రతి) పండితుడు ఆత్మ శబ్ద వికృతిగా అప్ప (పుట 196), అంబా శబ్ద వికృతిగా 'అమ్మ' (పుట. 265) ప్రాకృతంలో కనిపిస్తున్నాయంటాడు.

2 3. Buck (1965) సంపాదనలో వెలువడ్డ నిఘంటువులో (పుటలు. 93, 94, 95) కిందిరూపాలు ఇవ్వబడ్డాయి:

1. Papa, appa, baba, Greek πα ππα. a ππα
2. mama, amma. Greek. aμμa, O.N, amma 'grand mother'; OHG. amma 'mother or nurse' (NHG. amme) Lat. amita 'aunt' Alb. ame 'mother'

ఈ రూపాల్లో ధాత్వర్థ నిరూపణం అసాధ్యమని, ( ...“They are probably based upon the intrinsically meaningless infantile syllables Pa and ma with suffix added after the analogy of other pairs of contrasted relations, while the simpler forms with or without reduplication, like NE. Pa, ma, papa, mamma, continued in use as pet names ... ... A similar use of infantile syllables especially for father and mother is observed in languages from all over the world.” (పుట. 94)) వారు నిరూపిస్తున్నారు.

2. 4. తెలుగు దేశంలో కూడా పిల్లలు మా/పా అనే తలిదండ్రుల్ని పిలుస్తారు. సంబోధనలో అ కారం చాలా వరకు లోపించడం పరిశీలించవచ్చు. బంధుత్వ సూచకాలైన ఇలాంటి ఏకాక్షర రూపాలు కొన్ని చూడండి:

అక్క, అచ్చ, అజ్జ, అత్త, అన్న, అప్ప, అమ్మ, అయ్య, అవ్వ

పై రూపాలన్నీ ద్రావిడ రూపాలే. అకారాదులే. తర్వాత ఉన్న హల్లులూ క్లిష్ట ప్రయత్నం ఉన్నవికావు. మానసిక భౌతిక ప్రక్రియల కున్న సంబంధాన్ని నిరూపించడమే శాస్త్రీయ పరిశోధన. కేవలం రూపాల నాశ్రయించి చేసే భాషా కుటుంబ విభాగం శాస్త్ర దృష్టితో తప్పనిసరి అయినా, ఇలాంటి రూపాల విషయంతో తప్పుడు దారుల్ని పట్టిస్తుంది.

పై పరిశీలన దృష్టితో అప్ప/అమ్మ పదాలు ద్రావిడ పదాలే అని చెప్పడం ఎలా సాధ్యమవుతుంది ?

## రిఫరెన్సులు :


1 'వాక్య పదీయం' భర్తృహరి, తెలుగు అకాడెమీ ప్రచురణ, హైదరాబాదు, 1974.

2 'గురు బాలప్రబోధిక.' లింగభట్టు [అమరకోశ వ్యాఖ్యానం] వావిళ్ళవారి ముద్రణము. 1962.

3 'త్రిలింగ లక్షణ శేషము', బహుజనపల్లి సీతారామాచార్యులు, వావిళ్ళవారి ముద్రణము. 1966.

4 'The origins of Aryan Speech' (in 'On the Veda'), Sri Aurobindo, International University Centre Collection, Vol V. Pondicherry 1956.

5 'The Dravidian Etymological Dictionary T. Burrow, M. B. Eureneau (cd), Oxford. 1961,

6 'A course in modern Linguisties', C. F. Hockett, Macmillan, 1958.

7 'Garland of Letters' John wood roffe, Ganesh & Co. Pvt. Ltd. Madras. 1963.

8 'Comparative Grammar of the Prakrit Languages', R. Pischel, Tr. Subhadra Jha, Motilal Benarsidas, Delhi. 1965.

9 'A Dictionary of selected synonyms in the principal Indo-European Languages', Carl Darling Buck (ed), The University of Chicago Press. London. 1965.


# వైవిధ్యం

## "ప్రభాతం"

ఒక భావన మనసులో పొగిలితే
గుండె చెరువు గండ్లుపడి
ప్రవహిస్తుంది కన్నీరు.

ఒక భావన మనసులో రగిలితే
గుండె అగ్నిగుండం మండి
నరాల్లో పర్విడుతుంది
మంట పడగల్లా నెత్తురు.

హృదయం ఒక్కటే
దాని అనుభూతీ, అభివ్యక్తీ వేర్వేరు.
అందుకే విశ్వంలో ప్రతిదానికీ
ఇంత వైవిధ్యమూ, వైరుధ్యమూను.

శ్రీ సంగనభట్ల నరసయ్య

# అప్పకవి చెప్పిన కందభేదాలు సమంజసమేనా?

తెలుగు లాక్షణికుల్లో అప్పకవి అతి ప్రసిద్ధుడవడానికి కారణం అతని నిశిత పరిశీలనా శీలం, బహుళ లక్ష్య లక్షణ చిత్రణం. కాని అప్పకవి కందాలను గూర్చి రాసేటప్పుడు మాత్రం పై లక్షణాలు అతనిలో కొఱవడ్డాయని చెప్పవచ్చు.

కందం దేశీయమైన జాతి ఛందం. సంస్కృతంలోని ఆర్యా గీతితో సామ్యము ఎక్కువ ఉన్నది. పలువురు విమర్శకుల అభిప్రాయం ప్రకారం కందం పుట్టుకకు ఆర్యాగీతే మూలకందం. ఇది దేశీయ భాషలలో నుండే సంస్కృతంలోకి పోయిందని కిట్టెల్ పండితుడు అభిప్రాయపడ్డాడు. ఆర్యాగీతిలో కందంలోలాగే ఎనిమిదేసి చతుర్మాత్రా గణాలు ఒక్కో అర్ధానికి ఉంటాయి.

కందానికి లక్షణంచెప్పే సందర్భంలో అప్పకవి తనగ్రంథంలో కందానికి ఆరు భేదాలు చెప్పాడు. నిజానికి కందానికి ఇన్ని భేదాలు తెలుగులో లేవు. సంస్కృతంలో ఆర్యాభేదాలైన ''పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల''లను అప్పకవి కంద భేదాలుగాచెప్పి, సామాన్య కందంతో చేర్చి, ఆరు భేదాలుగా చెప్పాడు.

పరగఁ గందము పథ్యయు మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు జఘన చపల
లనఁగ గంద పద్యంబు లీ యాఱు విధము
లఖిల సుకవి కృతులలోన నలరుచుండు.

[అప్పకవీయం 4–452]

ఈ ఆరు భేదాలు కందానికి అప్పకవి సృష్టించినవే. తెలుగులో ఏ ఛాందసికుడును కందానికి ఆరు భేదాలున్నట్లు చెప్పలేదు. పైగా ఈ భేదాలు అఖిల సుకవి కృతులలో దొరుకుతాయట. తెలుగులో ఆర్యా భేదాల్ని కంద భేదాలుగానైనా లేక ప్రత్యేకంగానైనా ప్రాచీన కవులెవ్వరూ వాడినట్లు కన్పించదు. లక్ష్యాల్లేని ఈ లక్షణ సృష్టి లో గల రహస్యమేమో తెలియదు. ''ఇది చదివిన పిమ్మట మఱి, యెదియేనియు చదువుబుద్ధి యేలావొడముఁన్, బదపడి గ్రంథములన్నియు, వెదకి వెదకి సారమెల్ల వివరింపంగన్''[1] అని అప్పకవీయాన్ని లక్షణ సర్వస్వంగా తీర్చిదిద్దే ప్రయత్నమేమో యిది!

కంద భేదాలుగా చెప్పబడే ఈ ఐదు ఆర్యాభేదాల్ని తెలుసుకోవడానికి ముందు ఆర్యా సామాన్య లక్షణం తెలుసుకోవలసి ఉంది. వృత్త రత్నాకరంలో ఆర్యా లక్షణం ఈలా చెప్పబడింది:

''లక్ష్మైతత్ సప్తగణా, గోపేతా భవతి నేహ విషమేజః
షష్ఠోయంచ నలఘువా, ప్రథమార్ధే నియతమార్యాయాః
షష్ఠేంద్వితీయ లాత్పరకేన్లే ముఖలాచ్చ సయతి పదనియమః
చరమేర్ధే పంచమకే తస్మాదిహ భవతి షష్ఠోలః''

ఆర్య పూర్వోత్తరార్ధాలనే విభాగం క్రింద విభాగానికి కొంత లక్షణ భేదం ఉంది. గగ, భ, జ, స, నల అనే వానిలో ఏవేని ఏడుగణాలు పిదప ఒక్క గురువు పూర్వార్ధానికి, ఒక్కఆరవ గణం మాత్రం ఒకే ఒక్క లఘువుగా మిగిలిన గణ నియమమంతా పూర్వార్ధం వలెనే ఉత్తరార్ధానికి, ఉంటాయి. అంటే పూర్వార్ధంలో [7×4=28+2=] 30 మాత్రలు, ఉత్తరార్ధంలో [6×4=24+ [6వ గణం] 1 లఘువు + 2 =] 27 మాత్రలుంటాయి. కందం పూర్వోత్తరార్ధాల్లో ఎనిమిదేసి చతుర్మాత్రా గణాలు సంపూర్ణంగా ఉంటాయి

## ఆర్య

| | | |
|---|---|---|
| పూర్వార్ధం | 4+4+4<br>4+4+4+4+2=30 | 57 మాత్రలు |
| ఉత్తరార్ధం | 4+4+4<br>4+4+1+4+2=27 | |

## కందం

| | | |
|---|---|---|
| పూర్వార్ధం | 4+4+4<br>4+4+4+4+4=32 | 64 మాత్రలు |
| ఉత్తరార్ధం | 4+4+4<br>4+4+4+4+4=32 | |

మొత్తం ఆర్యలోని మాత్రల సంఖ్య పూర్వోత్తరార్ధాల్లో కలిపి 57 కాగా కందంలో రెండర్ధాల్లో సమంగా 32 చొ॥న 64 మాత్రలుంటాయి. ఆర్యకు, కందంకు ఇది ప్రధాన భేదం. కాగా యతి విషయంలో కూడా ఈ రెంటికి చాలా భేదం ఉంది. ఆర్యలో పూర్వార్ధంలో ఆరోగణం 'నల' మైతే అందులో మొదటి లఘువు మీద యతి. ఏడవ గణమే 'నల'మైతే ఏడవ గణానికి ముందేయతి. ఉత్తరార్ధంతో ఐదో గణం 'నల' మైతే నాల్గో గణం మీదే అనగా

ఐదో గణానికి ముందే యతి. కందానికి మాత్రం ఖచ్చితంగా ఒక్కో అర్ధంలో దీర్ఘపాదంలో ఆద్యక్షరానికి నాలుగో గణం [అర్ధాన్నిబట్టి చూస్తే ఈ గణాం సంఖ్య ఏడు] మొదటి అక్షరానికి యతి. ఈ విషయంలో సంస్కృతాంధ్ర యతి నియమాల్ని అనంతుడు స్పష్టంగా చెప్పాడు.[2] అంతేగాక కందానికి ఉండే నాలుగు పాదాల్లో మొదటిపాదం ప్రారంభాక్షరం దీర్ఘమైతే మిగిలిన మూడు పాదాల ప్రారంభాక్షరాలు దీర్ఘాలుగానే ఉంటాయి. అలాగే లఘువు ఐతే లఘువులుగానే ఉంటాయి. ఇంత స్పష్టమైన భేదం ఉండగ అప్పకవి ఈ ఆర్యాభేదాల్ని కందభేదాలుగా చెప్పడం సమంజసం కానేరదు.

ఆ చెప్పిన పథ్యాది ఆర్యాభేదాల్నైనా అప్పకవి స్పష్టంగా చెప్పాడా అంటే అదీలేదు. వీటిని కందభేదాలుగానే చెప్పి, మాత్రల విషయంలోమాత్రం (కందానికి ఉండవలసిన 64 మాత్రలతోగాక) ఆర్యల్లోవలె అంత్యగణం అన్ని కందభేద లక్ష్యాల్లో ఒకే గురువును నిలిపాడు. ఆర్య ఉత్తరార్థంలో 6వగణం స్థానంలో ఉండాల్సిన ఏక లఘువును ఉంచక చతుర్మాత్రాగణం ఉంచాడు. అది కూడా అన్ని భేదాల్లోగాక పథ్య, విపుల, ముఖ చపలలోమాత్రం చతుర్మాత్రా గణంగా. మిగిలిన చపల, జఘన చపలల్లో ఉత్తరార్థంలోని షష్ఠ గణం ఆర్యలోవలె ఒకే లఘువును నిలిపాడు.

''షష్ఠోయంచ నలఘూవా''[3] అని ఆర్యలో పూర్వార్థం ఆరవగణం 'నల, జ' గణాలు రెంటిలో ఏదైనా ఉండవచ్చునని సంస్కృత ఛందోనియమమైతే అప్పకవి ఈ నియమం విషయంలో రెండు రకాల అభిప్రాయాల్ని తెలిపాడు. కందలక్షణాన్ని గూర్చి చెప్పేసీసంలో ''దీర్ఘపాదము పంచగణములదగు, దాని మూడవ తావునందు నలజలు దక్కంగ గణయవు''[4] అని 'నల, జ'ల గురించి ప్రస్తావించి, తిరిగి పథ్యాకందము లక్షణంలో ''హరువగు నాఅవయెడ నలమ''ని[5] తాను చెప్పిన లక్షణానికే వ్యతిరేకంగా చెప్పాడు. చపల, ముఖచపల పూర్వార్థంలో జగణం వాడి, ఇవి తప్ప మిగిలిన కందభేదాల్లో 'నల' వాడాడు.

ఆర్య ఉభయార్థాల్లో తృతీయగణం తర్వాత పాదసమాప్తి ఐతే అది పథ్య ఉభయార్థాల్లో ఈ విధంగా పాదసమాప్తికాక తృతీయగణంలోని పదం చతుర్థగణంలోకి చొచ్చుకొనిపోతే విపుల అవుతుంది.[6] అప్పకవి విపులలో పాదోల్లంఘన విషయంలో ఉభయార్థాలమాట ఎత్తక లక్ష్యంలో పూర్వార్థంలోమాత్రం తృతీయ గణంలోని పదం చతుర్థ గణంలోకి లంఘింపజేసి అనగా విపులా లక్షణాన్ని పాటించి, ఉత్తరార్థంలో ఈ లక్షణాన్ని పాటించక పథ్యలోవలెనే పాద (త్రిగణానంతర) సమాప్తి చేసాడు.

''ఉభయార్ధయోర్జకారౌ, ద్వితీయ తుర్యాగమధ్యగా యస్యాః'' అని చపలాలక్షణం.[7] ద్వితీయ చతుర్థగణాలు ఉభయార్థాలతో జగణాలై ఉండి, ఆ జగణాలు ఉభయపార్శ్వాల్లో గురువులు కల్గిఉంటే చపల అని పై లక్షణం భావం ఈ నియమం పూర్వార్థంలో మాత్రమే ఉంటే ముఖ చపల, ఉత్తరార్థంలో ఉంటే జఘన చపల. అప్పకవి చపలా విషయంలో జగణాన్కి ఉభయ పార్శ్వాల్లో గురువుంచుటను గూర్చిగాని, ద్వితీయస్థానంలో జగణం గూర్చిగాని ప్రసంగించలేదు. ఆతడిచ్చిన చపలోదాహరణంలో చతుర్థ గణం జగణం ఉంచి పూర్వార్థంలో గురుమధ్యస్థంగా గాక, ఉత్తరార్ధంలో గురుమధ్యస్థంగా ఉంచాడు. ముఖ చపలోదాహరణలోని జగణం గురుమధ్యస్థంకాదు.

ఈ రీతిగా కందభేదాలుగా చెప్పబడిన ఆర్యాభేదాలు కేవలం యతి ప్రాసల విషయంలోమాత్రం తెలుగువై మిగిలిన లక్షణాలన్నీ సంస్కృతంలోవలెనే ఉండి అవికూడా ద్వంద్వాభిప్రాయాల్తో శంకాస్పదాలై ఉన్నాయి. అసలు కందభేదాలైన వీటిలో ఏ ఒక్కటి కూడా కందంలోవలె 64 మాత్రల సౌష్ఠవాన్ని కలిగిలేదు.

అప్పకవిచే కందభేదాలుగా చెప్పబడిన ఈ ఆర్యాభేదాల్ని తెలుగులో పలువురు లాక్షణికులు అస్పష్టంగానే చెప్పారు. తెలుగులో ఆద్య ఛాందసికుడైన రేచన 'కవిజనాశ్రయం'లో ''కందము రెండర్థముల తుదన్ గురువులుంచి''[8] అని ఆర్యాలక్షణం చెప్పాడు. కందము రెండర్థాల తుదిని గురువులుంచితే ఆర్యాలో అర్ధానికి 34 మాత్రలవుతాయి. మరి తుదన్ అంటే ఎక్కడనో స్పష్టపడుటలేదు. ఆర్యాలక్షణం తెలిసినవాళ్లు మాత్రమే 'తుదన్' అంటే 'తుదిగణం' అని సవరించుకొంటారు. సవరణచేసినా, ఉత్తరార్ధంలో షష్ఠగణమైన ఏకలఘువు సంగతి ఇంకా అసంపూర్ణగనే ఉండి పోయింది. విన్నకోట పెద్దన తన 'కావ్యాలంకార చూడామణి'లో పథ్యగురించి చెప్తూ—

కందము నర్థంబుల తుద
నందిన గురువుడుపం బథ్యయగు[9] నని వివరించాడు.

కందంలో చివరిగణం చతుర్మాత్రాగణం ఉంటే పథ్యలో చివరిగణం ఒకే గురువు. అంటే రెండుమాత్రలు తగ్గుతాయి. ఆ అభిప్రాయాన్నే చెప్పబోయి స్పష్టంగా వ్యక్తం చెయ్యలేకపొయ్యాడు పెద్దన. ఈతని అభిప్రాయాన్ని అనుసరిస్తే కందంలో చివరిగణం 'గగ'మే కావాల్సివస్తుంది. అప్పుడే గురువు తగ్గిస్తేకాని గుర్వంతమైన పథ్యకాలేదు. ఇది సరియైన లక్షణం కాదుకదా! అలాగే అనంతుడు ఆర్యాగణాల్లో షష్ఠస్థానంలో నలగణంగాని, జగణంగాని వాడవచ్చునని చెప్పవలసింది చెప్పక కేవలం ''నలఘువారింట' అని ఒక్క నలగణమే వాడవలయునన్నాడు.[10] చపలా లక్షణంలో ద్వితీయ, చతుర్థ గణాలు జగణం వాడాలని సంస్కృత లక్షణం కాగా చిత్రకవి పెద్దన చపలలో 4వ గణం మాత్రమే జగణం వాడాలని చెప్పాడు.

ఈ విధంగా పథ్యాది ఆర్యాభేదాలు సంస్కృత లక్షణాన్కి భిన్నంగ పూర్వలాక్షణికులచే చెప్పబడి ఇవే అప్పకవికి మార్గదర్శకాలయ్యాయేమో ననిపిస్తుంది.

కందానికి మాత్రల విషయంలో సమానమైన ఆర్యాగీతి ఆర్యాభేదమే ఐనా సామాన్యార్యకంటె భిన్నలక్షణం కలది. ఆర్య యొక్క 8వ గణం పూర్వోత్తరార్థాల్లో గురువుకాగా ఆర్యాగీతి 8వ గణం చతుర్మాత్రాగణం. ఉత్తరార్థంలో ఆర్యలో 6వ గణం ఏకలఘువైతే ఆర్యాగీతిలో చతుర్మాత్రాగణమే. అంటే ఆర్యాగీతిలో

ఉభయార్థాల్లో ఎనిమిదేసి చతుర్మాత్రాగణాలు నిండుగా ఉండి కందంతో (పూర్వోత్తరార్థాల్లో 32 మాత్రల చొప్పున 64మాత్రలతో) సరిసమానంగా ఉంటుంది. అప్పకవి ఈ ఆర్యగురించి చెపుతూ పథ్యాకందానికి ఒక్క గురువుతాకిస్తే ఆర్యాగీతి అన్నాడు.[11] అంటే ఆర్యాగీతి అంత్యగణం గగమే కావాలని నియమం ఏర్పడింది. చతుర్మాత్రాగణమైతే చాలుననే నియమానికి విలక్షణమైపోయింది.

ఈ విధంగా ఆర్యాగీతి లక్షణాన్ని, కందభేదాదులుగా చెప్పిన పథ్యాదుల లక్షణాన్ని చూస్తే అప్పకవి సంస్కృతంలో ఉన్న ఆర్యా లక్షణాల్ని చక్కగా పరిశీలించినట్టు కన్పట్టదు. అప్పకవి చెప్పిన ఈ ఆరు కంద భేదాలను తెలుగులో ఏ లాక్షణికుడు కాని, ఏ కవి గాని కందభేదాలుగా స్వీకరించినట్టు గోచరించదు గాని ఆధునిక విమర్శకులలో, ఛందశ్శాస్త్రంలో ప్రత్యేక కృషిచేసి, ఆంధ్ర మహా భారతమునందలి ఛందోరహస్యాన్ని పరిశోధించి ప్రకటించిన డా॥ పాటిబండ మాధవశర్మగారు తమ "ఆంధ్రమహాభారతము – ఛందఃశిల్పము" అనే గ్రంథంలో కందాన్ని అప్పకవి చెప్పిన పథ్యాది భేదాలతో స్వీకరించాడు. ఆయన తన గ్రంథంలో పథ్యాకందము, విపులాకందమని ఈ రీతిగా పేర్కొంచాడు. కాని ఈయన మాత్రల విషయంలో అప్పకవివలె తక్కువ మాత్రల కందాన్ని కాక చతుర్మాత్రాగణాలు ఎనిమిది సంపూర్ణంగా ఉండే కందాన్ని స్వీకరించాడు. ఈలా గ్రహించడానికి కారణం ఆంధ్రమహా భారతంలో ఉన్నవన్ని అప్పకవి చెప్పిన మాత్రలు తక్కువైన కందాలుకాక సంపూర్ణ కందాలే కావడం. మాత్రల విషయంలో, యతి ప్రాసల విషయంలో సంస్కృతార్యతో పూర్తిగా భిన్నమైన మహాభారతంలోని కందాల్ని ఈయన పథ్యాది విభాగం కేవలం త్రిగణానంతర పాద సమాప్తి (పథ్య), త్రిగణాల నుల్లంఘించి పాదసమాప్తి (విపుల), చతుర్థ గణంలో జగణ విన్యాసం (చపల) అనే నియమాల్ని అనుసరించే గ్రహించాడు. ఈ కందభేదాల్ని తెలుగులో లాక్షణికులు చెప్పకున్నా కందాల నడకల్లో వివిధ గతులను సృష్టించే ఈ లక్షణాల్ని కవి త్రయం ఉపయోగించడం, మాధవశర్మగారు వాటిని వివరించి చూపడం బాగుంది. కాని ఈ భేదాలను గూర్చిన అభిప్రాయాన్ని తెలుగు లాక్షణికు లున్నట్లు ఆయన భావించడం ఆలోచింపతగ్గది. తొల్తటి తెలుగు ఛందో గ్రంథం కవిజనాశ్రయంలో రేచన కందలక్షణాన్ని చెప్పే "కందము త్రిశర గణంబుల నందును..." అను పద్యంలో "త్రిశరగణంబులని చెప్పటచే రేచన పథ్యాకందమునకే లక్షణము చెప్పినట్లు తోచుచున్న"దనితెల్పి నన్నయ రాసిన తొల్తటి "విమలాదిత్య తనూజుడు..." అనే కందాన్ని పథ్యగా నిరూపించయత్నించాడు.[12] కాని తెలుగులో రేచనేకాదు, ఆర్యాభేదాదులైన పథ్యాదులను కందభేదాలుగా ఏలాక్షణికుడును భావించినట్లు కానరాదు. రేచన చెప్పిన త్రి, శరగణములు అనగా 3 గణములు, పిదప 5 గణములు అనే అభిప్రాయం మాధవశర్మగార్కి త్రిగణానంతర పాదసమాప్తి అనే పథ్యాలక్షణంగా తోచినా రేచన అభిప్రాయం మాత్రం అదికాదనవచ్చు. కందంయొక్క 8 గణాల పూర్వార్థాన్ని ప్రత్యేకంగా 3 గణాలు, 5 గణాలని విశ్లేషించి చెప్పాల్సిన అవసరం తెలుగులో ఉంది. ఈలా చెప్పడానికి కారణం తెలుగులో యతి 3 గణాల కుఱుచపాదంతో సంబంధించక 5గణాల దీర్ఘపాదంలో ప్రత్యేకంగా ఉండడంవల్లే. అంటే దీర్ఘపాదంలోని నాల్గవగణం మొదటి అక్షరాన్కి ఏడవగణం మొదటి అక్షరంతో యతి ఉంటుంది. ఈ యతి నియమం కొఱకు తెలుగులో కుఱుచ, నిడుద పాదాలని భేదించి ఒక్కో అర్ధానికి గణసంఖ్యను ప్రత్యేకించి చెప్పాల్సిన ఆవశ్యకత ఉంది. రేచన అలానే చెప్పాడు. "కందము త్రిశరణ గణంబుల" అనే పద్యం తరువాతి పద్యంలో "నెలవెఱిగి నిడుదపాదంబుల నాల్గవ గణము మొదల బొదలగ నిడగానలయును వళ్లు"అని యతి నియమం నిడుద పాదానికని రేచన స్పష్టపరిచాడు. అంతేగాక కవిజనాశ్రయాన్ని పరిశీలిస్తే ఈ అభిప్రాయం సత్యమనే విషయం ఇంకా బలపడుతుంది. ఈ గ్రంథంలో జాత్యధికారంలో కందలక్షణాన్ని (సంపూర్ణంగా) చెప్పడాన్కి ఉపయోగించిన ఐదు కందపద్యాల్ని పరిశీలిస్తే మూడు కందాలు పథ్యాలక్షణాన్కి వ్యతిరేకంగానే ఉన్నాయి. పథ్యా కందానికే రేచన లక్షణం చెప్పదలచినపుడు లక్షణ వ్యతిరేకంగా మూడు కందాలు ఏలా రాయగలడు? తెలుగులో తొల్తటి కందపద్య శాసనం జినవల్లభుని కుర్క్యాల శాసనంలో తృతీయ గణానికే పాదసమాప్తి కలిగిన కందాలున్నాయి నన్నయ కందాల్లో, కవిజనాశ్రయంలో పాదోల్లంఘన ఉంది. దీన్ని బట్టి చూస్తే ఈ లక్షణాన్ని కందాల విషయంలో కవులు అంతగా పట్టించుకోలేదని తెలుస్తోంది.

మాధవశర్మగారు కందానికి పథ్యాది భేదాలేగాక భేదత్రయ సాంకర్యంతో కందాన్ని పదహారు భేదాలుగా భావించి వీటికి 'ఆంధ్ర మహా భారతం'లో లక్ష్యాల నిచ్చాడు. భారత కవులు ఈ పథ్యాది భేదాల్ని స్వీకరించినట్టు లేదు. ఆ విషయాన్ని గూర్చి ఆయనే తన "చందశ్శిల్పము" లో "పింగళముని చెప్పిన చపలా లక్షణాన్ని పూర్తిగా ననువర్తించు లక్ష్యములు కవిత్రయ రచన యందగుపడుటలేదు. పైని చూపబడిన లక్ష్యములు పింగళ లక్షణమును కొన్ని కొంతవఱకును, కొన్ని చాలా వరకును ననువర్తించుచున్నవ" న్నాడు.[13] సంపూర్ణంగా లక్షణం పట్టినవి లేవని తాత్పర్యం దీన్ని బట్టి కవిత్రయం కంద భేదాల్ని భావింపలేదని, కొన్ని కలిసిన లక్షణాలు యాదృచ్ఛికంగా కలిసాయని భావించడం సాహసోక్తి కాబోదు. ఈయన తన గ్రంథంలో ఈ పదహారు భేదాలేగాక గణాల్నిబట్టి కందానికి గగకందం, భకందం, స కందం, జ కందం, నల కందం అని ఈ రీతిగా మరికొన్ని భేదాల్ని చెప్పాడు. ఈ భేదాల్ని లాక్షణికులు ప్రత్యేకించి చెప్పలేదు. గణాల్నిబట్టి లక్షణసార సంగ్రహకర్త కుఱుచకందమని, నిడుడ కందమని కందాన్ని రెండు భేదాలుగా చెప్పాడు.

హరివర ముప్పది నాల్గ
క్షరముల కందంబు కుఱుచ కందంబున ని
ద్దర దగు నఱువది రెండ
క్షరముల కందంబు నిడుద కందం బయ్యెన్.

[లక్షణసార సంగ్రహం 2–86]

ముప్పది నాల్గక్షరముల కందమంటే సర్వగురు కందమనీ, అరువది రెండక్షరముల కందమంటే సర్వలఘు కందమనీ అర్థం. 64 మాత్రలకు అన్ని గురువులున్న 'గగ' గణాలే వాడితే గురువుకు 2 మాత్రల చొప్పున 32 అక్షరాలు అవుతాయి. షష్ఠ స్థానంలో 'నల, జ' ల్లో ఏదో ఒకటి తప్పనిసరిగా వాడాల్సి కాబట్టి అక్కడ రెండు మాత్రలకు ఒక్క గురువయ్యే అక్షరంవేసే అవకాశం లేదు కాబట్టి తప్పక అక్కడ రెండు లఘ్వక్షరాలే వేయాలి. అంటే ఒక్కక్షరం ఎక్కువౌతుంది. ఉభయార్ధాల్లో మొత్తం రెండక్షరాలు ఎక్కువౌతాయి ఈ విధంగా 34 అక్షరాల్లో సర్వ గురు [గగ] కందం లేక కుఱుచ కందం సాధ్యమవుతుంది. అలాగే సర్వ లఘు కందం ఉభయార్ధాలు గుర్వంతాలు కావాలి కాబట్టి ఒక్క ఆ రెండు స్థానాల్లో తప్ప [రెండక్షరాలసంఖ్య వెనుకటివలెనే తగ్గి] 62 అక్షరాలతో సాధ్యమవుతుంది. అన్నీ లఘ్వక్షరాలే ఉండడంవల్ల అక్షర సంఖ్య అధికమై నిడుద కందం అవుతుంది. మాత్రల్లో సమానత్వంవల్ల నిడుద, కుఱుచ కందాలకు ఉచ్చారణాకాలం సమానమే ఐనా వినడాన్కి ఎంతో తేడా ఉంది. 'గాబా'అనే 2 గురువుల అంటే 4 మాత్రల దీర్ఘాక్షరాల ఉచ్చారణకు 'గబగబ' అనే 4 లఘువుల అనగా అదే 4 మాత్రల హ్రస్వాక్షరాల ఉచ్చారణకూ తేడా ఏలా ఉంటుందో అలాగే సర్వలఘు, సర్వగురు కందాలు రసాభివ్యక్తిలో విశేష పాత్ర కల్గి ఉంటాయి. పాటిబండవారు చెప్పిన గణాలతో భేదాలయ్యే కందాలు లాక్షణికులు ప్రత్యేకించి చెప్పలేదు. షష్ఠ స్థానంలో నలజులు, అంత్యగణాలు గుర్వంతాలయ్యే గగ, సలు వాడాలనే నియమాలు తప్ప కందంలో చతుర్మాత్రాగణాలైన గగ, భ, జ, స,నలలు ఇష్ట వచ్చినట్లు ఎనిమిదింటిని ఉపయోగించుకోవచ్చు గదా! కవులకు ఈ స్వాతంత్ర్యం ద్వారా తమ ఇష్టం వచ్చిన గణంతో [కట్టడి స్థానాల్లో తప్పించి] కందం పూర్తి చేసికొనే అవకాశం ఉంది కాబట్టే లాక్షణికులు ఈ గణాలతో ఏర్పడే కంద భేదాలు ప్రత్యేకించి చెప్పలేదు కాబోలు. కవిత్రయం ఈ అవకాశాన్ని వినియోగించికొని రాసిన కందాల్ని పాటిబండవారు గణ బాహుళ్యాన్ని బట్టి ఆయా కందాల లక్ష్యాలుగా స్వీకరించారు. మొత్తం మీద ఈయన తవ గ్రంథంలో కందానికి ఏర్పర్చిన భేదాలు లాక్షణికులు చెప్పినవి కాకున్నా కావ్య గత భిన్న రసభావాద్యర్థ వ్యంజనా సామర్థ్యమం కలిగినవని నిరూపించుట కంద భేద పరిశీలనా దృష్టితో చూస్తే అద్భుత విషయంగా గోచరిస్తుంది. డా॥ జి.వి.సుబ్రహ్మణ్యం ప్రభృతి విమర్శకులు ఈ దృష్ట్యనే పథ్యాది కంద భేదాలను స్వీకరించినట్టున్నారు.[14]

ఆర్యయొక్క వివిధ గతుల్ని కందానికి అంటగట్టి, కంద భేదాలను సృష్టించిన అప్పకవి ప్రణాళిక మాత్రం విచిత్రంగా ఉంది. రావూరి దొరస్వామి శర్మగారు ఈ ప్రణాళికను గూర్చి చెబుతూ ''కంద పద్యము మూలముగాగొని పథ్యా విభేదాదులు చెప్పె నప్పకవి. తెలుగువారల కట్లు చెప్పిననే సుగమముగా నార్యా భేదము లర్థమగునని యట్లు వ్రాసెనేమో'' యని చెప్పిరి.[15] కాని అప్పకవి చెప్పిన ఆర్యా భేదాలు అటు కందంతో పొత్తు కుదరక, ఇటు సుగమంగా నిర్దుష్ట లక్షణాన్ని బోధించక గందరగోళంగా తయారయ్యాయి. ఆర్యా భేదాల్ని లక్షణసార సంగ్రహం ఇంతకన్న స్పష్టంగా చెప్పింది. తెలుగువారికి యతి ప్రాసలతో అలంకరించబడి, మాత్రా సౌష్ఠవంతో శ్రవణ పేయత్వాన్ని సంతరించుకొన్న ఇంత అందమైన కందం ఉండడం వల్లనేమో ఆర్యాభేదాల్ని ఉపయోగించుకోలేదని పిస్తుంది ప్రాచీనకావ్యాలని పరిశీలిస్తే. ఆధునిక కావ్యాల్లో బహుళ వృత్త ప్రయోగ వైశిష్ట్యాన్ని సంతరించుకొన్న విశ్వనాథ వారి 'రామాయణ కల్పవృక్షం' లో ఆర్యా భేదాలన్నీ ఉపయోగించబడ్డాయి. అయినా అవి యతి ప్రాసల విషయంలో మళ్లీ తెలుగుతనాన్ని పుణికి పుచ్చుకొన్నాయి.

అందరికంటె అధికంగా చెప్పాలనే తపన అప్పకవిచే గతి, మాత్రల విషయంలో కందంతో పొత్తు కుదరని ఆర్యా భేదాల్ని కందంకు అంట గట్టించిందేమో! నడకలో అడుగడుగున ఎన్నో అందాలు చిందించి, తెలుగు పద్యాల్లో అధిక సంఖ్యాకమై ఉన్నత స్థానాన్ని అధిరోహించిన ఈ కందం గతిభేదాలు ఎన్ని సృష్టించినా గణ యతిప్రాసల్లో కందం ఒకటేనని, భేదాల్లేవని భావించవచ్చు.

## అధో సూచికలు

1 అప్పకవీయం–ప్రథమా–7 వ పద్యం
2 ఛందోదర్పణం–తృతీయా–4 వ పద్యం
3 వృత్తరత్నాకరం–ద్వితీయ–1 శ్లోకం
4 అప్పకవీయం–చతుర్థ–453వ పద్యం
5 ,, ,, –454 ,,
6 వృత్తరత్నాకరం–ద్వితీయ–3, 4 శ్లోకాలు
7 ,, ,, –5 శ్లోకం
8 కవిజనాశ్రయం–జాత్యధికారం
9 కావ్యాలంకార చూడామణి–అష్టమోల్లాసం–26 పద్యం
10 ఛందోదర్పణం–తృతీయ–3వ పద్యం
11 అప్పకవీయం–చతుర్థ–536వ పద్యం
12 ఆంధ్ర మహాభారతం–ఛందఃశిల్పం–440 పేజీ
13 ,, ,, ,, –443 ,,
14 ప్రథమాంధ్ర మహా పురాణం. పేజీ.
— జి వి. సుబ్రహ్మణ్యం
15 తెలుగు భాషలో ఛందోరీతులు–148 పేజీ
— రావూరి దొరస్వామి శర్మ.

శ్రీ జి. జవహర్‌లాల్

# ఆంధ్రదేశమున అర్వాచీన చాళుక్యుల కాలమున జైనమతము

రాష్ట్రకూటుల అనంతరము ఆంధ్రమును వశపరచు కొన్నవారు చాళుక్యులు. వీరిని అర్వాచీన చాళుక్యులని (Later Chalukyas) మరియు కళ్యాణి చాళుక్యులని పిలుచుట చరిత్ర ప్రసిద్ధము. వీరును జైనమతము నత్యంతాభిమానముతో ఆదరించిరి. వీరి కాలమున గూడా జైనమతము రాజాదరణను, ప్రజాదరముపొంది ఘనమైన స్థాన మాక్రమించుకొన్నదనుటకు నాటి కాలములోని పెక్కు జినశాసనములే తార్కాణం. రాజుల ప్రోత్సాహము, ప్రజలభిమానం చూరగొని, జైనమతం చాళుక్య పాలనలో ఎనలేని గౌరవం, శక్తి సమకూర్చుకొన్నది. కళ్యాణి చాళుక్యులకు మొదట మాల్ఖేడు రాజధానిగా ఉండినది. తదుపరి హైదరాబాదు జిల్లాలోని ఇప్పటి పఠాను చెఱువుకు మార్చబడి సోమేశ్వరునిచే కళ్యాణి నగరం కట్టబడేవరకు ముఖ్యపట్టణంగా వ్యవహరింపబడినదని చారిత్రికుల నమ్మకం. బసవ పురాణం కూడా జగదేకమల్ల రెండవ జయసింహుని రాజధాని పొట్లకెఱె (నేటి పఠాను చేఱు) యని తెల్పుచున్నది. కాగా నేటి పఠానుచేఱువు ఒకనాడు 'పొట్లకెఱె'గా వ్యవహరించెడి దనుటకు శిలాశాసనాలే ప్రామాణికాలు. ఒకప్పుడు ఇప్పటి పఠానుచెఱువు ముఖ్యమైన జైన యాత్రా స్థలముగా పేరుగాంచి, ఐదువందల జినాలయాలతో శోభిల్లుతూ నుండెడిదని ఒక కథనము గూడా కలదు. ఇప్పటికీ ఇచ్చట జైన తీర్థంకరుల శిలాప్రతిమలు మెండుగా గలవు. ఈమధ్య కాలమున రాష్ట్ర పురాతత్వశాఖవారు అచ్చట త్రవ్వకాలు జరిపి, జిన దేవతామూర్తుల ప్రతిమలను హైదరాబాదులోగల ప్రదర్శనశాలలో పొందుపరచి యున్నారు. లభ్యమైన చరిత్రాధారాలు, సారస్వత సాక్ష్యాలు నేటి పఠాను చెఱువు ఒకనాడు జిన పుణ్యక్షేత్రముగా, కళ్యాణి చాళుక్యుల కాలములో అలరారుతుయున్నదను టతిశయోక్తిగానేరదు.

రాష్ట్రకూటులవలె కళ్యాణి చాళుక్యులు జైనమతాభిమానులును, జినధర్మావలంబకులును అగుటచే వారి సామంతులును, మండలేశ్వరులును, ప్రజలు ఆ మతమునందు అత్యంతాభిమానముంచి పోషించుచూ వచ్చిరి. కళ్యాణి చాళుక్యులలో మొదటి జినమతాభిమాని రెండవ జయసింహుడు. బహుశః ఈతని కాలంలోనే నేటి పఠాను చెఱువు విఖ్యాత జైనకేంద్రముగ వెలసి ఉండవచ్చును. ఇప్పటికి రెండవ జయసింహునికి చెందిన రెండు జినశాసనాలు మన రాష్ట్రములో లభ్యమైనవి. ఒకటి హైదరాబాదు మ్యూజియంలో పదిలపర్చబడినది[1] దీని ప్రకారము శక సంవత్సరము 949 (క్రి. శ. 1027) రెండవ జయసింహుని కాలంలో జైనమతాభిమాని 'బళవోజ' జినాలయమును కట్టించి' యాభై మత్తర్ల నల్లరేగడి నేలను దినపూజ ఖర్చుల కిచ్చినట్లు తెలియుచున్నది. రెండవ శాసనం నల్గొండ జిల్లా, భువనగిరి తాలూకా, సైదాపురంలో యిటీవల బయల్పడినది.[2] శకవర్షం 956 (క్రి. శ 1034) పొట్లకెఱె (నేటి పఠానుచెఱువు) యందు తాత్కాలిక స్థావరము ఏర్పరచుకొనియున్న కాలంలో వైద్యరత్నాకరుడు, ప్రాణాచార్యుడైన అగ్గలయ్య కోరినమీదట రెండవ జయసింహుడు ముచ్చనపల్లి యందున్న బుద్ధసేన జినాలయమునకు, ఇక్కురియందున్న వైద్యరత్నాకర జినాలయమునకు దానము లిచ్చియున్నట్లు యీ శాసనం వలన తెలియుచున్నది. ఈ శాసనం వలన ఇంకొక విషయం విదితమగుచున్నది. ఈ జినపిపాసి, అగ్గలయ్య ఆయుర్వేద వైద్యశాస్త్రంలో అమోఘ ప్రతిభ గలవాడని, గొప్ప శస్త్ర (Surgery) చికిత్సకుడని, శాసనంలో చెప్పబడియుండుటచే, పదుకొండవ శతాబ్దములో ఆయుర్వేదను అభివృద్ధిచెంది, ఆయుర్వేద పద్ధతిలో శస్త్రచికిత్స గూడా చేయబడెడిదని విశదమగుచున్నది. శాసనమంతయు కన్నడములో నున్నను యీ వైద్య రత్నాకరుని ప్రావీణ్యము మాత్రం చక్కటి సంస్కృత శ్లోకాలలో శ్లాఘింపబడుట ఒక విశేషం. అగ్గలయ్యకు ఆయుర్వేద శాస్త్రములోగల ప్రతిభ యీ శ్లోకాలను వీక్షించిన విశదము కాగలదు.[3]

1) ఆయుర్వేద విదాం—సదా పటు ధియాం—యే—శాస్త్ర
కర్మ—క్రమే' ప్రౌఢాః—శ్రీ జగదేక మల్ల
నృప తెర్యే శాస్త్ర—పారంగతాః।

2) ......తేషాం
సంపధి—శస్త్ర—శాస్త్ర కుశలః శ్రీ
వైద్య రత్నాకరః। జేతా
వాది బలారగ్గలః — బు
ధనిధి — శస్త్రేణ — శాస్త్రే
ణవా॥

3) అశక్య — బ్యా (బా) ధే
పి—పరైః భిషగ్ భిర్ వ్యాధి ప్రకోపే తదు

పక్రమేచ। తం అగ్గలార్యం పునరూహ
తక్షం — నిరూహ — దక్షం కథయాన్తి దిశు॥

ఇంతటి మహనీయుని ప్రతిభ మినహా యే యితర విశేషములు శాసనమున లేకుండుట నిజంగా విచారించదగ్గ విషయం.

ఆహవమల్ల సోమేశ్వరుడు, జగదేకమల్లు (రెండవ జయసింహుడు)ని తర్వాత రాజ్యానికి వచ్చెను. ఈతడు జైనమతమును అభిమానించి, జైనకవులను పోషించినట్లు శాసనాలు వెల్లడించుచున్నవి. శ్రావణ బెల్గొల్ల శాసనం ప్రకారం ప్రముఖ జైనకవి 'స్వామి' 'శబ్ద చతుర్ముఖ' బిరుదమును ఆహవమల్లుని చేతుల మీదుగా పొందెనని తెల్పుచున్నది. మన రాష్ట్రంలో లభ్యమైన ఏడు శాసనాలు గూడా ఆహమల్ల సోమేశ్వరుని ధారాళమైన జైన మతాభిమానమును వెల్లడి చేయుచున్నవి.

కళ్యాణి చాళుక్య రాజులలో ఒకడైన ఐదవ విక్రమాదిత్యుడు గూడ జైన మత పోషకుడే ఇప్పటికి మన రాష్ట్రంలో యీతని కాలానికి చెందిన ఒక్క జిన శాసనం[4] మాత్రం లభ్యమయినది. ఐదవ విక్రమాదిత్యుని రాజ్య కాలంలో [క్రీ. శ. 1012] పద్మనాభయ్య అనే జైన మతాభిమాని చిల్కూరులో గల జినాలయానిక్కి కొంత భూమి బహూకరించినట్లు పై శాసనం తెల్పుచున్నది. ఇతని తర్వాత రాజ్యానికి వచ్చినవాడు త్రిభువన మల్లదేవ విక్రమాదిత్యుడు. ఆరవ విక్రమాదిత్యుడుగా చరిత్ర ప్రసిద్ధి గాంచెను. ఇతడు కడు సమర్థుడు. ఈతని విజయ పరంపర చాళుక్య వంశానికే వన్నె తెచ్చినది. ఈతని కాలం చాళుక్య వంశ చరిత్రలో సువర్ణాధ్యాయంగా చారిత్రికులు పేర్కొన్నారు. ఈతని కాలంలో లభ్యమైన శాసనాలు విక్రమాదిత్యుని ధైర్య సాహసాలు కీర్తించుచూ చేసిన మహాదానాలను విపులంగా వివరించుచున్నవి.[5] చాళుక్య రాజులలో జైన ధర్మమును ఆదరించి, అభిమానించిన వారిలోకెల్ల యీ విక్రమాదిత్యుడు ముఖ్యుడు. ఏలన మన రాష్ట్రంలో లభ్యమైన జిన శాసనాలలో ఎక్కువ భాగం యీ మహారాజునకు చెందినవే. ఇతని కాలంలో కొలనుపాక, గొబ్బూరు, చిల్కూరు, హనుమకొండ, బానాజీపేట, తొగరుకుంట మొదలగునవి ప్రసిద్ధ జైన క్షేత్రాలుగా వెలసిల్లి, త్రిభువన మల్లదేవునిచే పోషింపబడిన వనుటకు తగిన చరిత్రాధారాలు మనకు లభ్యమయినవి.

ఇతని తదుపరి చాళుక్య రాజులు గూడ జైనమతమును స్వీకరించి, జినవసదులకు దాన ధర్మాలు చేసిరి. అట్టివారిలో భూలోకమల్లుడు [రెండవ సోమేశ్వరుడు] ఒకరు. ఇప్పటికి యీతని కాలానిక్కిచెందిన ఒకేఒక జినశాసనము జడచర్లలో లభ్యమైనది.[6] శకవర్షము 1047, చిన్నతమ్ముడైన తైలపుడు కందూరునాడును ఏలుచున్న సమయమున, భూలోకమల్లుడు కళ్యాణి చక్రవర్తిగా నున్నప్పుడు మహబూబు నగరు జిల్లాలోని జడచర్లకు దాపునవున్న గంగాపురంలో బొమ్మిశెట్టి చైత్యాలయమును కట్టించినట్లు యీ శాసనంలో ఉల్లేఖింపబడినది. నాటి చైత్యాలయమే నేటికి గుల్లత్తు గుడిగా వ్యవహరింపబడుచున్నది. ఈ బొమ్మిశెట్టి గురువు మూల సంఘము మేషా పాషా దొగచ్ఛకు చెందిన మేఘ చంద్ర భట్టారకుడు. ఇతని ఆరాధ్య తీర్థంకరుడు పార్శ్వనాథుడు. చాళుక్య రాజులలో కడపటివాడైన త్రిభువన మల్లవీర సోమేశ్వరుడు జైన ధర్మమును ఆదరించి, పోషించినవాడే ఈ విషయమును తెల్పు రెండు శాసనాలు యీమాధ్యనే లభ్యమయినవి.

పైని కథనం ప్రకారం చాళుక్య రాజుల పాలనలో జైన మతము రాజాదరణము, ప్రజల ప్రోత్సాహము పొంది, రాజ్యము నలుమూలలా వ్యాపించి బహు పరిగణననుయు సంపాదించిన దనుట సత్యసమ్మతము, చరిత్ర ప్రసిద్ధము.

జైన మతమును అభిమానించి, జైనకవులను పోషించి, పెక్కు వసదులను (జినాలయములు) కట్టించిన చాళుక్య సామంతులలో ఇంజేరు రాజధానిగా పాలించిన నొలంబ పల్లవులు ముఖ్యులు. ఇంజేరు అనంతపురం జిల్లా, మడకశిర తాలూకాలోనున్న యిప్పటి హేమావతి. వీరి కాలంలో నేటి మడకశిర తాలూకా వాసులందరు జైనమతమును నమ్మి, స్వీకరించినవారే. మడకశిర తాలూకాలోని, హేమావతి, అమరాపురం, శివరాం, తమ్మడహళ్లి, రత్నగిరి, నొలంబ పల్లవుల కాలంలో ప్రఖ్యాత జైనక్షేత్రాలుగా పేరుగాంచి యున్నవి. ఇప్పటికీ మనం యీ ప్రాంతాలలో జైన వసదులు, తీర్థంకరుల శిలాప్రతిమలు జూడవచ్చును. నొలంబ పల్లవులలో జైనమతమును అభిమానించి, ఆదరించిన వారిలో మహేంద్ర, అయ్యప మరియు రెండవ ఇరుంగోళ, అతని భార్య ఆల్పాదేవి చెప్పకోదగ్గవారు ప్రముఖ జైన వ్యాఖ్యాత పద్మప్రభ మలధారి త్రిభువన మల్లదేవ భోగదేవ చోళమహారాజు కాలంలోనున్నట్లు పాత శివరాంలో బయల్పడిన శిలాశాసనం చాటుచున్నది.[7] ఇతడు జైనమతాభిమాని, గొప్పపండితుడు. కొండకుందా చార్యునిచే వ్రాయబడిన 'నియమసారం'పై 'తాత్పర్య వృత్తి'యను పేరుతో చక్కటి వ్యాఖ్యానము వ్రాసిన పద్మప్రభుడు, పాతశివరాం శాసనంలో కీర్తింపబడిన పద్మప్రభమలధారి ఒకరేయని ప్రముఖ శాసన విజ్ఞానవేత్త డా. పి. బి. దేశాయిగారు ఋజువు చేసిరి

నిడిగల్లు రాజధానిగా తెల్గు చోళులు 12, 13 శతాబ్దములో కళ్యాణి చాళుక్యులకు సామంతులుగా వ్యవహరించియుండిరి. వీరును జైన మతావలంబికులే. ఇటీవల అమరాపురంలో బయల్పడిన శిలాశాసనం కథనం[8] ప్రకారము ఇరుగొండ చోళమహారాజు నిడుగల్లు రాజధానిగా శకవర్షము 1200 (క్రీ. శ. 1278)లో పాలించుచున్న సమయమున, మల్లిశెట్టి యను జైన మతాభిమాని తమ్మడహళ్లిలోనున్న 2000 పోకచెట్లను అమరాపురంలోనున్న బ్రహ్మ జినాలయానిక్కి దాని పునర్నిర్మాణం నిమిత్తం దానం చేసెనని తెలయుచున్నది. నేటికినీ అమరాపురానిక్కి 2 కి మీ. దూరంలో శిథిలావస్థలోనున్న జైనవసది, శాసనంలో తెల్పిన బ్రహ్మ జినాలయము ఒక్కటిగావచ్చును. చుట్టుప్రక్కల యిప్పటికీ జైనావశేషములు మెండుగా గలవు.

కళ్యాణి చాళుక్యుల సామంతరాజులలో, నొలంబ పల్లవుల తదుపరి జైనమతమును ఆదరించిన వారిలో ప్రథమ కాకతీయ

రాజులు గూడ ప్రధానులే వరంగల్లు జిల్లా హనుమకొండలోనున్న పద్మాక్షి దేవాలయము ఒకనాడు కడలాలయ వసదిగా ప్రఖ్యాతిగాంచినది. కాకతీయ రెండప్రోలుని మంత్రి పెర్గడ బేతయొక్క ప్రియసతి మైలమ్మ యీ కడలాలయ జినాలయాన్ని కట్టించి, భూదానము చేసి, పోషించినట్లు యిప్పటి పద్మాక్షి దేవాలయ ప్రాంగణంలోనున్న శిలాశాసనం[9] తెలియజేయుచున్నది. ఇప్పటి పద్మాక్షి పార్శ్వనాథ తీర్థంకరుని శాసనదేవియైన పద్మావతిగా వెలసి, మొదట జైన దేవతగా మైలమ్మ, నాటి ప్రజలచే పూజలందుకొని నేడు హిందూ దేవతగా మారి పూజలందుకొనుచున్నది. ఇప్పటికిని పద్మాక్షి దేవాలయ పరిసర ప్రాంతం జైనప్రతిమలతో నిండియున్నది. శనిగరం శిలాశాసనము[10] కాకతీయ బేతని మంత్రియొక్క కుమారుడైన వజ్రరాజు యుద్ధమల్ల జినాలయమును పునరుద్ధరణ చేసినట్లు తెలుపుచున్నది. పైని కథనం ప్రకారం హనుమకొండ, శనిగరం ప్రఖ్యాత జైన క్షేత్రాలుగా తొలి కాకతీయ రాజుల కాలంలో విలసిల్లినవి. స్థానిక చరిత్రలు[11] పరికించి చూచినచో ''రాజమండ్రిలో జైనమతస్థులను మిక్కుటముగా పీడించి, హింసించుటచే అచ్చట వారందరూ హనుమకొండకు చేరుకొని, యిచ్చట కాకతీయ రాజులచే రక్షణ పొందిరి''ని మనకు విదితమగుచున్నది. కావున కాకతీయ మహారాజుల ప్రోద్బలమువలన హనుమకొండ ప్రఖ్యాత జైనక్షేత్రముగా 12వ శతాబ్దము చివరి వరకు వెలసిల్లి యున్నదని చెప్పుట సత్యదూరము కానేరదు. కాకతీయ మహారాజులలో చివరివాడైన ప్రతాపరుద్రుని కాలంలో అప్పయాచార్యుడు 'జినేంద్రకళ్యాణము'ను జైనగ్రంథమును క్రీ. శ. 1139లో రచించెను. ఈ అప్పయాచార్యుడు ప్రఖ్యాత జైన గురువు పుష్పసేనుని శిష్యుడు. కాకతీయ మహారాజులు శైవమతస్థులైనను జైనమతమును గూడ ప్రోత్సహించి, హనుమకొండను ప్రఖ్యాత జైనక్షేత్రంగా తీర్చిదిద్ది, పెక్కు జైనమతస్థులకు వారి రాజ్యంలో ఆశ్రయము కల్పించి ఆదరించిరి.

కళ్యాణి చాళుక్యుల కాలంలో 'పొలవాస నాయకులు' నేటి వరంగల్లు జిల్లాలో వారికి అనుకూలురుగా వర్ధిల్లిరి. వీరునూ, కాకతీయులవలె జైనధర్మము నాచరించిరి. గోవిందాపురం, బానాజీపేట జైన కేంద్రములుగా 'పొలవాస' నాయకుల కాలంలో వర్ధిల్లినవి. పద్మాక్షి ప్రాంగణంలో బయల్పడిన శిలా శాసనము ప్రకారం పొలవాస నాయకులలో గొప్పవాడైన 'మేడరాజు' కడలాలయ వసదికి దానము లిచ్చినట్లు తెలియుచున్నది. బానాజీపేట శాసనము 'మేడరాజే' విక్రమ జినాలయము కట్టించి, పోషించినట్లు తెల్పుచున్నది. మేడరాజు మంత్రి నాగరాజు పార్శ్వనాథ శిలాప్రతిమను ప్రతిష్ఠించినట్లు గోవిందాపురం శాసనం[12] చెప్పుచున్నది. మరియు, కానూరు గణము మేష పాషాణ గచ్ఛకు చెందిన జైనగురువులు బాలచంద్ర, మేఘచంద్ర, పద్మనంది వీరికాలంలో జైనమత సారమును బహుళ ప్రచారముచేసినట్లు గూడా తెల్పుచున్నది. కావున నేటి తెలంగాణా ప్రాంతంలో మొదట కాకతీయ రాజుల మరియు పొలవాస నాయకుల ప్రోత్సాహము వలన, ప్రజలభిమానమువలన, జైనమతము వ్యాపించి అభివృద్ధి చెందినది.

ఇంక గుంటూరు, నెల్లూరు మండలములలో జైనమత స్థితిని పరిశీలించెదము. గుంటూరు జిల్లా, సత్తెనపల్లె తాలుకా, మునుగోడు గ్రామము జైన క్షేత్రముగ వెలసిల్లినట్లు తగినాధారములు కలవు. ఇచ్చట జైనమును గురించి తెలుపు మూడు శాసనములు ఒకే స్తంభముపై చెక్కబడియున్నవి. రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగ చోళదేవుని కాలంలో యిక్కడ 'పృథివీతిలక' జైనవసది కలదు. ఈ పృథివీతిలక జైన వసతి శ్వేతాంబర జైనులది. ఈ శిత జినాలయమునకు మొదటి కులోత్తుంగ చోడ భూపతి యొక్క ముప్పది ఏడవ రాజ్య వర్షములో ఆ మహారాజునకు సామంతుడై చందవోలు (గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా) ప్రాంతమును పాలించుచుండిన మహా మండలేశ్వరుడు వెలనాటి గొంక భూపతి దానము చేసెను. ఈ గొంక భూపతి భటుడొకడు జినాలయమునకు మరమ్మత్తులు చేయించెననిగూడా తెలియుచున్నది. కులోత్తుంగ చోడ భూపతి క్రీ. శ. 11వ శతాబ్ది మొదటి పాదమున నుండుటచేత అప్పటికి గూడా గుంటూరు మండలమున జైనము ప్రజాదరణము, రాజాదరణముచే వర్ధిల్లుచుండినదని చెప్పవచ్చును.

క్రీ. శ. 1253లో చాళుక్య చోళరాజైన మూడవ రాజరాజ దేవుని కాలంలో మతిసాగర దేవుని యాదేశమున ప్రమీలదేవి నెల్లూరుకు దాపునవున్న కనుపర్తిపాటిలో కరికాళచోళ జినాలయమునకు మెట్లు కట్టించెనని, అచ్చట దొరికిన శిలా శాసనం తెల్పుచున్నది. నెల్లూరుజిల్లాలో పదమూడవ శతాబ్దములోకూడ జినాలయములు, జిన పూజ ఉండినట్లు స్పష్టమగుచున్నది.

క్రీ. శ 11, 12 శతాబ్దములలో కళింగ దేశమును పరిపాలించిన అనంతవర్మ రాజ రాజ దేవభూపతి జైనమతము నాదరించినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 1178 లో కన్నమనాయుడను వర్తకుడు విశాఖపట్టణము జిల్లా, భోగాపురంలో రాజ రాజ జినాలయమును కట్టించి, దానికి రెండు పుట్ల భూమిని దానము చేసినట్లు తెలుపు శాసన మొకటి కలదు. ఇందువల్ల, కళింగ దేశములో జైనము వర్ధిల్లినట్లు విదితమగుచున్నది. ఒకప్పుడు తెలుగు దేశములో జైనము బాగుగా వ్యాపించి వృద్ధి చెందినట్లు పై నుదహరించిన శాసనాధారములు వెల్లడి చేయుచున్నవి. ఇప్పటికిని పలు గ్రామములలో గానవచ్చు జైన విగ్రహాలు, జైన శిథిలములు గూడా తెలుగు దేశమున జైన మతము పరివ్యాప్తమై వరిగణనీయమైనదిగా నుండెడిదని చెప్పుటకు తార్కాణము. క్రీ. శ. 13వ శతాబ్దము నుండి జైనము క్రమ క్రమముగా క్షీణించ సాగినదిగాని, పూర్తిగ నశించలేదు.

## అధోజ్ఞాపికలు

1 H. A. S., No. 18, P. P. 42-43.

2 అప్రకటితము. ఇటీవల మద్రాసులో జరిగిన 4-వ శాసన విజ్ఞానవేత్తల గోష్ఠిలో నాచే చదువబడినది.

3 . Saidapur Jain Inscription of Jagadekamalla I, second side, lines 30–45 (unpublished).

4 Ephigraphia Andhrica, Vol. II, P P 50–55.

5 SII, IX, Pt I, No. 158.

6 Epigraphia Andhrica, Vol. IV, P. P. 49–53.

7 SII, IX, Pt I, No. 278.

8 Amarapuram Jain Inscription of Irungonda Chola Maharaja, Epigraphia Andhrica, Vol V. (In press)

9 No. 22, Inscriptions of A. P : Warangal Dist.

10 No. 14, Inscriptions of A.P: Karimnagar Dist.

11 Orugallu Kaifiyat, L. R , Vol. XI, P. 113 FF.

12 J. A. H. R. S , Vol. XXXVI, Pt. I, P. 38 f. f.

# రేపు ఉదయించే సూర్యుడు

శ్రీ జనపరెడ్డి సత్యనారాయణ

**ఆ**రవిచ్చిన అరవిందాలు, ఆమని మకరందాలు
  వెలుతురు మడుగుల్లో 'జలక్రీడలు'
కాంతి దేవత కంట్లో దాక్కున్న పసిడి దివ్వెలు
వెతుక్కుంటూ దేవుడి కోట గడియలోకి
ఆశాదేవత ముగ్గుల చావడీలోకి
కళ్లల్లో కొడిగట్టిన వత్తులు వేసుకుని
వళ్లంతా ముళ్ల దుప్పటి కప్పుకుని
శివం ఎత్తినట్లు — శవం తరిమినట్లు
ఆవురుమనే అమావాస్య సందిట్లో
అదిగో మెలికలు తిరుగు తూన్నది
రేపటి ఉదయం కోసం రెపరెపలాడే రేచీకటి ..
అదే మన కటికి దరిద్రుడి ఆశా వాకిలి ...

నడ్డివిరిగిన అతగాడి పూరిగుడిశల పెరళ్లలో
అలిగి వెలగని వెన్నెల బిగికౌగిలింతలో
ఆ కటికిదరిద్రుడి ఆశాశవాల ప్రక్కన
ఆ గాజు కళ్లలోనుంచి కారే రక్తపు బొట్లు
అతని ఎడారి చెక్కిళ్లను తడుపుతూన్నప్పుడు

ఏడ్పురాక, ఏడువలేక, వికటంగా నవ్వుతూ
నూలిలోపడ్డ కీచురాళ్ల గొంతులో
శవాలు ఊపిరి పీల్చుకుంటూన్నట్టు
శివరంజని — కాదు ... కాదు — శవరంజని రాగ
                    మాలపిస్తున్నప్పుడు

పెరటి చింత చెట్టుకు వేళ్లాడే చిరుగు బొంతల
తూట్ల తూగుటుయ్యాలలో ఊగుతూ
ముదితనపు పసికందు మూలుగు వేదనతో

వడలి వాడి ముడుచుకుని వెన్నులుకున్న
డొక్కల ఎగుర వేతలో ఎక్కిళ్ళు పడుతూన్నప్పుడు
చెదలు తిన్న అట్టముక్కలాంటి అక్కున చేర్చుకుని
ఒక్క గుక్కెడైనా ఊపిరి పొయ్యలేని 'అమ్మ' కు
నులి వెచ్చని తన కరాలతో
ఆ 'అమ్మ' కు కన్నీళ్లద్దుతూన్నది ఎవరు ... ?
అతడే ! కాలం కారు పొగల్లో చిక్కుకుని
(క) నరాలు మెలివేయించుకుంటూన్న
రేపు ఉదయించే సూర్యుడు ... !

మూలరచయిత : శ్రీ భగవతీకుమార్ శర్మ

# ప్రతీతి

ట్రంక్ కాల్ చేయించిన నాలుగ్గంటల్లోనే భీనా వచ్చేసింది. సుధీర్‌కు టెలిగ్రాం కొంచెం ఆలస్యంగానే చేరింది. అయినా చేరిన వెంటనే వచ్చేశాడు. కల్పనకు దారినపోయే వ్యక్తిచేత కబురంపగా ఆమె కూడా వెంటనే రైలు అందుకుంది. భదూ చాచా అనుకోకుండానే వచ్చేశాడు. పద, వెళ్ళి నీరూను చూద్దాం, అనిపించింది నా మనస్సులో. కాని ఇక్కడేమో......ఇంకా వాళ్ళు రాకపోయిరి.

బంగళా ఏకాకిగా ఊరు చివరన వుంది. అయినా క్రమక్రమంగా ఇరుగు పొరుగు వాళ్ళకు వార్త అందింది. సుమిత్రా బహన్, హరూ చాచా, ఆ పేరు తెలియని అమ్మాయి — అందరూ మధ్యాహ్నమో, సాయంత్రమో క్రమం తప్పకుండా వస్తూపోతూ వున్నారు. ఇక జబ్బు ఏమని చెప్పడం! నీరూకు హెమరేజ్ అయిన రోజు రాత్రికి నేను మగవాణ్ణి అయివుండి కూడా ఎండుటాకు మాదిరి అల్లల్లాడిపోయాను. అర్థరాత్రి సమయం. లాన్ అంతా నిశ్శబ్దంగావుంది. ఇంటిలో టెలిఫోన్ సౌకర్యంకూడా లేదు. దగ్గర్లో డాక్టరు కూడా దొరకడు. నేను ఇటు నీరూను చూచేదా, అటు డాక్టరువద్దకు పరుగెత్తేదా! చాలా కష్టంమీద పొరుగు బంగళా వాళ్ళను లేపాను. వాళ్ళు డాక్టరును పిలుచుక వచ్చారు. అప్పటికి గాని నీరూకు కొంచెం ఉపశాంతి కలుగలేదు.

విధివిలాసం ఎలావుందో! రెండు రోజులక్రితమే కల్పన ఇక్కణ్ణుంచి వెళ్ళిపోయింది. సుధీర్ ఐదురోజులక్రితం ఇక్కడే వున్నాడు. భీనా శుక్రవారం ఇక్కడకు వస్తున్నానని ఉత్తరం రాసింది. కాని నీరూకు హెమరేజ్ అయినప్పుడు ఇంటిమొత్తానికి నేనూ, నా ప్రతిబింబాలు మాత్రమే వున్నాయి. డాక్టరేమో మందు, ఇంజక్షన్ ఇచ్చి ''ఉదయానికి ఎలా వుంటుందో చూడాలి, తగ్గకపోతే ఆసుపత్రిలో చేర్పించాలి'' అని చెప్పి, వెళ్ళిపోయాడు.

పొరుగు బంగళావాళ్ళుకూడా ఒకటి రెండుగంటల తరవాత తూగుతూవుంటే వాళ్ళను వెళ్ళమని నేనే పంపివేశాను. రాత్రి రెండు గంటలు గడిచాయి. ఇంత పెద్ద బంగళాలో నీరూ నేను! కాలమేమో ఓ పెద్ద సర్పంలాగా మమ్మలను వృక్షమనుకొని గట్టిగా చుట్టుకొంది. మేము ప్రశాంతంగా గాలికూడా పీల్చుకోలేకపోయాము. నా కళ్ళకు నిద్రరాలేదు. తరవాత కొంతసేపటికి సూర్యరశ్మి ప్రథమ కిరణం ఏదో అమాయికపు బిడ్డమాదిరి దర్శనమిచ్చింది. ఇంతకు ముందెన్నడూ సూర్యుడు ఇంత ఆత్మీయుడుగా, ఇంత పరాయివాడుగా అనిపించలేదు.

కాని ఇప్పుడు అన్నీ కూడా ఎంతో నిండుగా వున్నట్లనిపిస్తున్నాయి. భీనా నీరూ తలాపిన కూర్చొని చెమ్మగిల్లిన కళ్ళతో ఆమె తల నిమురుతూవుంది. కల్పన ఆమె కాళ్ళు పడుతూవుంది సుధీక్ బత్తాయిరసం తీస్తూవున్నాడు. భదూ చాచా రాత్రంతా మేలుకొని ఇప్పుడిప్పుడే కుర్చీలో కునుకు తీస్తున్నాడు. హరూ చాచా ఇంజక్షన్ కొని తేవడానికి బజారుకు వెళ్ళి వున్నాడు. సుమిత్రా బహన్ తన సొంత ఇంటిమాదిరి ఎంతో ఆత్మీయతతో వంటఇంట్లో కూచొని వంటచేస్తూ వుంది నేనుకూడా చాలా రోజుల తరవాత పేపర్తు పట్టుకొని రెండు వాక్యాలు చదివి, కళ్ళు మూసుకొని పడివున్న నీరూవేపు చూస్తూ వుండిపోయాను.

నీరూ......గత నలభైయేళ్ళగా మేమిద్దరం ఒకరి కొకరం కలసిపోయాం. సన్నిహితత్వం ఎక్కువై మాలో దృఢమైన ఒకే అలవాటు రూపం దాల్చింది. ఒకరికొకరం అలవాటై, ఒకరికొకరం వ్యసనమైపోయాం. చేతులు—కాళ్ళు, కళ్ళు—చెవులు ఇవన్నీ శరీరంతో కలిసివుండీ కూడా వాటికి వేరే అస్థిత్వం లేనట్లే మా సంబంధం కూడా కొంతవరకు లలాగే వుంది. ఒకప్పుడు మేమిద్దరం పోట్లాడుకునే వాళ్ళం. నీరూ అప్పుడప్పుడూ ఇల్లు వొదిలిపెట్టి పోతానని బెదరించేది. నేను కోపంతో కేకలు వేసేవాణ్ణి. దెబ్బలు తింటావని భయపెట్టేవాణ్ణి. కాని అవన్నీ సముద్ర జలంమీద తేలియాడే నురుగులాగా బుజువయ్యేది. ప్రతిరోజు సంధ్యవేళప్పుడు బంగళా ఆవరణలో కుర్చీలు వేసుకొని కూర్చొనేవాళ్ళం. నేను కళ్ళల్లో కేటరాక్టు ఆపరేషన్ చేయించుకున్నప్పటినుండి నీరూ నాకు ఏదో ప్రతిబింబంగా అస్పష్టంగా కనిపించేది. ఆమె చెయ్యి ఒకటి ఎప్పుడూ వొణికిపోతూ వుండేది అయినాసరే ఆ వొణికిపోయే చేత్తోనే ఇంటిపనంతాచేస్తూవుండేది. కాని ఒక పనిమాత్రం నేను ఆమెను చెయ్యనిచ్చేవాణ్ణికాదు. ప్రతి సాయంకాలమూ నేను కాఫీ తయారుచేసి ఆమెకు ఒక కప్పు ఇచ్చేవాణ్ణి. చాలాకాలంనుండి ఇలాగే జరుగుతూ వచ్చింది. సాయంకాలం ఆరుగంటలుకాగానే రెండు కుర్చీలు, ఒక బల్ల పట్టుకెళ్ళి ఆవరణలో వేసేవాణ్ణి. నీరూ లోపలినుండి వచ్చి ఒక కుర్చీలో కూర్చొనేది. నేను వంటగదిలోకి వెళ్ళి రెండు కప్పుల కాఫీ తయారుచేసి, వాటిని ట్రేలో పెట్టుకొని బయటికి వెళ్ళేవాణ్ణి తర్వాత కప్పుల్లో పాలు, పంచదారవేసి కలబెట్టి, ఒక కప్పు నీరూకు ఇచ్చి ఒక కప్పు నేను తీసుకొనేవాణ్ణి. ఒకటీ అరా మాటలు మాట్లాడుకుంటూ మేమిద్దరం కాఫీ చప్పరించేవాళ్ళం. అర్ధగంట, ముక్కాలుగంట ఇలాగే గడిచిపోయేది. నీరూ అనేకమార్లు నాతో ''నీ కళ్ళు బాగాలేవు గదా, కంటి ఆపరేషన్ చేయించుకున్నావుగదా! ఇలా రోజూ కాఫీతో ఎందుకు తంటాలు పడతావు ? నేను చేస్తానుగదా!''

అవేది ''నా కళ్ళు బాగా లేకపోతే, నీ చేతులుమాత్రం బాగున్నాయా? నేను రోజు మొత్తానికి ఈ ఒక్కపనేగదా చేస్తున్నాను. దీన్నికూడా నన్ను చెయ్యనివ్వవా ?'' అంటూ నవ్వుతూ అడిగేవాణ్ణి. ''నేను లేకుండా పోయినప్పుడు నీ చేతుల్తోనే తయారు చేసుకొని తాగుదువులే!'' అనగానే ఆమె నోటివెంట మాటవచ్చేది కాదు. బెదురు చూపుల్తో నన్ను చూస్తూవుండేది. మాకు రోజూ ఇలాగే జరిగేది ఆరు గంటలు కొట్టడం, కుర్చీలు, బల్ల, రెండు కప్పుల కాఫీ, ఒక కప్పు నీరూకు అందించడం, ..... ఆమె అప్పుడప్పుడు రవీంద్రుని గీతాంజలినుండి కొన్ని గీతాలు చదివి వినిపించేది. ఏడాదికి ఒకటి రెండుమార్లు నేను ఆవిడ కొరకు సితార్ లేక సరోద్ కొత్త రికార్డులు తెచ్చేవాణ్ణి. చెల్లాచెదురుగావుండే నా టేబుల్‌ను చక్కచేసి పెడుతుండేది నా కళ్లజోడు తుడిచిపెట్టేది. నా పుస్తకాలకు అట్టలు వేసిపెట్టేది. నా దిండు కవరు మారుస్తూవుండేది.

సంవత్సరం మొత్తంలో ఏ రెండు మూడు మార్లో ఈ క్రమానికి భంగం వాటిల్లేది కల్పన ఎప్పుడైనా పిల్లలతోసహా వచ్చి పడేది. మరొకప్పుడు భీనా భర్తతోసహా వచ్చేది. ఒకపర్యాయం సుధీర్‌వస్తే మరొక పర్యాయం భదూ చాచా వచ్చేవాడు. యాయావర్ పక్షిలాగా అప్పుడప్పుడు వాళ్ల ఉత్తరాలు వస్తూవుండేవి. వాటికి జవాబులు వ్రాయడం నేను మర్చిపోయేవాణ్ణి. నీరూ జ్ఞాపకం చేసేది. నేను ప్రతి నెలా ప్రభుత్వ ట్రెజరికి వెళ్ళి నా పెన్షన్ తెచ్చుకొనేవాణ్ణి. సుధీర్ ప్రతినెలా మనిఆర్డర్ పంపేవాడు. సంవత్సరంలో ఒక్కమారు మేమిద్దరం కల్పనా, భీనా, సుధీర్ వాళ్ల ఇళ్లకు వెళ్ళి, నాలుగైదు రోజులువుండి వచ్చేవాళ్లం. భదూ చాచా మమ్మలను వాళ్లింటికి లాక్కెళ్లేవాడు.

నా ఆరోగ్యం అస్తమిస్తున్న సూర్యుడి మాదిరి, బీటలు వారిన ఫ్లవర్‌వాజ్‌లాగా వుండేది. కాని నీరూ ఆరోగ్యంగా వుండేది. ఆమె ఒక్క చెయ్యిమాత్రమే ఒణుకుతూ వుండేది. ఆమె మనోబలం వజ్రసమానంగా వుండేది. నేను డోలాయమానంగా వుండేవాణ్ణి. కొన్నేళ్ళక్రితం సుధీర్‌కు మోటర్ ప్రమాదం జరిగింది. ఆ వార్త వినగానే నాకు ఏమీ దిక్కు తోచలేదు. కాని నీరూ ఒక్క నిట్టూర్పు గాని, ఏడుపుగాని లేకుండానే తేలికగా రోజులు గడిపింది.

నీరూ కంటే ముందుగా ఏదో ఒకనాడు ఈ ప్రపంచాన్ని వొదిలిపెట్టి వెళ్ళిపోతానని నాకు నమ్మకం కలిగింది. అప్పటిక నా కళ్లపైన ఈ లావుపాటి అద్దాలు వుండవు. నీరూ ఆ ఆఘాతానికి తట్టుకోగలదు. కాకపోతే వొణికిపోయే ఆమె చెయ్యి మరికొంచెం వొణికిపోయేది. అంతే! అటు తరవాత ఆమెకు వైధవ్యం ఎలాగూ తప్పదు. ఆమెలో సహనశక్తి వుంది. ఈ ఆలోచనలన్నిటితో నేను నిశ్చింతగా వుండేవాణ్ణి జీవితాంతం ఆమె కళ్లు చెమ్మగిల్లగా నేను ఎప్పుడూ చూడలేదు. ఒకవేళ ఆమె ఏడుస్తూవుంటే ... నేను ఎప్పుడైనా చూచివుంటే ... ఈ ఆలోచన కూడా ఎప్పుడూ నాకు కలగలేదు. నీటిలాంటి కోమల హృదయంగల నేను ఆ ఆఘాతాన్ని, ఒంటరితనాన్ని సహించగల శక్తి కూడగట్టుకొనేందుకు బదులు మృత్యువును ఉద్దేశపూర్వకంగా స్వీకరించి, భారమంతా నీరూ పైన వేసేదానికి ఆలోచిస్తూ వుండేవాణ్ణి. ఇది నా స్వార్థం కాకపోతే మరేమిటి ?

★ ★ ★

కాని జబ్బు ముందుగా నీరూకే వచ్చింది. అది కూడా తీవ్రంగా వచ్చింది. హేమరేజ్. బాగావున్న నీరూకు అకస్మాత్తుగా స్మారకం తప్పిపోయింది. అంతకు కొద్దిసేపు ముందే సాయంత్రం నేను నీరూకు కాఫీ కలిపి ఇచ్చాను. ఆమె నాకు గీతాంజలి కవితలు చదివి వినిపించింది. తరవాత లో వాల్యూమ్‌లో సితార్ లాంగ్ ప్లే రికార్డు పెట్టుకొని, దీపాలు ఆర్పి పడుకున్నాము. కొంతసేపటి తరవాత ఆమె నిద్రపోయి వుంటుందని ఊహించి నేను రికార్డు నిలిపివేయబోగా ఆమె నిద్రమంపుతో ''నేను మేల్కొనే వున్నాను. సితార్ వాగనివ్వండి ... ఈ రోజు రాత్రంతా సితార్ వినాలని పిస్తున్నది'' అంది. నేను సితార్ నిలిపివేయబోయిన చేతిని వెనక్కు లాక్కున్నాను. ఆనక నా కళ్లు మూతలుపడ్డాయి. అర్ధరాత్రి అయివుంటుంది. నీరసమైన ఆమె కేక విన్నాను. ఏమిటన్నాను. తలనొప్పి అంది. నేను ఆలోచించి అర్థము చేసుకొనే లోపలనే ఆవిడ స్మృతి తప్పిపోయింది.

నీరూకు జబ్బు చేయవచ్చు. కాని ఇంత తీవ్రంగానా ? ఈ విషయం నా మనస్సు అంగీకరించజాలదు. సీరియస్ కేస్ అని డాక్టర్ చెప్పినప్పుడుగాని నాకు నమ్మకం కుదర్లేదు. ఏమిచెయ్యాలో తోచక అణగారిపోయాను. కాని...ఆమె జబ్బు...అదీ సీరియస్ ... నేను ఒంటరిగా...కల్పనా, భీనా, సుధీర్, భదూచాచా అందరూ మైళ్ల దూరంలో. డాక్టరు వస్తూ పోతూ వుంటాడు. ఇరుగు పొరుగు వాళ్లు ఎంతని, ఎంతసేపని చేస్తారు ? ఊరు చివరనున్న బంగళా, అందులో ఒంటరిగానేను. లాంగ్‌ప్లే రికార్డులాంటి మా గృహస్థం ఇప్పుడు ... భీనా సుధీర్, కల్పనా వాళ్లకు టెలిగ్రాం, ట్రంక్‌కాల్‌చేసి పిలిపించవచ్చు వాళ్లు కొన్ని గంటల్లోనే ఇక్కడకు పరుగెత్తి రావచ్చు. ఈ ఆలోచన కూడా నాకు ఎంతో ఆలస్యంగా కలిగింది.

★ ★ ★

ఎలాగైతేనేమి అందరూ వచ్చేశారు. కొన్నేళ్ల తర్వాత మళ్లీ బంగళా నిండిపోయింది. ముగింపు కావస్తున్న సభా కార్యక్రమం మాదిరి అన్నీ అస్తవ్యస్తంగా వున్నప్పటికీ కల్పన వంట భారమంతా తాను వహించింది. నీరూ జబ్బుతో వున్నప్పుడు కూడా ఆమె నాకు ఇష్టమైన పకోడీలు చేసి పెట్టింది. సుధీర్ డాక్టరుతో సంప్రదింపులు, ఆసుపత్రి వ్యవహారాలు చూసుకొన్నాడు. చూస్తూ చూస్తూవుండగానే అతడు ఆరుగురు డాక్టర్లను పిలిపించి వరసలో నిలబెట్టాడు. భీనా ఇరవైనాలుగు గంటలూ నీరూ పడకవద్దనే వుండిపోయింది. భదూ చాచా వృద్ధుడై కూడా తెల్లవార్లూ మేలుకోడానికి జంకలేదు. నిజం చెప్పాలంటే నేను ఎందుకూ అక్కర్లేనివాడినైపోయాను. నాకు ఎవరూ ఏ పనీ చెప్పరు ''అలా వుండండి బాబాయ్, మీరేమీ చేయవన్లేదు'' అంటూ కల్పనగాని, భీనా గాని

నా చేతిలోని బత్తాయిరసం గ్లాసు అందుకొనేవారు 'ఇక నేనేం చేయాలి?'' అని అడిగితే ''ఏదైనా వ్రాసుకుంటూ, చదువుకుంటూ వుండండి, లేదా లైబ్రరికివెళ్లండి. మీరు ఇంట్లోవుంటే మేము కూడా గాబరాపడిపోతాము. మీ స్వభావం...''

వీళ్లంతా ఎందుకు ఇలా మాట్లాడతారు? నీరూ జబ్బుతో పడివుంటే నేను వ్రాసుకుంటూ, చదువుకుంటూ వుండేదా?... ఇంకా లైబ్రరీకి వెళ్లేదా? జీవితాంతం ఇంతకంటే నేను చేసింది మాత్రం ఏముందీ? ఇంకా గడప వలసిన శేషజీవితంలో ఇంతకంటే చేయగలిగింది కూడా ఏముంది? ఒకవేళ నీరూకు బాగయిపోతే!— కాని ఆమెకు బాగవుతుందా? కావలిసిందే; అంతటి దృఢమైన మనోబలం కలిగిన స్త్రీ...ఆమె కళ్లెత్తి ఎందుకు చూడ్డంలేదు? అప్పుడప్పుడూ కలవరిస్తూనే వుంది. డాక్టర్ల ముఖాన విషాద ఛాయలే కనిపిస్తున్నాయి. లేక నేను భ్రమపడుతున్నానేమో! కాల గర్భంలో ఏం దాగివుందో గదా! ఒక్కోరోజు గడుస్తూవుంటే ముందు నా వూపిరి పోతున్నట్లనిపిస్తున్నది.

ఇల్లంతా సందడి సందడిగా వుంది. భీనా, కల్పన, సుధీర్, భీనాభర్త, ఆమె పిల్లలు, కల్పన మొగుడు, సుధీర్ భార్య, వాళ్ల స్నేహితులు, బంధువులు, భదూ చాచా మిత్రులు. కొందరు నీరూను చూడ్డానికిరావడం, కొంతసేపు ముఖాలు గంభీరంగా పెట్టుకొని కూచోడం, ఆమె ఆరోగ్యాన్ని గురించి విచారించడం, తర్వాత లోకాభిరామాయణంలో పడడడం, వాళ్ల కొరకు కాఫీ కప్పులు, ఫలహారాల పళ్లేలు, పిల్లల గలభాలు ... ... ఈ మధ్యలో నీరూ మూలగడం...అందరూ నిశ్శబ్దంగా వుండిపోవడం. ఎవడో దోపిడి గాడు తుపాకి పట్టుకొని బంగళాలో దూకినప్పుడు వున్నట్లు — నిశ్శబ్దత ఆవరించిపోయేది. మళ్లీ కాసేపటికి అంతామామూలే. నేను ఏమీ తోచక గప్‌చిప్‌గా అటూ ఇటూ తిరుగుతూ వుండేవాణ్ణి. ఈ ఇంటిలో నేను ఒక్కణ్ణే పరాయివాణ్ణేమోనని నాకు అప్పుడప్పుడూ అనిపిస్తూ వుంటుంది. కొత్త మనిషి మాదిరి రోజుకు రెండు మూడుమార్లు నీరూ ఆరోగ్యం గురించి అడిగి, మళ్లీఒంటరితనపు గూట్లో చేరేవాణ్ణి.

★ ★ ★

జరగవలసిందేదో జరిగిపోయింది. నీరూ అంతిమశ్వాస వదలివేసింది. ఆమె కళ్లు శాశ్వతంగా మూసుకపోయాయి. ఆమె శ్యామవర్ణము ఏదో వెలుగు కాంతిలో మెరిసిపోయింది. ఆమె నుదుటి చుక్కబొట్టు అస్తమించిన సూర్యుని మాదిరి కలతచెందిపోయింది. ఓ తెల్లటి దుప్పటితో ఆమె శరీరాన్ని కప్పివేశారు.

నేతిదీపం, పిండప్రదానం, గంగాజలం, తులసీదళం, గీతా పారాయణం, పూలమాలలు, శవయాత్ర, గోడుగోడున ఏడపులు, కళ్లనీళ్లు తుడుచుకోడాలు, ట్రాఫిక్ జామ్, హారన్ గలభాలు, పసుపు కుంకుమ చల్లడాలు, ''నీరూ చాచీ చాలా అదృష్టవంతురాలు'' అని ప్రశంసించేవాళ్లు ''పాపం! తాతగారు ఒంటరివాడై పోయాడ.'' సానుభూతిపరులు, సింధూరపు చితిజ్వాలలు. నదీతీరం, కాఫీకప్పులు, చితిలోకాలిన కట్టెపుల్లల లెక్కలు, నదీప్రవాహంలో కొట్టుకుపోయిన అస్థిభస్మము, సానుభూతి తెలపడానికి ఎక్కువ సంఖ్యలోవచ్చే వాళ్లకొరకు కుర్చీలు ఏర్పాటుచేయడం ''అబ్బ! ఎంత మంది వచ్చారు! తాతగారి సంబంధాల గురించి ఏం చెప్పాలి!'' గరుడపురాణం. పురోహితుల అశుద్ధ ఉచ్చారణ. వంట సామానులు, పాత్రల రాసులు, టీ, కాఫీలు, తెల్లని వస్త్రాలు, నౌకర్లను కేకలు వేయడం, నెయ్యి నూనెల కొరత, ''అమ్మ మెడకంటె ఏమైందీ?, ఇంకా ఆపగడాలహారం'' ''నాకు శయ్యాదానం కలక్కపోతే నేను...'' ''మమ్మల్ను మర్చిపొయ్యారా?'' సానుభూతి ఉత్తరాలు, ''అబ్బ! ఎన్నిఉత్తరాలొచ్చాయి. తాతగారి బాంధవ్యాలంటే ఏమనుకొన్నారు?''

అమ్మగారి కర్మకాండ బాగా జరిగిపోయింది. సామానుల బిల్లులు, బ్యాంక్ ప్యాస్‌బుక్, చెక్‌మీద సంతకం, డెత్ సర్టిఫికేటు, పాత ఆల్‌బమ్.

భీనా తనపిల్లల్ను తోడుకొని ఇంటికి వెళ్ళిపోయింది. చంద్రశేఖర్‌కు సెలవు అయిపోయింది. కల్పన నాలుగు రోజులు ఇంటికి వెళ్లిరావలసి వస్తుంది. ఆమె పెద్ద పిల్లవాడి పరీక్షలు మొదలు కాబోతున్నాయి. సుధీర్‌కు ఏదో ఇంటర్‌వ్యూ వుంది. భదూచాచాకు కోర్టునాయిదా వచ్చింది. సుమిత్రా బహన్‌కు జ్వరం పట్టుకొంది. హరూ చాచాకు ఉబ్బసం విజృంభించింది. ఇక 'ఆ అమ్మాయి — ఆమె పేరేమిటో ఇంకా నాకు తెలియనేలేదు — ఆమెకు పెళ్లి నిర్ణయం కాబోతున్నదట. అందుకని...

సంచులు, మూటలు సర్దుకుంటున్నారు. సామాను ప్యాకింగ్ జరుగుతూ వుంది. గుసగుసలతో ఒకరికొకరు సెలవు తీసుకుంటున్నారు. పెల్లుబికే దుఃఖాన్ని పెదాలు నొక్కుకొని ఆపుకుంటున్నారు. కళ్ల కొనలు ఎరుపెక్కిపోతున్నాయి. రిక్షాలు వచ్చాయి. వాటి గరగర శబ్దం మొదలైంది. మరో ఆటో రిక్షావచ్చిన శబ్దమైంది. వెళ్లిపోయింది. నేను బంగళాకాంపౌండ్ ఇనపగేటుమూసి ఆవరణలోకి వచ్చాను. మూసివేసిన గేటు గడియ శబ్దం ఇంకా చెవుల్లో ధ్వనిస్తూనే వుంది. సాయంకాలపు పొగమంచులాంటి అస్పష్ట స్వరూపం బ్లాటింగ్ పేపరుమీద వొత్తిన బ్లూ సిరా మాదిరి వ్యాపించి వుంది.

నేను స్విచ్ ఆన్ చేశాను. దాని ''ఖట్'' శబ్దం రోజుటి కంటే బిగ్గరగా వినిపించింది. తపుడుకుంటూ వంట ఇంటివేపు వెళ్లాను. తపుడుకుంటూనే గ్యాస్ స్టౌ వెలిగించాను. కాఫీకి నీళ్లు పెట్టాను. డికాషన్ వాసన బయలుదేరింది. ట్రేలో పాట్ పెట్టి ఆవరణలోకి పట్టుకవచ్చాను. ట్రే బల్లమీద పెట్టాను. అక్కడే రెండు కప్పులు, రకాబీ వున్నాయి. పాలు పంచదారకూడా వున్నాయి. ఒక కప్పు కాఫీ కలిపాను. రెండో కప్పులో కాఫీ పోయడానికి కేతలీ పట్టుకొని చెయ్యి పైకెత్తాను. ఎత్తిన చెయ్యి ఎత్తినట్లే వుంది. ప్రక్కనచూశాను. ప్రక్కనున్న గార్డన్‌ఛేర్ ఖాళీగావుంది. నీరూ—

అనువాదం : **శ్రీ గాదంశెట్టి శ్రీరాములు**

డాక్టర్ బి. ఆర్. కె. రావు

# ప్రపంచ ప్రఖ్యాత ద్రవ్య ఆర్థిక శాస్త్రకారుడు

# డి. హెచ్. రాబర్ట్‌సన్ ఆర్థిక ఆలోచన

డి. హెచ్. రాబర్ట్‌సన్ 1890లో జన్మించాడు. 1969లో మరణించాడు. 1914 లో ట్రినిటి కాలేజిలో ఫెలోగా చేరాడు. 1930లో లండన్ విశ్వవిద్యాలయంలో ఎకనామిక్స్ రీడర్‌గా చేరాడు. అదే విశ్వవిద్యాలయంలో 1939–44 వరకు ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గా పనిచేసాడు 1944లో కేంబ్రిడ్జి విశ్వ విద్యాలయంలో ఎకనామిక్స్ ప్రొఫెసర్‌గా చేరాడు. ద్రవ్య ఆర్థిక శాస్త్రంలో ఇతడు గొప్ప పండితుడు 1969లో చనిపోయాడు. ఆయన ముఖ్యగ్రంథాలివి : (1) మనీ (1922) (2) ది కంట్రోల్ ఆఫ్ ఇండస్ట్రీ (1923) (3) ది ఎబ్ అండ్ ఫ్లో ఆఫ్ అన్‌ఎంప్లాయ్‌మెంట్ (1923) (4) బ్యాంకింగ్ పోలసీ అండ్ ది ప్రయిస్ లెవెల్ (1926) (5) ఎకనామిక్ ఫ్రాగ్ మెంట్స్ : ఎస్సేస్ అండ్ ది ఎడ్రస్సెస్ (1931) (6) ఎస్సేస్ ఇన్ మోనెటరీ థీరీ (1940) (7) యుటిలిటీ అండ్ ఆల్ దట్ (1952) (8) ఎకనామిక్ కామెంటరీస్ (1956) (9) లెక్చర్స్ ఇన్ ఎకనామిక్ ప్రిన్సిపుల్స్ — మూడు సంపుటాలు (1957–1959). ఇప్పుడు రాబర్ట్‌సన్ ఆర్థిక ఆలోచనను చూద్దాము

## ద్రవ్యము :

ద్రవ్యం విలువను ఖచ్చితంగా కొలవడం సాధ్యంకాదు. ద్రవ్య చెలామణి ప్రవాహంవల్ల, ఒక వస్తువు తన ఉత్పాదనకు తీసుకునే సగటు కాలవ్యవధివల్ల, చరమూలధనము, పొదుపు, ధరల అస్థిరత్వాలు ప్రభావితాలవుతాయి. వాస్తవిక ఆదాయంలో భాగంగాఉన్న వస్తు సేవల కొనుగోలుమీద ఒక నిర్ణీత కాలవ్యవధిలో ద్రవ్య యూనిట్ ఖర్చు చేయబడే తభాలు ద్రవ్య ప్రవాహ వేగాన్ని తెలుపుతాయి. వస్తువుల ఉత్పాదన కాలవ్యవధులలో తేడాలుంటాయి. కొన్నిటికి హెచ్చు కాలవ్యవధి అవసరం కాగా మరికొన్నిటికి తక్కువ కాలవ్యవధి సరిపోతుంది.

## వ్యాపార చక్రాలు :

వ్యాపార చక్ర విశ్లేషణలో రాబర్ట్‌సన్ పిగూమీద హెచ్చుగా ఆధారపడినట్లు గోచరిస్తోంది. ''మూలధన ఏర్పాటు ప్రక్రియలో బ్యాంకింగ్ వ్యవస్థ నెరవుతున్న పాత్రవల్ల'' వ్యాపార చక్రీయ సంబంధమైన ఎగుడు దిగుళ్ళు ఏర్పడతాయి ఆర్థికమైన ఎగుడు దిగుళ్ళకు బ్యాంకులు నిర్ణయించిన వడ్డీరేటు ప్రధాన కారణము. వ్యవసాయదారులు, పారిశ్రామిక యజమానులు బ్యాంకులనుండి స్వల్పకాలీన ఋణాలు తీసుకుంటారు. బ్యాంకులు ఈ డిమాండ్‌ను సంతృప్తిపర్చడానికి పరపతిని సృష్టిస్తాయి. తత్కారణంగా మార్కెట్‌లోని ద్రవ్యరాశి పెరగడంతో సౌభాగ్యవృద్ధి దశ ప్రారంభమౌతుంది. పరపతి కుదింపు జరగగానే వృద్ధిదశ తలక్రిందులౌతుంది. వినియోగ వస్తువుల్ని పరిమితంగా ఉత్పత్తి చెయ్యాలని చెబుతూ, వ్యాపార చక్రీయ సిద్ధాంతాలకు అల్పపొదుపు, అల్ప విని

యోగాలు ఎలా ఆధారా లవుతాయో 'ఎ స్టడీ ఇన్ ఇండస్ట్రియల్ ఫ్లక్చ్యుయేషన్స్' (1948–పే. XIV ) అనే గ్రంథంలో విశ్లేషించాడు. వ్యాపార చక్రీయత సంశ్లిష్ట దృగ్గోచరము. దీనిని వివరించడము అంత తేలికకాదు మానసిక, పారిశ్రామిక కారణాలు కూడా ఇందుకు కారణాలవుతాయి. వ్యాపార చక్రాలను ఆపడానికి రాబర్ట్సన్ సూచనలు చేసాడు.

(1) ఇంకా హెచ్చుగా కేంద్రీకృత పెట్టుబడి (2) అభివృద్ధి చేయబడిన బ్యాంకింగ్ కార్యాచరణ పద్ధతులు 3) బ్యాంకింగ్ ఆచరణ పద్ధతులను గురించిన విజ్ఞాన ప్రసారము 4) పారిశ్రామిక మార్కెట్ (5) పన్నుల రిబేటులు (6) సరళకోశవిధానము (7) ప్రభుత్వ ఆర్థిక కార్యకలాపాలు–రోడ్లు, కాలువలు, భవనాలు, వంతెనలు, పాఠశాలలు, వైద్యశాలలు మొదలైనవాటి నిర్మాణము (8) ముడిపదార్థాలను నిలువచేయుట.

## పొదుపు : మూలధనము :

వర్తమాన కాలవ్యవధిలో ఒక వ్యక్తికి వినియోగం విలువ అదే కాలవ్యవధిలోని అతని ఉత్పత్తి విలువకంటె తక్కువగా ఉన్నప్పుడు అతనికేదో కొరత (lacking) కల్గుతుంది. ఈ కొరత మూలధన ఏర్పాటుకు తోవతీస్తుంది. పొదుపు చేయడము (Saving) కొరత కల్గడము (Lacking) రెండు విభిన్న ప్రక్రియలు. ఇవి ఒకదానిపై మరొకటి ఆధారపడవు. ధరలు పెరగడంవల్ల ఒకవ్యక్తి తనకు కావలసిన వస్తువుల్ని కొనలేకపోయిన కారణంగా, అతను ఖర్చు చేయదలచిన ఆదాయంలో మిగిలిన ద్రవ్యము, అతనికి కొరతకల్గడం (lacking) వల్ల మిగిలిన ద్రవ్యమని, చెప్పబడుతుంది. ఉత్పత్తిదారులమధ్య పోటీ లేనందువల్ల ధరలు పడిపోయిన కారణంగా, వ్యక్తి ఖర్చు పెట్టదలచిన ఆదాయంలో ఖర్చుపెట్టబడకుండా మిగిలిపోయిన భాగము పొదుపు చేయబడినది (Saving) అని చెప్పబడుతుంది. మూలధనము నిధిరూపంలోను, వస్తువులరూపంలోను కూడా ఉంటుందని రాబర్ట్సన్'లెక్చర్స్ ఆన్ ఎకనామిక్ ప్రిన్సిపుల్స్' (వాల్యూం 2–పే. 53)లో వ్రాసాడు. "ఉత్పత్తి ప్రక్రియద్వారా ప్రయాణంలోఉన్న" వస్తువులు చరమూలధనంగా పరిగణించబడతాయి. దీర్ఘకొరత ప్రక్రియ (Long lacking process) ఫలితంగా మూలధనం లభ్యమౌతుంది అని రాబర్ట్సన్ 'బ్యాంకింగ్ పోలసీ అండ్ ది ప్రయిస్ లెవెల్' (పే. 43) అనే గ్రంథంలో వ్రాసాడు. కొరత ఏర్పాటు ఐచ్ఛికంగాను, బలవంతంగాను కూడా జరుగుతుంది. కొనుగోలుదార్లమధ్య పోటీ ఏర్పడి, ధరలు పెరిగినప్పుడు కొరత ఏర్పాటు బలవంతంగా జరిగిందని చెప్పబడుతుంది.

## నిర్వచనము : సూత్రాలు :

వైనల్ రాబిన్స్ అర్థశాస్త్రాని కిచ్చిన నిర్వచనం అతిపరిమిత పరిధి కలదనే భూమికమీద రాబర్ట్సన్ దాన్ని త్రోసి రాజన్నాడు. రాబిన్స్ నిర్వచనంలో పారిశ్రామిక సంఘటనకు స్థానం లేనందున లోపభూయిష్టంగా ఉన్నది. ఆర్థిక సూత్రాలు కేవలం ఆర్థిక ప్రవృత్తుల వాఙ్మూలములు (Statements) మాత్రమే. ఈ వాఙ్మూలముల ద్వారా విదితమయ్యే మానవ ప్రవర్తనలో గోచరించే మానవుని ఉద్దేశ్యాలను ద్రవ్య రూపంలోని ధరల ద్వారా కొలవచ్చునని రాబర్ట్సన్ 'ఎకనామిక్ కామెంటరీస్' (పే. 27) అనే గ్రంథంలో వ్రాసాడు.

## వినియోగదారుని మిగులు :

ఉపాంత ఉపయోగిత (Marginal Utility) రాశ్యాత్మక కొలత ద్రవ్యరూపంలో జరగడానికి వీలుంది వ్యక్తుల రుచి, వస్తువులను అనుభవించే శక్తి, ఆదాయ మొత్తాలు మొ॥ వాని ననుసరించి ఒక వ్యక్తికి మరొక వ్యక్తికి లభించే వినియోగదారు మిగుళ్లలో తేడా ఉన్నప్పటికి, "వినియోగదారుని మిగులు" భావన పూర్తిగా సహేతుకమైనది.

## భాటకము :

రాబర్ట్సన్ అభిప్రాయాలను పరిశీలిస్తే సాంప్రదాయక వాదిగా కన్పిస్తాడు. మార్షల్, పిగూల సాంప్రదాయంలో శిక్షితుడైన రాబర్ట్సన్ సాంప్రదాయవాది కావడం సహజం. భాటకం చెల్లింపు ఖర్చు (వ్యయం=Cost) క్రిందికి వస్తుంది. వ్యక్తికి ఆర్థిక భాటకాన్ని చెల్లించరాదు. "ఇతర ఉత్పత్తి కారకాలు సాధారణంగాను, స్థానికంగాను పెరగడంవల్ల భాటకంలో వచ్చే భవిష్యత్ పెరుగుదలలను ప్రభుత్వం చేతుల్లోకి పోనివ్వాలనే అభిప్రాయాన్ని బలపర్చడానికి తగినన్ని బహిరంగమైన ఆధార వాదనలున్నవి" అని 'లెక్చర్స్ ఆన్ ఎకనామిక్ ప్రిన్సిపుల్స్' (వాల్యూం 2, పే.45)లో రాబర్ట్సన్ వ్రాశాడు.

ప్రపంచలోనే గొప్ప ద్రవ్య ఆర్థిక శాస్త్రవేత్తగా పరిగణించబడిన రాబర్ట్సన్ కీన్స్‌ను విమర్శించాడు. ఆర్థిక సిద్ధాంతంలో మార్షల్, పిగూల శిష్యుడై, రాబిన్స్‌ను నిశితంగా విమర్శించాడు. వ్యాపార చక్రాలు ద్రవ్య దృగ్గోచరాలని చెప్పడం ద్వారా రాబర్ట్సన్ "హాట్రే వార్గాన్న"ను సరించాడు.

రష్యన్ మూలం : శ్రీ మిఖైల్ మిఖైలోవిచ్ కోట్స్యు బిన్స్కి

# ఆపిల్ పూలు

ఎగశ్వాస తీసుకుంటున్నప్పుడు వచ్చే ఆ చప్పుడు భరించలేక గది తలుపుమూసేశాను పక్కన, పడకగదిలో పాప చావుబతుకుల్లో వుంది. మూడురోజులుగా కంటిమీద కునుకులేదు. గదిలో పచార్లు చేస్తున్నాను. ఆందోళనతో నరాలు బిరుసెక్కి, బిగుతై గాలి కదలికకే స్వరాలు పలికే తంత్రుల్లాఉన్నాయి. లాంప్ షేడ్ గదిని రెండుగా విభజిస్తోంది. పైనంతా దట్టమైన చీకటి. కిందనీడలు అల్లుకుపోయిన వెలుగు. సోఫామీది నలగని పడకను చూడాలంటేనే చిరాకుగా వుంది. మంచుపట్టిన నల్లటి కిటికీలతో గది చీకటి సముద్రంలో ఒంటరిగా, బిక్కు బిక్కుమంటూ నడిచేనావ కేబిన్ లాగుంది. ఇంత విషాదంలోనూ, ప్రతి చిన్న విషయమూ పరిశీలించ గలుగుతున్నందుకు నాకే వింతగా వుంది. టేబిల్‌మీద ఫొటో సరిగా అమర్చాను. గదిలో ఎగశ్వాస తగ్గలేదు మూసిన తలుపులగుండా ఆ చప్పుడు వినిపిస్తూనే వుంది. పడగ్గదిలోకి వెళ్ళక్కర్లేదు. బ్లాంకెట్ మీది పాప చిన్నారి చేతుల్నూహించుకోగలను. ఆ చిన్ని చొక్కా కింద ఎగిరెగిరిపడే ఛాతీ. గాలికోసం తహ తహలాడే ఆ పెదాలు. ఎప్పుడూ బిడియపడే పాప, యిప్పుడు డాక్టర్ మెడ చుట్టూ చేతులేస్తోంది. గుండె పిండినట్టౌంది. త్వరగాముగిస్తే బావుణ్ను.

ఏ చిన్న శబ్దమైనా గుండె జారిపోతోంది. అసాధారణమైన దేదో జరుగుతున్నట్టుగా వుంది. నల్లటి రాక్షసి రెక్కల్తో ఏదో వింత ఆకారం ఆ కిటికీలోంచి దూసుకునివచ్చి గదంతా కలయతిరిగి ఒక్కసారి పిచ్చిగా కేకేస్తుంది. అంతటితో బ్రతుకుదారం తెగుతుంది. ఇంట్లో ఎవరూ నిద్రపోవటం లేదు. అదృశ్యమైనదీ, అద్భుతమైనదీ ఏదో సూలో కొట్టుకుంటోంది. ఆ శ్వాసల, నిట్టూర్పుల శబ్దం, ఆ గుండె చప్పుడు వినిపిస్తోంది ఈ అదృశ్య జీవి —ఆపద—తన పైశాచిక బాహుబంధంలో గాలిని నలిపేస్తోంది ...ఇల్లు వదిలి వెళ్ళిపోగలిగితే !

కాళ్ళు దూది పింజలైనాయి. కీ యిచ్చి వదిలిన బొమ్మ లాగ తిరుగుతున్నాను. మనసు ఆలోచనల సాలెగూళ్ళల్లుకుంటోంది. కిటికీ గుండా అనంతమైన నల్లటి శూన్యం. దూరంగ వాచ్‌మన్ కర్ర చప్పుడు చేస్తున్నాడు. ఎన్ని శతాబ్దాలుగా ఈ కర్రచప్పుడు చీకటి నిశ్శబ్దాన్ని భంగపరుస్తోంది ? ఈ చప్పుడు కాలాన్ని అధిగమించి, మా పూర్వీకులతో సమకాలీనతను స్ఫురింపచేస్తోంది — మన రాత్రి నిద్రను, ప్రశాంతతను భద్రపరుస్తున్నట్టుగా... ఈ దృశ్యాన్నెందుకు నా కొత్త నవలలో ప్రవేశపెట్టకూడదు ! క్రిస్టీనా భర్తను నగరంలో వదిలి వూరికి వచ్చేసిన తర్వాతి సన్నివేశంలో ఇది బాగా పనికొస్తుంది. నిద్రపట్టక, ఆమె కిటికీ తెరచి బైట పూత పూసిన చెట్లను చూస్తుంటుంది. కొండలూ, గుట్టలూ కలగలిసిన వూరు నిద్రమణిగి వుంటుంది. కన్ను పొడుచుకున్నా కనిపించని చీకటి. ఏ అలికిడీలేని ఆ వాతావరణంలో మెత్తని పూలవాసనలు... క్రిస్టీనా కిదంతా కొత్తగా ...

భగవాన్, నేనేం చేస్తున్నాను ! నాపాప ప్రమాదపరిస్థితిలో వున్న విషయమే మరచిపోయానా ? చెవి తలుపు కానించి విన్నాను. ఎగశ్వాస వినిపిస్తూనే వుంది. ఊపిరి తీసుకోవటానికెంత యిబ్బంది పడుతున్నదో నా చిన్నారి పాప ! ఆ గురకవింటే నాకూపిరాడలేదు. నా వూపిరి ఆమెకు సహాయం చేస్తుందేమో నన్నట్టుగా ఓసారి గుండెల నిండా గాలి పీల్చుకున్నాను.

జ్వరంగావుంది. ఒళ్ళంతా చలినిండింది. వణుకు పుట్టింది. పళ్ళు టక టక కొట్టుకుంటున్నాయి. మూడు రాత్రులుగా నిద్ర లేదు. బాధ గుండెను తొలిచేస్తున్నది. పాప నా సర్వస్వం. నామీద నాకే జాలిగా, ఒంటరిగా, దిగులుగా వుంది. మొహం పీక్కుపోయింది. కుంగిపోతున్నాను. ఒక కన్నీటి బొట్టు జారింది.

ఏమిటిది ? తలుపు. అడుగుల సవ్వడి. అంతా ముగిసిందా?

గుండెఆగినట్టౌంది గిన్నెలోనీళ్ళుపోసిన చప్పుడు. కాటెరినా పనిచేస్తున్నట్టుంది. పాపం, వృద్ధురాలు. రాత్రనక, పగలనక కష్టపడుతోంది. మా పాప — లెనోచ్కా అంటే ఈ వృద్ధురాలికి కూడా ప్రాణం...ఎగశ్వాస వినా మళ్ళీ అంతా నిశ్శబ్దం — మృత్యు హస్తాలు సమీపిస్తున్నా యనటానికి సంకేతం.

భరించలేను. గదివదిలిపోలేను. అయాసపడుతున్న ఆ శబ్దం వచ్చినంతసేపూ నా లెనోచ్కా యింకా సజీవంగా వుందని తెలుసుకోవచ్చు.

రాత్రి. దీపం పొగబారి కొడిగట్టింది. పాప గుండెలాగావత్తి ఎగిరెగిరిపడుతోంది. చీకటివెలుగుల ఆ సంఘర్షణను భయాందోళనలతో గమనించాను ఆ దీపం ఆరిపోగానే, నా పాపలోని వెలుగుకూడా పోతుందనిపించింది.

ఎంత విశ్లేషణాత్మకంగా ఆలోచిస్తున్నాను! కొవ్వొత్తి వెలిగింది. దీపం ఆర్పేశాను. గదిలో కాంతి తగ్గింది. ఇదివరకటి వెలుగునీడల అల్లిక యిప్పుడు లేదు. ఇప్పుడానీరవమైన కాంతిలో విషాదం కలిసిపోయింది. కాళ్ళీడ్చుకుంటూ, నా వెనకే వొంగిన నా నీడ నీడ్చుకుంటూ అడుగులేశాను. మనసునిండా ఆలోచనలు. అనవసరమైన,

అప్రస్తుతమైన ఆలోచనలు. కాని అన్నింటివెనకా బాధ. నాలో ఎవరో అడుగుతున్నారు; ''కాస్త ఎంగిలిపడతావా?'' ''ఇప్పుడా?'' ఆ ఆలోచనను పక్కకు నెట్టేశాను. ''హైడ్రోక్వినైన్, హైడ్రోక్వినైన్...'' ఆ మాటంటే నాకెందుకంత యిష్టం? నిద్రలేమితో వుబ్బిన నాకళ్ల కామాటలో సాంత్వన కనిపిస్తోంది. ఆ మాటల్లోనే మధురవిశ్రాంతి—గరికపచ్చని మైదానాల లోకాలు. ఇప్పుడు గురక తేదు. మరేశబ్దమూలేదు.

డైనింగ్‌రూంలో గడియారం క్రూరంగా, బిగ్గరగా రెండు కొట్టింది. రెండు పిడుగు దెబ్బలు గిలటిన్ బ్లేడులాగా నన్ను మరణానికి చేరువచేశాయి. బాధతో బిగిసిన హృదయతంత్రులు తెగిపోతాయేమో ననిపించినప్పుడు గడియారం ఆపెయ్యటంమంచిది. గడియారం ముళ్లను చూస్తూ కూర్చోవటమంటే బాధను పొడిగించటమన్నమాటే.

శాద్వలాలు అదృశ్యమై రెక్కల చప్పుడు వినిపించింది. బూడిదరంగు కిటికీ. ఎప్పటిలాగే ఫర్నిచర్. కొవ్వొత్తి పచ్చని మంట. గోడలపై వూగాడేనీడలు. చీకటి ఏదో కొత్తగావుంది—బహుశా తెలుపెక్కుతున్న ఆకాశం. నాకళ్లు ఎంత పదునైనాయంటే యిదివరకు కనిపించనివికూడా యిప్పుడు కనిపిస్తున్నాయి నన్ను నేను చూడగలుగుతున్నాను. నా గుండెలో ఏరకమైనాబాధా లేకపోవడంకూడా చూడగలుగుతున్నాను. మరణమో, మరో జీవితమో — ఏమైనాసరే.

తలుపు కిర్రుమంది. డాక్టరు గదిలోకొచ్చాడు. నా చిరకాల మిత్రుడు—డాక్టరు పాప మంచం పక్కనుండి నేరుగా నాగదిలోకి వచ్చి, చెయ్యి నొక్కాడు. తెలిసింది. అతని చూపుల్లోని నిజాయితీ తెలుసుకోగలను ఇక ఆశలేదు. చెయ్యవలసిందేమీ లేక వెళ్ళిపోతున్నాడు. నాభార్య గుమ్మంలో నిలుచుని వెళ్లిపోయే డాక్టర్ని చూస్తోంది దీనంగా, ఆశగా చూసే ఆమె కళ్ళు, మా పాప ప్రాణాల్ని వెంటతీసుకుని పోతున్నాడేమో నన్నట్టుగా అతణ్ణి వెంబడించాయి.

జాగరణలతో, బరువెక్కిన కళ్లతో, మెరిసే కన్నీటితో—అందమైన నాభార్య నావైపు తిరిగింది. మెడమీది ఆమె నల్లటి జుత్తు మెత్తగా, వెచ్చగా — అశ్రుతప్తమైన ఆమె మొహం. బోసి మెడ. సుగంధభరితమైన పసుపుశరీరం. నా గుండెలమీదవాలి దుఃఖించినప్పుడు ఆమె కేవలం నా సహచారిణి మాత్రమే కాదు, చాల అందమైన స్త్రీ అనికూడా తెలుసుకోగలిగాను.

''ఏడవకు. ఆశవదులుకోనక్కర్లేదు. మనకింకా వయసు...'' ఎంత పాడుబుద్ధి! నాపాపగొంతును మృత్యుదంష్ట్రలునలిపేస్తుంటే నేను పలికే అనునయ వాక్యాలు యివా? లెనోచ్కా మరణిస్తోంది. లేదు. వీల్లేదు, ఎవరు పాపను నానుండి లాక్కుపోగలరు? నేను బ్రతికుండగా, నా ప్రాణంలో ప్రాణం, నా ఆనందానికి అర్థం, నా లెనోచ్కాను ఎవరు నానుండి దూరం చెయ్యగలరు? గదిలో మూలుగువిని నాభార్య గాయపడిన ఆడపులిలా పాపదగ్గరకు చేరింది.

'అబద్ధం, అసంభవం' అంటూ అరుస్తున్నాను లోలోపలే. పళ్ల మధ్యన బాధను బిగపట్టాను. 'ఇది దారుణం, అమానుషం' అన్నాను విరసనగా

''ఇది ప్రకృతి ధర్మం'' అంటున్నారెవరో నా వెనక. అటూ యిటూ తిరిగాను, పరిగెత్తాను, ఫర్నిచర్ విరగ్గొట్టాను. ఏదేదో అరిచాను. నుదుటిమీద చల్లగా చమట పట్టింది. కళ్లుమూసుకుని కుర్చీలో కూలబడ్డాను.

ఎగశ్వాస నిజంగా ఆగిందా? నా వూహా? అంతా ముగిసిందా? నా భార్య మాట్లాడటంలేదు, ఏడవటంలేదు, పాపకు మెరుగైందేమో! పాపా, త్వరగా కోలుకో. మరి కాసేపట్లో అంతా సుఖాంతమవుతుందేమో! పాప హాయిగా నిద్రపోయి రేపుదయమే వస్తూ 'డాడీ' అంటూ లేస్తుందేమో! ఇది అసంభవమా? డాక్టర్లంతా వదిలి వెళ్లాక తర్వాత నేను కూడా మృత్యువుకు దగ్గరగా చేరలేదూ? ఎవర్ని ప్రార్థించాలి?

ఇంకా పాప అవస్థ పడుతూనే వుందా? లేదు. ఇప్పుడు హాయిగా శ్వాస తీసుకుంటున్నట్టుగా వుంది. బహుశా నేను పొరబడ్డానేమో, పాప నిజంగా ప్రమాదంలోవుంటే డాక్టరు అలా ధైర్యంగా నా కళ్లలోకి చూడగలిగేవాడా ?

తల్లి వేసిన కేకకు కుర్చీలో వులిక్కిపడ్డాను. కాళ్ళు నా మాట వినకపోయినా పరిగెత్తాను—దారిలో వస్తువుల్ని ధ్వంసం చేస్తూ. నా భార్య గుండె బాదుకుంటోంది. తెలిసింది. కథ ముగిసింది.

ఇప్పుడు పాపకు నా సాయం అక్కర్లేదు—కనీసం భార్యకైనా సాయం చెయ్యాలి మరి. ఆమెను గుండెల కదుముకుని, నేనే నమ్మని సాంత్వన వచనా లామెకు చెబుతూ, కన్నీటితో తడిసిన ఆమె చేతుల్ని చుంబించాను. ఓ సెడేటివ్ మాత్ర యిచ్చి, కాస్త స్థిమితపరచి గది వెలుపలికి తీసుకొచ్చాను. ఇప్పుడామె నెమ్మదిగా, నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

కాళ్ళు నన్ను గదివేపుకు లాగేయి. గుమ్మంలో ఒక్కక్షణం ఆగేను. తడారిన, రెప్పలార్చని కళ్ళు—పీడకల.

గదిమధ్యలో, విశాలమైన పరుపుమీద రంగు వెలిసిన నా చిన్నారి పాప—ఇంకా ఎగశ్వాస తీసుకుంటున్నట్టుగా విడివడిన పెదాల్లోంచి కనిపించే సన్నని పలువరుస. అరమోడ్చిన రెప్పల్లో వెలుగు మాసిన కళ్ళు. విశాలమైన తెల్లని పడకమీద చిన్న శరీరం. ఉషోదయపు మసక వెలుగు గదిలో తారట్లాడుతోంది. మరచి టేబిల్ మీద వొదిలేసిన కొవ్వొత్తి పాప మొహంమీద విషాద మరణచ్ఛాయల్ని చిత్రిస్తోంది. కింద వొలికిన నీటిలో మందుసీసాలు ప్రతిఫలిస్తున్నాయి. నేనేదీ మరచిపోగూడదు. బెడ్ షీట్లకింద వన్నె తగ్గిన ఆ వ్యక్తిని గానీ, దిండు గలీబుమీద తొలగి, చిక్కులుపడిన ఆ ముంగురులను గానీ, క్రమంగా వేడి తగ్గి కర్రబారుతున్న ఆ శరీరాన్ని గానీ, మరచిపోగూడదు.

ఇదంతా నేనోనాడుపయోగించుకోగలను — ఇలా అనుకుంటున్నది నేను గాదు. నాలోని మరొకరు అనికూడా నాకు తెలుసు. జీవితాలు చిగిర్చే ఈ వుషోదయాన, జీవితంలోని ఈ చరమాంకాన్ని గమనిస్తున్నాడు నాలోని రచయిత. ఎంత దారుణం! అనురాగాన్ని అనుభవించలేని నా హృదయం!

ఆపిల్‌చెట్టు పూతపూశాయి. ఉదయకాంతి మొక్కలమీద పరచుకుంటోంది. నీలాకాశంలో పక్షులు పాడుతున్నాయి. ఓ యాపిల్‌పువ్వును తెంపి మొహానికి నొక్కుకున్నాను. మంచుబొట్లు జారేయి. ఆ గులాబీరంగురెక్కలు నా స్పర్శకు రాలిపోయాయి.

నా పాపకుకూడా యిలాగే జరిగిందా?......

కాని, ప్రకృతిలో మెరుపు తగ్గలేదు.

రాత్రి విషాదదృశ్యం చెయ్యలేని పని, ఈ సుందరప్రకృతి చేసింది. కన్నీళ్లు ధారకట్టేయి. పూరేకులలాగా, ఓదార్పు చెక్కిళ్ల మీద జారింది. నా చేతిలో మిగిలిన ఆకుపచ్చని తొడిమవైపు చూశాను

ఇంటికెళ్లటం యిష్టంలేక తోటలోనే మరి కాసేపు గడిపాను. కథ కంచికి...బహుషా పాపకోలుకుందేమో? ఎలా నమ్మను? ఆరు—కాదు—ఐదురోజుల్కితమే పాప ఈ తోటలో గెంతుతూ అల్లరిచేసింది. ఆ లేతకాళ్లు పరుగిడుతుంటే చూసి ఆనందించనిదెవ్వరు? పూరథంల అలంకరించుకున్న చెర్రీచెట్టుకింద నేనూ పాపకలసి నిలుచున్నరోజు నిన్నటిలాగేవుంది. మొన్ననేకాదూ. చేతిలో చేయి వేసుకుని కొమ్మల్లోకి చూస్తూ తుమ్మెదలపాట విన్నాం — పూలసందుల్లోంచి కనిపించే ఆకాశాన్నీ, లేతగరికమీద మెరిసే వసంతసూర్యుణ్ణీ చూసిందెప్పుడు —

నిన్ననే కాదూ!

మరి యిప్పుడు—

మమ్మల్ని నవ్వించి, తుళ్లించి, ఆనందింపచేసిన మా పాప— తనచిన్న నైట్‌గౌన్‌లో వచ్చి నాకు 'గుడ్‌నైట్' చెప్పిన రాత్రులు ఆ వేడిచెక్కిళ్ళను నా పెదాలు ముద్దాడిన క్షణాలు ఎలా మరవగలను?

నా ప్రాణంలో ప్రాణం—నా హృదయంలో హృదయం — కాకపోతే నాకన్నా స్వచ్ఛమైన, పవిత్రమైన, అమాయికమైన ఆ హృదయం. పట్టుదారాల్లాంటి ఆ మెత్తటిజుత్తును స్పృశిస్తూ, ఆ నీలికళ్ళల్లోకి చూస్తూ గడుకున్న క్షణాలు.

కాని నా చిన్నారిపాప యిప్పుడెలాగుంది? లేదు. అలా ఆలోచించగూడదు. నాపాప నెక్కడుంచారు? పూలు విరియబూసిన ఓ యాపిల్‌కొమ్మనువిరిచి తీసుకుని వచ్చాను. గదిలో ... టేబుల్ మీద —

ఇక్కడుంచారన్నమాట. పాపా, ఎంత ఎదిగినట్టుగాఉన్నావు— మూడేళ్లైనానిండని నువ్వు ఆరేళ్ళదానిలా.

పాపలాంటి స్వచ్ఛమైన, సుకుమారమైన పూలను పాప పక్కనే వుంచాను.

గాజుపెట్టెలో బొమ్మలాగా అసహజంగా, నిటారుగా, బరువైన చేతులు రెండువైపులా పెట్టుకుని పడుకునివుంది పాప. తెల్లటి, చిన్నఫ్రాకు. తనకెంతో యిష్టమైన పచ్చటిబూట్లు.

తలవైపునున్న కొవ్వొత్తి, ఈ వుదయాన, కాంతిహీనమైన కాంతిని ప్రసరిస్తోంది. జీవంలేని చెక్కిళ్లమీద జీవంలేని ఆ కాంతి కదలాడుతోంది.

ఆ శరీరాన్ని చూస్తుంటే వింతగావుంది. ఇదేదో నాకు తెలియని కొత్తవస్తువు. ఇన్నాళ్ళూ ఎగిరి, గెంతిన శరీరానికీ, ఈ కృత్రిమ బొమ్మకూ ఏమీ సంబంధంలేదు. నేను ప్రేమించిన, దుఃఖించిన శరీరం యిదికాదు. నన్ను పేరేపించిన శరీరం ఇంకా జ్ఞాపకాలలో మెలుదుతూనే వుంది.

నన్ను క్షణంవీడని నా అనుచరుడు—జ్ఞాపకంగాదు—అప్పుడే ఈ దృశ్యాన్నంతటినీ—ఈ శరీరాన్నీ, ఆపిల్‌పూలనూ, వెలుగునీడల దాగుడుమూతలనూ, ఈవింతభావాల్నీ రికార్డు చేసుకుంటున్నాడు.

నన్నింత క్షోభపెడుతున్న ఓ అదృశ్యమూర్తి, ఇవన్నీ ఎందుకు సృష్టించావో నాకు తెలుసు. ఇదంతా నీకొకనాడు ముడిసరుకుగా పనికొస్తుంది.

పాపా, నీకు నామీద కోపంలేదూ?

అనువాదం: **శ్రీ ఎమ్. పార్థసారథి**



శ్రీ యామిజాల పద్మనాభస్వామి

# కవితా సవ్యసాచి

'శక్తిః కవిత్వ బీజం హి
ప్రాక్తనీ సంస్కృయా మతా—'

కవితకు మూలాధారమైన శక్తి—పూర్వజన్మ సంస్కారానికి సంబంధించినది—అని అన్నారు తెలిసిన పెద్దలు.

సంస్కారమనేది కేవలం శబ్దార్థాలకు సంబంధించేదేకాక 'సత్యము, శౌచము, అహింస, పరోపకారము, వినయము' అని మనిషిని మనిషినిచేసే గుణ సముదాయమునకు సంబంధించి కూడా అయి ఉండాలి. అలాటి సంస్కారం ఉన్న వ్యక్తికే కవిత కలుగుతుంది, పుట్టుకతోనే పువ్వుకి పరిమళం అబ్బుతున్నట్టు. అలాటి సంస్కారమున్న వ్యక్తికే రసాస్వాదన గుణం కలుగుతుంది.

'స్వైర విహార ధీరులగు
సారస లోచన లున్న చోటికిన్
భోరన లాతివారు చొర
బూనినచో రస భంగము'—

అంటే కేవలం శాబ్దికం, ఆర్థికం అయిన సత్తా ఉన్నంత మాత్రాన రసగ్రహణం సాధ్యంకాదు. 'సారోచన' అవడంలో ఉన్న వ్యంగ్యమును తెలిసే హృదయం కూడా ఉండాలి. అప్పుడే ఆ పద్యం సార్థకమైన కవితగా గ్రహించడం, ఆనందించడం అవుతుంది. లేకపోతే 'బధిర శంఖాధ్మానమ్' అవుతుంది కవి పరిశ్రమ. దీనినే ఏ మహానుభావుడో కాస్త కరకుగానే అన్నాడు.

'విద్వానేవ విజానాతి
విద్వజ్జన పరిశ్రమమ్
న హి వంధ్యా విజానాతి
గుర్వీం ప్రసవ వేదనామ్'

అని. దీని మూలం నాలుగు చరణాల అర్థమును తెలుగులో సామెతగా పాడుతున్నారుకూడా. 'గొడ్డుదానికేమి తెలుసు బిడ్డబాధ' అని.

అలాటి సంస్కారహీనుల దగ్గర కవిత వినిపించినా ప్రయోజనం లేదు. అలాటి దౌర్భాగ్యపు పని వద్దన్నాడొక కవి.

'అరసికాయ కవిత్వ నివేదనం
శిరసి మా లిఖ మా లిఖ మా లిఖ'—

అని కనిపించని దైవాన్ని ముమ్మారు కోరాడు...

పైన పేర్కొన్న సర్వవిధసంస్కారభరితమైన హృదయము గల కవితా సవ్యసాచి దేవులపల్లి కవి సోదరులలో 'తమ్ముడు'—తమ్మన్నశాస్త్రి అనే నామాంతరంగల వేంకట కృష్ణశాస్త్రి. ఈ సవ్యసాచి అన్నగారినిగూర్చి గతమాసం 'భారతి'లో కసింత పరిచయ ప్రాయమైన వ్యాఖ్యఖండికలో చెప్పారు. సంపాదకుల సూచన ననుసరించి అన్నకొక వ్యాసం, తమ్మునకొక వ్యాసం వేర్వేరుగ వ్రాయడం అయింది. ఇది తమ్ముణ్ణిగూర్చి 'భారతి'కి నివేదన.



దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి.
నాన్నగారు

తమ్మనశాస్త్రి సామాన్యుడు కాడు. అన్ని విధాల అన్నకు తగిన తమ్ముడు. నిత్య జీవితం ఎలా గడిపారో యీ అన్నదమ్ములు తెలియదుగాని కవితా జీవితములో తమ్ముడు 'లక్ష్మణే శరసంధానం' అన్నట్టు తీవ్రాశుధారతో గ్రంథ రచన చేసేవాడని యీ సవ్యసాచి తనయుడు శ్రీ కృష్ణశాస్త్రిగారు చెప్పారు. కృష్ణశాస్త్రిగారంటే ఏబది సంవత్సరాల క్రిందటనుంచి అందరికీ తెలిసిన ఆధునిక కవితా యుగకర్త. మృదు మధుర పదబంధానికీ, సులలిత సమాస గ్రథన శక్తికీ అభినవ నన్నపార్యుడుగా నుతికెక్కిన సుతమతి. కృష్ణపక్షమును తన సుమధుర భావ సుధా సేచనముతో శుక్ల పక్షమును చేసిన సరస కవితా చక్రవర్తి...

సుబ్బరాయశాస్త్రి హృదయములో మెదలిన భావానికి ఏర్చి మార్చి తగిన పదాలను కూర్చి పద్య రూపమును పొందించడంలో విసువు నెరగని విద్వద్ధర్మ వీరుడని ప్రసిద్ధి. తమ్మున కంత ఓర్పు ఉండేది కాదట! భావోదయమయిన వెంటనే పద్యం రూపొందిందన్న మాట!... ఆలాగే అన్నకు అట్టే ఇష్టంలేని శబ్దాలంకారం వివిధ రీతుల వాడుకోడం యీ తమ్మునకెంతో ఇష్టం. ప్రతిభా వ్యుత్పన్నతలకు ఇద్దరూ ఒక్కరే అని ఇద్దరి కబ్బాలూ ముద్దుగా, నిబ్బరంగా చెప్తాయి. ఆ అన్న 'మహేంద్ర విజయము' గురించి రెండు మాటలు చెప్పాను. ఈ తమ్ముని కావ్యాలలో ప్రౌఢ నిర్భర వయః పరిపాక దశలో వ్రాసిన 'నయనోల్లాసము'ను, చరమ దశలో సృష్టించిన 'యతిరాజ విజయము'ను గూర్చి నాలుగు మాటలు వ్రాస్తాను...

'మృదుశైలి, స్వభావోక్తియు,
పద లాలిత్యమును, ధీర పామర జన తా
హృదయంగమ రచనయు నీ
సుదృఙ్మణి సువాక్య ఫణితి శోభిలు మిగులన్' —

అని ఆశ్వినీయులు సుకన్య మాటలను విని మెచ్చుకుంటారు మూడో ఆశ్వాసములో. ఇది లక్షణయీ ఏతత్కావ్యకృతి చెప్పినట్టు గ్రహించాలి. ఏ కవికావ్యమైనా యీలాటి లక్షణాలు కలదై ఉండాలని చెప్పినట్టున్నా, నా కావ్యం ఏవంవిధ లక్షణ లక్షితయై ఉంటుందని అన్నట్టున్నా అర్థం చెప్పుకోవలసి ఉందని నేననుకుంటాను. ఈలాగు పాత్రల ద్వారా తమ రచనలయందలి లక్షణ సంపదను పూర్వ నాదులు చెప్పి ఉండడం కావ్యార్థ వేత్తలు గ్రహించిన విషయమే.

ఇక, కావ్య వస్తువు: సుప్రసిద్ధమే. భారతము నందలిది. శర్యాతి మహారాజుకి లేక లేక ఆడుబిడ్డ కలుగుతుంది. ఆ బిడ్డ పేరు సుకన్య. చదువు, సంస్కారం, ప్రాయం వున్న కన్యామణి సుకన్య. ఒకనాడు రాజు సకుటుంబ పరివారముగ వనానికి వెళ్లుతాడు. అక్కడ సుకన్య ఒకచోట పుట్ట రంధ్రాలలో మిల మిల మెరుస్తూన్నవి మిణుగురు పురుగులనుకుని ముల్లుతో పొడుస్తుంది. అవిపుట్ట క్రమ్మి లోపల తపశ్చర్యలో ఉన్న చ్యవనమహర్షి నేత్రాలు. ముంటి పోటులో బాధ, క్రోధం పొంగి చ్యవనుడు రాజు పరివారానికి మల మూత్ర బంధన అయ్యేట్టు తిట్టాడు ఆ బాధ పోగొట్టుకొనేందుకు రాజు విషయం తెలిసి చ్యవనుణ్ణి ప్రార్థించగా నీ కూతురును నాకిచ్చి పెండ్లిచేస్తే యీ బాధ పోతుందంటాడు రాజు ఆలాగే చేశాడు. అందరూ హాయిగా ఉన్నారు.

ఒకనాడు సభలో ఇంద్రుడు అశ్వినీ దేవతలకు యజ్ఞ హవిర్భాగం పొందే అర్హత లేదన్నాడు. ఆ దేవవైద్యులు భూమికి వచ్చి చ్యవనుని మహిమ తెలిసి తమకు హవిర్భోక్తృత్వార్హత కలిగించవలసిందని కోరారు. నాకు దృష్టినీ, జవ్వనమునూ మీరు కలిగిస్తే మీ కోరిక నేను నెరవేరుస్తానన్నాడు చ్యవనుడు. వారు ఆలాగు చేయగా చ్యవనుడు సంతోషించి తన మామచే యజ్ఞం చేయించి, దానిలో ఇంద్రాదులకు భయపడక వేల్పు వెజ్జులకు హవిర్భాగం ఇప్పించాడు. సంగ్రహంగా చెప్పానీ కథ. దీనినే తీసుకుని కావ్యం వ్రాయడానికి ఏమిటి కారణం? దానికి బదులిదిగో. అవధరించండి

అన్నదమ్ములిద్దరూ తమ యేలిక మున్దపురిలో ఉన్న చిన్న వయస్సులో దర్శించడానికి వెళ్లారు. అప్పుడారేడు

'ఇపుడొక సుశ్లోకుండగు
నృపుని చరిత్రంబు నీతిరీతి చెలంగన్
నిపుణత నొనరింపుడు నత
కృపాళుడగు రఘు విభుండు కృతిపతికాగన్'

అని కోరగా అంగీకరించి ఆలాటి సుశ్లోకుడైన విభుడెవడా? అని తమ్మన్నగారు ఆలోచిస్తూండగా అన్నగారన్నారట!

'ఆలోచనయేలా? మన
కీలోచన గోచరముగ నెవ్వడు నొక భూ
మీ లోకపాలు మహిమ స
మాలోహిత మగుచునుండ మఱచితె? యనుజా!

అని. కాని యీ తమ్మునకు వెంటనే స్ఫురణకు రాలేదు. ఎవరా రాజు?..ఆ...తట్టింది బుద్ధికి.

'శర్యాతించ, సుకన్యాం చ
చ్యవనం చేంద్ర మశ్వినౌ
భోజనాంతే స్మరన్నక్ష్ణోః
అంగుష్ఠాగ్రాంబు నిక్షిపేత్'

అనే దివ్య పదార్థభరితమైన పద్యం. దీనిని శిష్టులు నిత్యమూ భోజనం కాగానే ఆచమించి స్మరిస్తారు, అన్న మాటలకిదీ అర్థం. శర్యాతీ రాజర్షి చరిత్ర. చెప్పవోయి తమ్ముడా! అని. చెప్పక చెప్పినట్లయింది. ఆ విధంగా యీ 'నయనోల్లాసమ్' సరసమాన సోల్లాసమయిన కావ్యముగా రూపొందింది

భోజనం కాగానే శర్యాతిని, సుకన్యను, చ్యవనుని, ఇంద్రుని, అశ్వినీ దేవతలను స్మరించి కుడిచేతి బొటన వ్రేలి కొనతో రెండు కన్నులలో రెండు నీటి చుక్కలు వేసుకోవాలి. (బొటన వ్రేలి నీటితో

కళ్ళు తుడుచుకోవాలి.) ఆలాగు చేస్తే చిరంకాలం దృష్టి దోషం రాకుండా కళ్ళు చకచకలాడుతూ దీప్తిమంతములై ఉంటాయని శిష్టజనవ్యవహారం

తిమ్మనశాస్త్రి గారికి కంటిజబ్బు వచ్చిందట! అది పోవడం చాలా కష్టపాటు అయిందట! ఏలినవారి ధర్మమా అని గట్టి వైద్యునిచే చికిత్స చేయించగ కృతార్థులయారట! దాని రూపాంతరమే నయనోల్లాసక వ్యావతరణం ... ఇక కథా భాగము లోనికి పోవుదమా ?

శర్యాతిని వర్ణించిన ఏడు పద్యాలున్నూ ఆనాటి పీఠికాపుర ప్రభువును అక్షర సంపుటిలో ప్రత్యక్షీకరిస్తాయి కవి సమర్థుడైతే కావ్యం ఆతని అనుభవానికి శుద్ధ దర్పణం అవుతుంది కదా!

శర్యాతిసతి 'గుణవతి' భారతములో ప్రబంధ పరమేశ్వరుడు చెప్పిన సుశీల కౌశికునకు బుద్ధి చెప్పిన ఇల్లాలికి సాక్షాత్తూ చెల్లెలు లాగ కనిపిస్తుంది.

'ఒడయని పాదముల్గడిగి యొత్తి
తలంగని షడ్రసాన్నముల్
తడయక తానెకూర్చి మృదులంబుగ
సెజ్జ సమర్చి చయ్యనన్
మడుపులఁజుట్టి యిచ్చు బెనుమక్కువ
పట్టపుదేవి యయ్యు న
ప్పడతి; సతీగుణుల్మగనిపట్ల
వహింతురై సౌకుమార్యమున్' ..

చాలాకాలంవరకు శర్యాతి దంపతులకు సంతతి కలగలేదు. సంతతిలేనియిల్లూ, జన్మానిరర్థకం, నిస్సారం—అని గుణవతి పతికి చెప్పిన ఆరుపద్యాలున్నూ మరి మరి పఠింపదగ్గవి. అసాధారణ ధారా విలసితమైన కవితాధర్మం ఇక్కడ రూపుకట్టింది. ఉదాహరణకు ఒక్కపద్యం —

'పుడమి సంసార భూరుహంబునకు పండు
ప్రకట గార్హస్థ్య ధర్మమునకు ఫలంబు
కుల కలశతోయరాశికి కుముదబాంధ
వోదయంబుకదా అపత్యోదయంబు'—
దీనియందలి రూపకం రసప్రాపకం ...

ఓడలు బండ్లు, బండ్లు ఓడలూ అవుతాయి ఒకప్పుడు — దీనిని శాస్త్రిలుగారు బహు అందంగా కుదిర్చారీ క్రిందిపద్యములో—

'చేడియమూను కృశత్వము
తోడం గూడికొనె కౌను తోరంపువీలన్
పోడిమిగనెనపు డొకచో
ఓడలు బండ్లగును బండ్లు నోడలగుగదా ...

గుణవతి గర్భవతికాగా ఆమెలో కలిగిన మార్పును వర్ణించే పద్యములలో ఇదొక హృద్యమైన పద్యం...

ఎక్కడ చెప్పినా సరే చక్కని చిక్కని పదభావ సమ్మేళన కనిపిస్తుంది. అదిన్నీ సహజ ధోరణికి సన్నిహితంగా ఉంటుంది. దీనికితోడు శబ్దాలంకార సౌరభం నిసర్గ రమణీయమై నయనోల్లా సమునకు హృదయోల్లాస సిద్ధి కలిగించింది.

'ఒడలికి బడలిక మీఱెన్
కడు నెక్కుడు బరువుగా గగనపడె జిలుగు
న్మడుఁగున్వలువయు'—ఇది ఎంత సహజమో
'అడుగా మడయయ్యెను సతికి నెలలు మసలిన
కొలదిన్'—అనడం హృదయంగమమైన వర్ణన...

ఏ 'పట్టు' చూసినా తేనెపిండని రసపట్టుగా హృదయమున్న చదు వరిని పట్టుకుంటుంది.

రాజులు, స్త్రీలు బాగా చదువుకోవాలని శాస్త్రులుగారు ఈ కృతిలో గట్టిగా బోధించారు. సుకన్యకు శాస్త్రం చెప్పించాలని మంత్రి చెప్పిన మాటలు గమనించదగ్గవి. ఇదీ నాగరక ప్రబంధ మంటే...ఒక పద్యం ఉదహరిస్తాను చూడండి—

'ఎయ్యది ఓర్వమిం గెడపు నెయ్యది
పాపును పాపవర్తనం
బెయ్యది తామసంబణచు
నెయ్యది రూపఱజేయు సాహసం
బెయ్యది సత్వభావమిడు
నెయ్యది కూర్చును మౌనవ్రత వ్రతం
బయ్యన వద్య విద్య వలదా
యిలదారతివల్ పఠింపగన్'

సంస్కృతం ఎంత అప్రయత్నంగా అనుకోకుండా పద్య ములో ప్రవేశిస్తుందో తెలుగు కూడా అంత సునువుగా మలుపులు తిరుగుతూ కపురపుధూళి చిమ్ముతూన్నట్టు శాస్త్రులుగారి కవితలో గుబాళిస్తూంటుంది. ఎంత అదృష్టమో మరి...

నాకు తోచినమాట వ్రాస్తున్నాను. పురుష పాత్రసృష్టి పుష్టిగా ఉంటుంది గాని శాస్త్రులుగారి యీ కృతిలో స్త్రీ పాత్ర సృష్టి ఎనలేని పుష్టిని సంతరించుకుంది. రాజు భార్య గుణవతి ఎంత విజ్ఞానవతిగా, నిండుగా కనిపిస్తుందో కూతురు సుకన్య అంత సుజ్ఞానవతిగా, కులసతీ మూర్ధన్యగా గోచరిస్తుంది.

సుకన్యను వేల్పువెజ్జులు 'యీ ముసలి గ్రుడ్డి మగనితో నీ కెందుకీ శ్రమ' అన్నట్టు మాటాడుతారు. అప్పుడామె అంటుంది కదా!—

'సత్యము నృపులకు, పాతి
వ్రత్యము యువతులకు, భాగవత జనతా సాం
గత్యము ముముక్షు జనులకు
నిత్యము ముఖ్యావలంబనీయంబుగదా!...'

ఇలాగే ఆణిముత్యాల్లాంటి పద్యాలింకా అయిదారున్నాయి, ప్రతి పద్యమూ రసగుళిక. యతిప్రాసలకు వెతుక్కోడం అనే దౌర్భాగ్యం ఏ పద్యములోనూ కన్పట్టదు. అలాగే 'అడవిని గాసిన వెన్నెల'— లాంటి జాతీయాలు అవసరమైన హాయిగా కుదురుకున్నాయి మేమిక్కణ్ణించి మరి కదలవన్నట్టు ఇంతకూ 'నయనోల్లాసం' గురించి ఏమీ చెప్పలేదు. 'యతిరాజ విజయము' గురించి కూడా యీ వ్యాసములోనే చెప్పవలసి వచ్చింది కనుక ఇంతకు ఇంతే ఇక 'యతిరాజ విజయం'— ఇది చరమదశలో చెప్పిన గ్రంథమట! కనుకనే నాల్గవ ఆశ్వాసములో పదారవ పద్యముతో శాస్త్రిగారి రచన ఆగిపోగా నాటి పీఠికాపుర సంస్థానాస్థాన కవులు వేంకటరామకృష్ణ కవి సోదరులు మిగతాభాగం పూర్తిచేశారట.

శేషాంశతో అవతరించిన పుణ్యపురుషుడు శ్రీమద్రామానుజులు. ఆయన విశిష్టాద్వైత ప్రచారకుడుగా, సత్ప్రథనొంది 'యతిరాజు'గ ప్రసిద్ధుడయాడు. ఆతని మహిమలను చెప్పిన ఒప్పిదమైన సుకృతి ఇది...శాంత ప్రధానమైన యీ చిన్ని కృతిలో తామసం కూడా గూడు కట్టుకుంది.

రామానుజుల గురువు అయాయాళువు కనుకనే తామస ప్రకృతిగా చెడిపోయి, చివరకు శిష్యుని అనుగ్రహంవల్లనే సాత్వికుడయి తరించాడు. రామానుజుడు అంటే లక్ష్మణుడు ... లక్ష్మణసూరి అనేది అక్కడక్కడ వచ్చినా 'రామానుజుడు' అనేదే ఆయనకి సుప్రసిద్ధమైన నామధేయం. శ్రీ వైష్ణవ పారమ్యమును విస్తృతముగా ప్రచారము చెయ్యాలని విష్ణువు యోజించి, శేషుణ్ణి భూమికి పంపగా దక్షిణ భారతదేశములో శ్రీ పెరుంబుదూరు అనే చిన్న పట్టణములో కేశవసూరి దంపతులకు శేషుడు జన్మిస్తాడు. అతడే 'రామానుజుడు'—

జాతి మత భేదం పాటించక పరమపద ప్రాప్తికి అందరూ అర్హులే అని శ్రీ వైష్ణవమును తేలిక చేసిన విశిష్టాద్వైత పరమ గురువు 'భగవద్రామానుజులు' వేశ్యలూ, వైశ్యులూ, త్రాగుబోతులూ, పుట్టులోభులూ, పంచములూ, వంచకులూ...వీరూ వారూ కాదు ఎవరెవరో ఆ పావన చరిత్రుణ్ణి ఆశ్రయించి, అనుగ్రహపాత్రులై, పవిత్రులై తరించారు. కనుకనే ఆయన 'యతిరాజు' అయాడు. ఆయన సంఘములో సాధించిన ఐహికాముష్మిక విజయములను వివరించేదే యీ 'యతిరాజ విజయము.'

బాల్యయౌవన సంధిలో ఉన్న లక్ష్మణుడు కంచిలో రేని కూతుర్ని ఆవేశించిన బ్రహ్మరక్షస్సును వదలగొట్టిన విషయం గురువుకే అసూయ కలిగించింది కాని ఇక్కడ గురువుకి శిష్యునిపై కోపం రావడానికి వేరే కారణం ఉంది. గురువు అద్వైతి. ఒక శ్రుతి వాక్కును సంప్రదాయ విరుద్ధముగా తన పాండిత్య విశేషముచేత అద్వైతపరముగా అర్థం చెప్పడం శిష్యుడుగా ఉన్న రామానుజుడు గ్రహించి, అది సత్యవిరుద్ధమని అన్నాడు. దానితో గురువుకీ శిష్యుడికీ అభిప్రాయభేదం ఏర్పడింది. అది శిష్యుణ్ణి గురువు చంపడానికి ప్రయత్నించినదాకా వెళ్ళింది. కాని వరదరాజస్వామి అనుగ్రహంవల్ల గురువు దుష్ప్రయత్నం వితథమయింది. చివరకు ఆ గురువు శిష్యుని దగ్గిర సాష్టాంగపడి సన్న్యాసాశ్రమం స్వీకరించి తరించాడు. ఆలాటి మహిమలు ఈ 'యతిరాజ విజయము'లో అడుగడుగునా కనిపిస్తాయి.

చిన్నపుడు విద్యాగురువై లక్ష్మణుని దివ్యప్రజ్ఞా ప్రాభవాలకు అసూయపడిన గురువు కాలాంతరాన శిష్యుణ్ణి దరించి —

'ఓ మహాప్రాజ్ఞ! గురువర్య! ఓ మహాత్మ!
శరణముగ నీదు చరణముల్ గరము మదిని
నమ్మి వచ్చితి నిక భవార్ణవమునుండి
పృథుల కృపమీర నన్నుద్ధరింపుమయ్య'—

అని ప్రార్థించాడు. కనుక శ్రీ మద్రామానుజులు గురువునుమించిన శిష్యుడవడమేకాదు గురూణాంగురువయి, 'యతిరాజు' అయి శ్రితజీవలోకోద్ధారకుడయాడని గ్రహిస్తాము.

పురాకృత సుకృతము సమగ్ర ఫలముగా, నిరర్గళ సరస కవితగా తమ్మన్న శాస్త్రులవారిని అనుగ్రహించిందని యిందలి ప్రతి పద్యమూ సాక్ష్యమిస్తుంది.

ఈలాటి పవిత్ర కావ్యాలకు 'కావ్యాలా పాంశ్చవర్జయేత్' అనే దుశ్శాసన పారం వర్తించదని ఘంటాపథముగ చెప్పవచ్చు. కాని ఏమి ప్రయోజనం! యీ జాతిరత్నాలు మన తెలుగు వాఙ్మయ రంగములో ఉన్నాయని గ్రహించి, ఆదరించే నాథుడు లేడు...ఎవ్వరేమంద్రుగాక నే నిట్టులందు...



# మరో ప్రపంచానికి దారియిటు...

తర తరాల దాస్యాంధకారంలో తల్లడిల్లిన దేశంలో తాత్కాలికంగా పేదరికం పీడించవచ్చు. మనుషులు పేదలైనా మనసులు పేదవి కావు; అవి నిత్య సంపన్నలు.

బాపూజీ పదే పదే చెప్పినట్లు మన ప్రగతిచెట్టు వేళ్లు పల్లెసీమల్లో పాదుకొని వున్నాయి.

గ్రామీణులు, నిరుపేద గ్రామీణులు, సన్నకారు, బలహీనవర్గాలకు చెందిన రైతులు, అంతో యింతో కాళ్లూపి వ్యవసాయం చేస్తూన్న రైతులు - వీరే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అన్నపూర్ణ చేతి పూర్ణకుంభం నింపుతున్న నిరతాన్నదాతలు.

ఈ కష్టజీవుల జీవనసరళిని మెరుగు పరిచేందుకు రాష్ట్ర ప్రభుత్వం కంకణం కట్టుకుని వుంది.

ఈ బృహత్తర లక్ష్యంలో భాగంగా $2\frac{1}{2}$ ఎకరాల మాగాణీగాని, 5 ఎకరాల మెట్టభూమిగానీ వున్న సన్నకారు రైతులకు భూమిశిస్తు మినహాయించింది; పొలాలకు నీటి ఖర్చులు మాత్రం వుంటాయి - అంతే.

ఇటీవల భూమి స్వాధీనమైన అసంఖ్యాక బలహీన వర్గాల వారికి, లక్షలాది మంది తదితర సన్నకారు రైతులకు భుజం తట్టి ప్రభుత్వం యిచ్చిన ప్రోత్సాహం యిది.

ఆంధ్రప్రదేశ్ రైతాంగం అంతా కొత్త ఆశలతో హలం పట్టారు.

మరో ప్రపంచానికి దారి యిటు ... ... !

*ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధశాఖ, హైదరాబాదు.*

17/78-79



శ్రీ యం. కొమరయ్య

# కందూరి మల్లికార్జున చోడుని ఒల్లాల, పాములపాడు శాసనాలు

నల్లగొండజిల్లాలో సూర్యాపేట తాలుకాలోని ఒల్లాల అనే గ్రామములో నొకటి, మిర్యాలగూడ తాలుకాలోని పాములపాడు గ్రామములో నొకటి ఇతని శాసనములు రెండు కనిపించినవి. ఈ రెండు చోట్ల ఈ శాసనములు గ్రామముల వెలుపలనే కలవు. ఒల్లాల శాసనము కొంత సంస్కృతములోను, కొంత తెలుగులోను రెండుభాగిములుగ కలదు. పాములపాడు శాసనము క్లుప్తముగా తెలుగులో మాత్రమే కలదు. ఈ శాసనములను వేయించిన రాజు కందూరి చోడ వంశమునకు చెందిన మల్లికార్జునుడు. ఇతడు ఆ వంశములో రాజ్యముచేసినది లేనిది స్పష్టముగా తెలియదు. ఈ రెండు శాసనములు ఒకే సంవత్సరమున వ్రాయించబడెను. చాళుక్య విక్రమవర్షములు 22 కు సరియగు ఈశ్వరసంవత్సరము ఈ శాసనముల కాలము. కందూరి చోళవంశచరిత్రకు ఈ శాసనములు ముఖ్యమైనవగుటచే వీటిని ఇచట ప్రచురించుచుంటిని

ప్రాచీన కాలమునుండి అనేక చోళవంశపురాజులు తెలుగు దేశమునందనేక ప్రాంతములను పాలించుచున్నట్లు తెలియుచున్నది అట్టివారిలో కడపమండలమునేలిన రేనాటిచోళులు, నెల్లూరి వైపున పొత్తపిచోళులు, ఈరెండు మండలములకు ఉత్తరముగనున్న ఏఱువ మండలమును ఏఱువ చోళులు మొదట పాలించుచు వచ్చిరి. ఈ యేరువచోళులలో కొందరు 11వ శతాబ్దము మధ్య కాలమున తెలంగాణము చేరి, స్థిరపడినట్లు ఒల్లాల శాసనంవల్ల తెలియుచున్నది.

## ఒల్లాల శాసనము :-

ఇది ఎపిగ్రఫియా ఆంధ్రిక నాలుగవభాగములో డా. పి వి. పి. శాస్త్రి గారిచే ప్రచురించబడెను. ఇందు మూడు భాగములు కలవు. మొదటిది సంస్కృతము. ఇందు చోళవంశముయొక్కపుట్టుకను గురించి వివరించబడెను సూర్యవంశమున కరికాలుడను రాజు పరిపాలించుచుండెను. అతడు శత్రురాజులనోడించి వారిచేత ఊడిగము చేయించెడివాడు. కావేరినదికి కట్టలు కట్టించి నీటిని కాలువల ద్వారా పొలములకు ప్రవహింపచేసెను. ఇతనిచే నోడింపబడిన శత్రురాజులలో త్రిలోచన పల్లవుడు ఒకడుగా వర్ణింపబడును. అతని రాజధాని ఒరయూరుపురము, అట్టి చోళవంశమునుండి ఒక శాఖవారు ఏఱువ మండలమునకువచ్చి అచ్చట రాజులుగా స్థిరపడిరి. వీరిలో కొందరు కృష్ణానదినిదాటి, పానుగల్లు నగరములో స్థిరపడిరి. ఈనగరము నల్లగొండకు సమీపమునగలదు. అట్టివారిలో మొట్టమొదటివాడు భీమచోళుడు. అతనికొడుకు తొండయరాజు. అతనికొడుకు రెండవభీమచోళుడు. ఇతడు చాళుక్యరాజైన విక్రమాదిత్యునికి సహాయముచేసి, అతనినుండి కందూరు మండలమును సామంతరాజ్యముగా పొందెను. అతనిభార్య గంగాదేవి. ఆ దంపతులకు నలుగురుపుత్రులు కలరు. మొదటివాడు రెండవతొండయ, రెండవవాడు ఇరుగయ. మూడవవానిపేరు శాసనమందు స్పష్టముగాలేదు. నాలుగవవానిపేరు మల్లచోడుడు. ఇతడే యీ శాసనములను స్థాపించిన మల్లికార్జునచోడుడు ఇది ఒల్లాలలోని సంస్కృతశాసన భాగమందలి కందూరుచోడుల వంశచరిత్ర. (ఎ.పి. సం.IVపుట60)

## దానికి సంబంధించిన శాసన పంక్తులు

[తేషాంచకే] చిద్ద విడాధి వాసం భుంజంత్యతో [న్యే] భువమేఱు వాఖ్యా [ంఏఱువ]

క్షితి పేష్వేషు పానుగల్లు పురాధిపః భీమ భూభృదుదేతి [......]

వ్వర్జనోదయః॥ తేనాపితొణ్డ భూపాలః ఖణ్డి తద్రోహి [......]

పాదిరిపుస్త్రీణాం సన్తాపాశ్రూద్గమైస్సమం॥ తస్మాదరాతివ [ని .....]

ంద్రదచణ్డధామా మహీపతి రభూదిహ చోడ భీమః। యస్య [......]

వాలము ఖావలీ డైబ్బార్ [థం] క్రీతరి పు నృపైర్బ్రహు సంకటాద్య [......]

లేషు సంతోష్య విక్రమం చక్రవర్తిర్నం పరాక్రమేణ కన్ధారం [......]

శాసనం॥ దుర్గ్గర్తానాం [ కులో ] త్తారిణ్యాత్తరంగ్గిత మధ్య మా। ఆ [......]

దేవీ యస్య గంగ్గేవ శూలినః॥ తస్యారిచణ్డస్త్వణ్డో భూదిరుగస్స [.. ...]

కోలో కోత్త్రస్సూనుమ్మర్గాల్ల శ్శల్యంవ విద్విషాం॥ తేషాం చతుణ్ణార్ం [క..... ]

యానాప్త వాన్భువం। చోడ మల్లస్తు వాల్లభ్యం జగతో మనసా [......]

రివాన్త జ్య ౯ ల తస్యతేజో వహ్నిరుద్రశూ కృత శ్రతు భీరుః।



ఒ ల్లా ల శా స న ము

పాములపాడు శాసనమందు ఇతడు చాళుక్య విక్రమ వర్షము 22 కు సరియగు ఈశ్వర సంవత్సరమున ఆమని కంటి పొలములో ఏడు పుట్ల అడ్లు విత్తుటకు తగినంత భూమిని ఒక ఉప్పరి కొడుకు మల్లయకు సన్నుతిగా (బహుమానముగా) ఇచ్చినట్లు చెప్పబడెను. ఆ భూమిపై పన్ను పరిహారముగా చెప్పబడెను. విషయము స్వల్పమైనను ఇందు కొన్ని సందేహములు కలవు. ముఖ్యమైనది దానము పొందిన మల్లయ ఎట్టి గొప్పపని చేసి, ఆ రాజును మెప్పించెనో చెప్పబడలేదు. రెండవది సంవత్సరము ఈశ్వర అనియే చెప్పబడెను. నెల, తిథి చెప్పబడలేదు. ఇంతకు మించి ఈ శాసన విషయము వలన తెలియు విశేషాంశము లేదు. ఆ మనకల్లు డెబ్బది గ్రామములకు ఒక కేంద్ర నగరము, హైదరాబాదు నుండి కల్వకుర్తికి పోవు రోడ్డు వెంబడి యొక ఆమనకల్లు కలదు. కాని ఆ నగరము ప్రస్తుత శాసనమున్న మిర్యాలగూడ తాలూకాలోని పాములపాడు గ్రామానికి చాలా దూరముగ నుండును. వేరొక ఆమనకల్లు మిర్యాలగూడ సమీపములో నుండి యుండును. ఆమన కంటి పురవరాధీశ్వర అను బిరుదును ముసునూరి కాపయ నాయకుడు వహించినట్లు అతని పిల్లల మర్రి శాసనములో కలదు. (తెలంగాణా శాసన కార్పస్ II, పుట 113) క్రీ. శ. 1122 నాటి గోకర్ణ చోడుని పానుగల్లు శాసన మందు కూడ ఆమనికల్లు – 70 పేర్కొనబడెను (కార్పసు II. పుట 96)

## ఒల్లాల శాసనములోని తెలుగు భాగము :

దీనిలో పై చెప్పిన వంశ చరిత్ర సంస్కృత భాగము నందు కలదు. తెలుగు భాగమున కందూరి చోళ మహారాజు అదే ఈశ్వర సంవత్సరమున జ్యేష్ఠ శుద్ధ పంచమి ఆదివారము నాడు ఆమని కంటి 70 స్థల మందు అగ్రహారమగు ఒల్లాల గ్రామమున అతని మంత్రియగు అప్పన ప్రెగ్గడ ప్రతిష్ఠించిన కేశవ దేవునికి పూజ, నైవేద్యముల కొరకు ఆమని కంటి కంపనములో ఎండపల్లి పొలమున ముప్పది పుట్లు పట్టురోడి భూమి దేవ భోగముగా దానమిచ్చిరి అట్లే ఒల్లాల పడుమట నున్న చెఱువు వెనక నాలుగు మరు తురుల నీరు నేలను దక్షిణమున క్రొత్త చెఱ్వు క్రింద, ఆరు మరుతురుల నీరు నేలను దేవాలయమువద్ద, రెండు మరుతురుల తోట భూమిని దేవునికి దానము చేసినట్లు చెప్పబడెను.

ఈ రెండు శాసనములలో చెప్పబడిన చాళుక్య విక్రమకాలము 22 వ, సంవత్సరము, సరిగా క్రీ. శ. 1098 కి సరిపడుచున్నది కందూరి చోళుల శాసనములు మరి కొన్ని ఇంతకు ముందువి కూడ కలవు అందు 1083 లో కందూరి తొండయచోడుడు వేయించిన రెండు శాసనములు కొలనుపాకలో కలవు. అందొకటి చాళుక్య చక్రవర్తియగు త్రైలోక్యమల్ల బిరుదును వహించిన మొదటి సోమేశ్వరుని నాటిది. ఇదియే ఈ చోళ రాజులకు సంబంధించిన మొదటి శాసనము. అప్పుడు వీరికి కోడూరు పురవరేశ్వర అనెడి

బిరుదు మాత్రమే కలదు. అనగా కోడూరు పురములో వీరు సామంతులుగా వున్నట్లు తెలియుచున్నది. అచట ఏరువ తొండయ అని మాత్రమే చెప్పబడెను. ఆరవ విక్రమాదిత్యుని కాలములో (క్రీస్తు 1076–1126) ఇతనికొడుకగు రెండవభీమచోడుడు కందూరు మండలమును సామంత రాజ్యముగా పొందినట్లు ఒల్లాలశాసనమును బట్టి తెలియుచున్నది. కనుక వీరు మొదట రాజప్రతినిధులుగా కొల్లిపాకవంటి రాష్ట్ర పాలకులుగా నియమింపబడుతూ వచ్చిరి. తరువాత కందూరు మండలమును స్థిరముగా పొందిరి. కందూరు గ్రామము జెడ్చర్ల, నాగర్ కర్నూలు నడుమ ఇప్పటికిని కలదు. ఈ రాజ్యము 11 వందల గ్రామములతో కూడియున్నది. దీని విస్తీర్ణము జడ్చర్ల, అచ్చంపేట, కల్వకుర్తి, నల్లగొండ తాలూకాలలో వ్యాపించియున్నట్లు శాసనముల వలన తెలియుచున్నది. ఇది కళ్యాణి చాళుక్యుల సామ్రాజ్యములో ఒక ప్రధానమగు రాష్ట్రము. కొంత కాలము ఈ రాష్ట్రము ఆరవ విక్రమాదిత్యుని రెండవ కొడుకైన తైలప రాజునకు యువరాజ వృత్తిగా నుండెను. ఈ మండలమునకు మహబూబునగరము వద్దనున్న కోడూరు ముఖ్య నగరము. తూర్పు భాగమునకు పానుగల్లు రాజధాని. దీనికి ఏరువ సింహాసము అనెడి పేరు కలదు. అనగా ఏరువ చోళులు పాలించుటచే దీనికి ఆ పేరు వచ్చియుండును.

మల్లికార్జున చోడుడు స్వతంత్రముగా సామంత రాజ్యము చేసినట్లు శాసనాధారము మరొకటి లేదు. ఇతడు రాజ్యము చేయునప్పుడే ఈతని అన్నయగు తొండయ రాజ్యము చేయుచుండెను. ఈ శాసనము తరువాత ఈ చోడ రాజులలో మూడవ భీమ చోడుని శాసనము క్రీ. శ. 1104 నాటిది. రామలింగాల గూడెంలో కలదు. (అప్రకటితము) ఆ భీమచోడుడు చిన్నవాడగుటచే రాజ్యభారము ఈ మల్లికార్జున చోడుడే కొంత కాలము నిర్వహించియుండునని తోచును. ఈ రెండు శాసనములు అప్పటివికావచ్చును. 1104 నుండి మరల అతని అన్న కొమారులగు 1. ఉదయాదిత్యుడు 2. భీమచోడుడు 3. గోకర్ణ చోడుడు, వరుసగా రాజ్యమేలిరి. వారిలో ఉదయచోడుడు పెద్దవాడు. కాని ఆతడు ఎక్కువ కాలము రాజ్యము చేయక చనిపోవుటచే రెండవ వాడగు భీమచోడుడు చిన్నతనమందే రాజ్యమునకు వారసుడయ్యెను. అందువలన అతని పక్షమున మల్లికార్జున చోడుడు రాజ్యభారము నిర్వహించి యుండును. ఇతనిని గూర్చిన సమాచారము ఈ రెండు శాసనములలో తప్ప వేరొక చోటున కానరాదు.

వారి వంశ వృక్షము ఈ క్రింది విధముగా చూపవచ్చును:




ఉదయాదిత్యుని మరణానంతరము అతని తల్లియగు మైలమదేవి పానుగల్లులో నొక గొప్ప దాన శాసనమును క్రీ. శ. 1124లో వేయించినది కలదు. (కార్పసు II – పుట 105–109) దానిని బట్టి యుదయాదిత్యునికి భీముడు, గోకర్ణుడు తమ్ములని తెలియుచున్నది. వీరిలో భీమచోడుడు, గోకర్ణుడిని చంపినట్లు కాకతి రుద్రదేవుని అనుమకొండలోని వేయిస్తంభాల గుడి శాసనమునందు చెప్పబడెను. ఆ భీమునిపై కాకతి రుద్రుడు దాడిచేసి యోడించినట్లు కూడ అందు వర్ణించబడెను. ఈ సంఘటన సుమారు క్రీ. శ. 1158లో జరిగియుండునని డా. పి. వి. పి. శాస్త్రిగారు అనుమకొండ శాసనమును పునర్విమర్శ చేయుచు వ్రాసిరి. (ఆంధ్ర హిస్టారికల్ రిసర్చిజర్నలు XXXVI–1, పుట 17).

ఈ మల్లికార్జునచోడుని శాసనములనుబట్టి మనకు తెలియు ముఖ్యవిశేషములు.

(1) కందూరునాడును పాలించిన తెలుగు చోళులు ఏడవ చోళుల శాఖకు చెందినవారు.

(2) చాళుక్య చక్రవర్తియగు ఆరవ విక్రమాదిత్యుని రాజ్యారంభ కాలములో క్రీస్తు 1076 ప్రాంతమున ఈ వంశములోని రెండవ భీముడు రాజును మెప్పించి, కందూరు మండలమును శాశ్వత సామంత రాజ్యముగా పొందెను.

(3) మల్లికార్జునచోడుని గూర్చి తెలుపు శాసనము లివియే కాని మరి యితరములు ఇంతవరకు దొరకలేదు, ఇతడైనను ఎట్టి అధికారముతో రాజ్యము చేసెనో సరిగా తెలియదు.

(4) ఒల్లాల శాసనమునుబట్టి కందూరి చోళవంశ చరిత్ర ప్రారంభమునుండి తెలియుచున్నది

ఈ శాసనము చదువుటలో నాకు తోడ్పడిన గౌ. పూ॥ డా. పి. వి. పి. శాస్త్రిగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

ఈ శాసనము ప్రకటించుటకు అనుమతి నొసగిన గౌ. శ్రీ వి. వి. కృష్ణశాస్త్రి (డిప్యూటి డైరెక్టర్, పురావస్తు శాఖ) గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.



పాములపాడు శాసనము మొదటి వైపు

# పాములపాడు శాసనము

## మొదటి వైపు

1 స్వస్తి సమధిగత పంచమహా
2 శబ్ద మహామణ్డలేశ్వర వీర
3 మహేశ్వర కోడూర్పురవరే
4 శ్వర సూర్య్య వంశోద్భవ కు—
5 ల తిలక కాశ్యపగోత్ర కరి—
6 కాలాన్వయ నానాది సమ—
7 స్త ప్రశస్తి సహితంబున
8 శ్రీ మన్మహా మండలే—
9 శ్వర కందూరి మల్లికార్జు
10 న చోడ మహారాజుల్
11 చాళుక్య విక్రమ కాలము
12 -౩౫ గు ఈశ్వర సంవత్స
13 ర శ్రావణ ౧౦ ది మొద
14 ల బాడ [మా] నసకం—
15 [టి]* పొలమున సేదువు
16 బ్బాడ్ల పెట్టుభూమి
17 యు పరి [కొ]డుకు



పాములపాడు శాసనము రెండవ వైపు

## రెండవ వైపు

18 మల్లయ [కి]చ్చిన సంస్న[తి]
19 పత్రమెట్ల[న్న] పుత్రాను ప-
20 విత్రక మాచ [న్డా] * కర్ స్థాయి
21 ంగా నేడు పుట్ల పను[౨] స-
22 వ్వ[ర్] కా(క)ర పరిహారముంగా[–]
23 గుడ్చిసాక (సుఖ) ముందు వా-
24 రీ మయ్యార్దదప్పక ప్ర-
25 తి పాలించువారు [1]* ంయా
26 ధమ్మర్వు దప్పిన వారు గంగ
27 కఱు తంగ విలలం జం
28 ప్పిన వారు.

## ఒల్లాల శిలా శాసనము (తెలుగు భాగము)

1. స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభమహారాజాధిరాజప

2. రమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకుల తిలక చాలూక్యాభరణ

3. శ్రీమత్త్రి భువనమల్లదేనర విజయరాజ్యముత్తరోత్తరాభివృద్ధి ప్రవర్ద్ధన్—

4. మానమ్మె చనుచుణ్డ ॥ తత్పాద పద్మోపజీవి సమధిగత పంచమహాశ—

5. [బ్ద] మహామణ్డలేశ్వర కోడూ పూర్వ రవరేశ్వర మూర్య్యర్ వంశోద్భవకు లతిల—

6. క కాశ్యపగోత్ర కరికాలాన్వయ నామాది సమస్త ప్రశస్తి సహితం

7. శ్రీమన్మహామణ్డలేశ్వర కన్నూరి మల్లికార్జన చోడ మహారాజులు

8. శ్రీ మచ్చాలుక్య విక్రమకాల ౨౭ గు ఈశ్వరసంవత్సర జేష్ఠశుద్ధ [X] ఆదిత్యవారము

9. నాండు ఆమనిగంటి డెబ్బయింటెబడి నమస్యాగ్రహారమ్మైన ఒల్లాల గోల [ప] తి

10. అప్పనపెగ్గడ్ల ప్రతిష్ఠసేసిన కేశవదేవరకు హావిబ్బర్లియవ్వర్ నలకునా

11. కంపనములోని యెణ్డపల్లి పొలమున నాయూరి యాగ్నేయమున నల్లవే—

12. నియతూప్వర్న నొల్లాల పొలిమెర యమంగా సని వార సిద్ధికాలము.

13. స్పదివుట్లు పట్టు రేవడుంజేను దేవ భోగముగా ధారపూర్వ్ కమిచ్చి రాకొలన ఒ —

14. ల్లాల పడుమటి పెద్ద చెఱువు సిఱంద నాల్వు మఱ్తురు నాయూరి

15. దక్షణము క్రొత్త చెఱువు పిఱంద నాఱుమఱ్తురు నీరు నేలయునా

16. దేవాలయము ప డ మ ట రెణ్డు మర్తురు నేల దొంటయు నిచ్చిరి [II] * సామాన్యో —

17. యన్దమ్మ ర్ సేతున్ ర్ పాణాం కాలే కాలే పాలనీ మోభవద్భిః। సర్వా ర్ నేతాన్భావినః పా —

18. ర్థి వేంద్రాన్భూయో భూయో యాచతే చోడ మల్లః॥బహుభిర్వ్వ సుధాదత్తా బ —

19. హుభిశ్చాను పాలితా/ యస్యయస్య యదాభూమిస్తస్య తస్య తథాఫలం (II★) స్వదత్తాం.

20. పరిదత్తాం వామోహరేత వసున్ధరాం (I★) షష్టిం వర్ష సహస్రాణి విష్టాయాం జాయతే క్రమిః, (II)★



డాక్టర్ ఎస్. గంగప్ప

# జానపద సాహిత్యం-సారంగధర చరిత్ర

"In this story [Sarangadhara Chritra] the animal passions of an ald man were put before the audience, and the worst part is that a step-mother, was brought into the play with all her animal instinct and made muchof by the actors to please the audience"1 అని కోలాచలం శ్రీనివాసరావుగారు 1908 లో ప్రకటించిన తమ 'ప్రపంచనాటకచరిత్ర'లో సారంగధరచరిత్రలోని అనౌచిత్యాన్ని నాటకీకరించడంవల్ల కలిగే అనర్థాన్ని వక్కాణించారు. ఇంతటి విమర్శకు గురిఅయినా తెలుగు సాహిత్యంలో సారంగధర చరిత్రకు అధిక ప్రజాదరణ ఉండడం గమనించవచ్చు శిష్టసాహిత్యంలోనే గాక జానపద సాహిత్యంలోనూ సారంగధర చరిత్ర చోటుచేసుకోవడం మరీ విశేషం. మొట్టమొదట సారంగధర చరిత్రకు తెలుగు సాహిత్యంలో స్థానం కల్పించిన గౌరవం గౌరనకు దక్కింది. 'నవనాథ చరిత్ర'లో ఉందీ కథ. దీన్ని ఆధారం చేసుకొని కావ్యగౌరవం సంతరించినవాడు చేమకూర వేంకటకవి. ఇంతకంటే నాటకంగా సారంగధర చరిత్రకున్న ప్రచారం అధికం. ఆధునికయుగంలో ప్రప్రథమంగా నాటకీకరించి, తద్వారా అత్యంత ప్రచారం తెచ్చినవారు ధర్మవరం రామకృష్ణమాచార్యులు. పైపెచ్చు అంతవరకు తెలుగులో లేని విషాద రూపక రచన దీంతో ఆరంభం కావడం మరీ విశేషం. 'విషాద సారంగధర' అనేక పర్యాయాలు ప్రయోగించబడి ప్రజాదరణ పొందింది. ఇలాగే ఇరవైమందిదాకా సారంగధర నాటకాన్ని రచించారు తెలుగులో. కొందరు సంగీత విశేషణం చేర్చారు ముందు. పానుగంటివారు మోదాంతం చేశారు. సమకాలిక సాంఘిక జీవితం ఆలంబనగా చలంగారు 'చిత్రాంగి'ని చిత్రించారు. "ధర్మవరంవారి నాటకం ప్రక్రియాత్మక గద్య పద్య గేయాత్మక విషాద రూపకం. కాళ్ళకూరి వారిది సుఖాంత సంభాషణ ప్రబంధం. శ్రీపాద (సుబ్రహ్మణ్యశాస్త్రి) వారిది వచన చారిత్రక నాటకం. చలంగారిది విషాద వచన ప్రేమకలాపం."2 ఇది శ్రీనివాస చక్రవర్తిగారి నిర్ణయం. ఇతివృత్తాన్ని మిక్కిలి గర్హించిన కోలాచలంవారు మనదేశంలోనేగాక ప్రపంచ సాహిత్యంలోనే ఇలాంటి కథలు అనేకం ఉన్నాయంటూ తెలిపారు.

"In Grecian legends there is the story of Hlppolytus. His father Theseus after the death of Antiope (the mother of Hippolytus) married Phaedra who fell in love with her step-son When Hippolytus resisted her advances, she accused him of having attempted her virtue. Theseus in a rage had him killed This subject forms a tragic play of Euripides...The story of Phaedra is found in Greek, Latin, French and English ; One Edmund Smith wrote this tragedy in English, It was played in 1708. Dr. Johnson praised it highly—In English you see a similar and still verse tragedy. It is Don Carlos of Otway"3 "Even Aristotle admires 'Oedipus the King (a tragedy written by Sophocles) as the only pure sample of a tragedy It is a wonder that such a repugnant story is also dramatised by some other nations of Europe. Seneca of Ancient Rome, Corneille of civilised France, Dryden and Lee of reformed England took this detistable theme of Oedipeus for their tragedies. He is said to be a brother and father to his sons, a son and a husband to his mother Jocasta, and a rival and murderer of his father Laius"4.

సారంగధరలాంటిదే తిష్య రక్షిత కథ. కాంచనమాల అన్న పేరుతో వేలూరి చంద్రశేఖరంగారు తెలుగులో రచించిన నాటకాన్ని ఆంగ్లీకరించారు 'అమరేంద్ర'గారు. బుచ్చిబాబుగారు 'తిష్యరక్షిత' నాటిక రచించారు. శ్రీ కరుటూరి సత్యనారాయణగారు 'తిష్య రక్షిత'ను మహా ప్రబంధంగా రచించారు. ఇలాగ సారంగధర లాంటి కథలెన్నో ఉన్నాయి ప్రచారంలో.

ఏమైనా సారంగధర చరిత్రకు తెలుగు సాహిత్యంలో అధిక ప్రచారమే ఉంది. ఈ కథ చారిత్రకంకాదు. రాజమహేంద్రవరంలో ఈనాడూ సారంగధర మెట్టఅనీ, చిత్రాంగిమేడ అనీ స్థానికులు చూపెడతారు. రాజరాజుకు సారంగధరుడన్న పుత్రుడుగాని, చిత్రాంగి అనే భార్యగాని ఉన్నట్లు చారిత్రకాధారాలు లేవు. నిర్దోషి అయిన సారంగధరుడు శిక్షించబడే కరుణ రసాత్మకమైన ఈ కథ ప్రౌఢ కవులనేగాక, జానపదులను సైతం ఆకర్షించింది. అందుకే అజ్ఞాత జానపదకవి సారంగధర చరిత్రని గేయంగా రచించి, అందించిపోయాడు. అది జానపదుల నోళ్ళలో నలుగుతూనే ఉంది ఈనాడు కూడా. కలుపు తీతల సమయంలో ఈ పాట పాడతారు. నా సేకరణలోని కథలో రాజు పేరు లేదు. జానపదులకు సహజరీతిని ఈ గేయం ఆరంభమవుతుంది.

"పర్వ తలగిరిమీద పసిడి మేడల్లమీద నెలకొన్న జోగి రూపో
ఒళ్లల్లి 5 వీబాది వారాజు గోరలది వన్నెలాడలది 6 కిన్నెరీ

పచ్చ నీ కడియాలు పగిడి మెట్టులు కిన్నరీ
[7] పొయ్యిల్ల వీబూది కిన్నరీ నాదులు చోలించు ఆలించు ఆ దేవతా
ఓరిపుదు నీ వంటి కొడుకు నాకిస్తేను ఒంగి మొక్కేను దేవికీ
[8] సోదుకుడు నీ వంటి సొంతు నాకిస్తేను సాల మ్రొక్కేను దేవికీ
గోటంత వీబూది అపుడె మంతారించి [9] పణితి[10] నష్టా పెట్టెనో
పణితిగర్భిణాయాపది నెలలుమోసుటాయా[11] రతనంగి ఉదకమాయా
కొడుకు పుట్టానని కోటి సంతోసముతో రాజుకే[12] రేకు రాశా
రేకు చూశారాజు కొలువు దుప్పనదుమికి[13] కొండలూ పొడవాయనో
ఆడున్న[14] స్త్రీలు భత్రీలుకు చెప్పి పరువున్న[15] పొంొచ్చెనో
నడిమి సావిడికివచ్చి[16] నవ్వింద్రు డుండంగ చక్కెరలు పంచ సాగా
బల్లునాతెల్లవారి బ్రాహ్మణుని పిలువనంపి బ్రాహ్మణుని బలములడిగా
సూర బలములు కద్దు చంద్ర బలములు కద్దు నీ రాజ్యమేల కద్దూ
ఆ బాలు పుట్టిన పండెండు ఏండ్లకీ పాపములు బొందు రాజా!
ఎంచంగ పెంచంగ ఎత్తి ముద్దాడంగ ఏడేండ్లు[17] సారంగుడే
ఆడుతున్నపావురము[18] అంత్రమార్గముపోయి[19] చితరంగిమేడనువాలా
ఈడోరు[20] ఎదికిరీ జోడోరు ఎదికిరీ తానెదిక సారంగుడూ.
బుద్ధిగల తాలార్లు[21] చూపతీ దీవాన్లు తొక్కి సోధించి రపుడూ
[22] గోళ్లదాటి పొయ్యే గోరెంకి పిల్లలని గోరలతో తెగవేసెనో
చితరంగి[23] ఇంటి బిడ్డ నీళ్లవేణి తోడు నీళ్లకే ఎల్లొచ్చెనో
ఎక్కటీ వారయ్య ఏ రాజు[24] బొంట్లయ్య ఏది మీ [25]గివానమూ
మువ్వెవ్వరీ దానవే సూసి ఉలికి పొడితిపీ సోధించి సొమ్ము చెప్పు
నీ కంట నసుదెచ్చి నిదులు చక్కనిదైతే మీతండ్రి నను పెండ్లాడెనో
అమ్మ నా పావురము ఆడంగ వచ్చింది అందియ్యవే నే బొయ్యేనో
తల్లి నా పావురము తగులంగ వచ్చింది తెచ్చియ్యవే నే బొయ్యేనో
మాటిమాటికి నన్ను అమ అమ్మ అంటావు బాబు సామ్మేర నీకూ
మాటిమాటికి నన్ను తల్లి తల్లంటావు [29]సబ్బ తల్లేర నీకూ
అమ్మన్ని నోటికీ కమ్మన్ని కజ్జాయ కలదోయి నా నగరిలోనా
ముత్యాల పీటేసి ముందరా కూర్చోని కొడుకు ముచ్చట లడిగెనో
పెంచినాడు మీ తండ్రి పెదగొప్ప చేసినాడు పెండ్లి ఏలచేయలేదూ
నీకంట నసుదెచ్చి నిదులు చక్కనిదైతే మీ తండ్రినను పెండ్లాడెనో
పాపములు పాపములు పాస కరిపిన తల్లి పాపములు ఏల పలికేనో
పాపములు మా యింట పొరిలిపోవును గాని రావోయి సారంగుడూ
పైట సెరుగులు వొదిలా [27]బంగమ్మ బైటాయ బాలుడు తల్లాటించెనో
దట్టిబట్టి [28]సుంగళ్ళు పర్రన్న కోసుకోనా పొంొచ్చ సారంగుడూ
[29] బిడుగొడ్డు సింహము దాతు న్నిదరము కొని వెంటనే పొంొచ్చెనో
అందు నలుగడి ఎక్క ఆకొమ్మ సాటున ఆసాట తొంగి చూశా
ఒదిగి వొస్తివి పోరా ఒదిగి ఎల్లొస్తివి [30]పగలు మండ్లము సేతునో
గాజులు మాలారానికిపోయి గాజులన్నీ పగులగొట్టి పొయ్యెల్ల గీసుకోని రాజుకీ రేకు రాశా
[31] పట్టి మంచమిడిసి నులక మంచంమీద పండిండ [32]చతురంగీ
రేకు చూశా రాజు కొలువు దుప్పన దుమికి దాఘుకి కొండల్లు పొడవాయా
ఆడున్న స్త్రీలు భత్రీలకు చెప్పి పరువున్న పొంొచ్చెనో
పండున్ని చితరంగి దగ్గరకు పొయ్యి ఏపాటాని పట్టి పట్టి చూసెనో
ముట్టొద్దు ఓరాజ! అంటొద్దు ఓ రాజ! ఇంగ [33]కోళ్లనయితీనో
సారంగుడు వచ్చి [34]సర్వభంగము చేసి తల్లన్న విడకపాయా
పెద్దలూ చిన్నలూ కూసోని జోడీలు జోడించెనో.
తల్లికీ సేతులు సాపిన్ని తనయున్ని ఏమి చేయవలయునో
తల్లికీ సేతులు సాపిన్ని తనయున్ని చేతులూ నంకవలెనో
సారంగుని కనతల్లి సర్వసత్యా వాది దాయంగ ఎల్లొచ్చెనో
[35] సర్వతాసారంగుడూ [36]సాముద్రోయుడుగాదు [37]సతి మాటలెనకు రాజా!
మసిబూసి మామిడి పండ్లన్నమ్మ నొస్తివా మానములు బోయినంకా
కోటి నోములు నోమి కోటి [38]తపుసులు బట్టి కొడుక నిను గంటి గదరా!
చాల నోములు నోమి చాల తపుసులు బట్టి సారంగ నిను కంటినో
బోరు గజ్జెలుగట్టి [9]బోగాన నిను సాక బొంగాలు పాలైతివో!''—

ఈ గేయం జానపదులకు ఉచితరీతిని నడచింది. భావం, భావానికితగిన, జానపదులకు సహజమైన భాషఉన్నాయి. రత్నాంగి వ్రతాలు, నోములు నోచి సారంగధరుని కన్నది; పుత్రునిగన్న సంగతి లేఖ రాసి తెలిపింది రాజుకు. ఇందులో రాజు పేరు కనిపించడం లేదు. రాజు అంతఃపురానికివచ్చి, ఉదయాన జాతవేదుల్ని పిలిపించి పుట్టిన బాలుని గ్రహస్థితిని తెలుసుకొన్నాడు. ''బల్లునా తెల్లవారి బ్రాహ్మణుని పిలువనంపి, బ్రాహ్మణుని బలము లడిగా''—అనేపాదం వల్ల ఈ విషయం వ్యక్తమవుతుంది. ఈ ''బల్లున' అన్న పదమే చేమకూర సారంగధర చరిత్ర కావ్యంలోను (1–29) ఉంది. ''సూరబలములు కద్దు చంద్ర బలములుకద్దు నీ రాజ్యమేలకద్దు'' — అంటే రవి మహాదశ, చంద్ర మహాదశ ఉన్నాయని, రాజయోగ ముందనీ చెప్పి, పంద్రెండేండ్లకి మాత్రం పాపానికి ఒడిగట్టుతాడని జాతవేదులు వివరించారు. ''ఎంచంగ పెంచంగ ఎత్తి - ముద్దాడంగ'' — ఒక్కటి పద ప్రయోగం; పైగా సహజమైన తెలగు పలుకుబడి; భావ వ్యక్తీకరణకు ఉపకరించే విధాన, పల్లె ప్రజలకు తగినట్లు ప్రయుక్తం కావడం మెచ్చదగ్గ విషయం.

ఈ కథా గేయంలో చక్కటి సంభాషణ గూడా ఉంది. చిత్రాంగ సారంగధరుల మధ్య ఈ సంభాషణ నడచింది. పావురాన్ని వెతుకుతూ వెళ్ళిన సారంగధరునితో చిత్రాంగి చాలా చమత్కారంగా మాట్లాడుతుంది. నా పావురం నాకిమ్మనీ, నే వెడాతాననీ సారంగధరుడంటే ''మాట మాటకు అమ్మ అమ్మ అంటావా బాబు సామ్మేర నీకూ, మాటి మాటికి నన్ను తల్లి తల్లంటావు సబ్బతల్లేర నీకూ! ' అంటూ దబాయించినట్టే దబాయించి, ''అమ్మన్ని నోటికీ కమ్మన్ని కజ్జాయి కలదోయి నా నగరిలోనా'' — అంటూ అనునయిస్తూ ఆశచూపెడుతుంది. ''పెంచినాడు మీ తండ్రి పెద గొప్ప చేసినాడు పెండ్లి ఏలచేయలేదూ। నీకంట నసుదెచ్చి నిదులు చక్కనిదైతే మీ తండ్రి నను పెండ్లాడెనో'' — అని ప్రశ్నించి, రాజుపై నేరారోపణ చేస్తుంది; రాజు తప్పిదాన్ని వెలికి తీసి చెబుతుంది. అలాంటి పాపపు మాటలు ఆడవద్దంటాడు సారంగధరుడు. ''పాప

ములు మాయింట పారిరిపోవును గాని రావోయి సారంగుడు'' — అంటుంది చివరికి. ఈ మాట లన్నింట చిత్రాంగి వాక్చాతుర్యం గోచరిస్తుంది. ఇల్లాగే ఈవిడ చతురత సారంగధరుడు చేయని నేరాన్ని మోపడంలో, కల్పించి రాజుతో చెప్పడంలోను స్పష్టం. ''అమ్మన్ని నోటికీ కమ్మన్ని కజ్జాయి, ముత్యాల పీటేసి సుందరా కూర్చోని'' — చక్కటి పద ప్రయోగాలు. చిత్రాంగి సారంగధరుని బలాత్కరించబోయి భంగపడుతుంది. గాజులు పగుల గొట్టుకొని, శరీరమంతా గీచుకొని పట్టుమంచం వదలి నులక మంచంమీద పడుందట. అంటే కోప గృహంలో అలకపాన్పు చేరింది. మనకు సాహిత్యంలో కోప గృహంలో చేరినట్లు కనిపించేవారిద్దరు; కైక, సత్యభామ. వారికితోడు ఈ చిత్రాంగి. చిత్రాంగి కోపగృహం చేరడానికి గల కారణం తెలుసుకోడానికి ప్రయత్నించాడు రాజు. ''ముట్టొద్దు, ఓ రాజా! అంటొద్దు ఓ రాజా! ఇంగ కోళ్ల నయి తినో, సారంగుడూ వచ్చి సర్వభంగముచేసి, తల్లన్న విడకపాయా''— అని నేరారోపణ చేస్తుంది రాజు విచారణ జరిపించాడు. ''తల్లికీ సేతులు సాపిన్ని తనయున్ని ఏమి సేయవలయునో'' — అనే ప్రశ్నకి సమాధానం ''తల్లికీ సేతులు సాపిన్ని తనయున్ని చేతులు నరక వలెనో'' అన్నది శిక్షాస్మృతి. రాజాజ్ఞకు ఎదురేది? సారంగధరుని తల్లి ఈ సందర్భంలో మళ్లీ కనిపిస్తుంది. రత్నాంగి గుణాలు తెలుపుతూ ''సారంగుని కనతల్లి సర్వ సత్యావాది'' అంటాడు ఈ గేయకర్త. ఆ కన్నతల్లి ''సర్వతా సారంగుడూ సాముద్రోముడు గాదు సతి మాట వినకు రాజా!'' అని ప్రార్థిస్తుంది. ''మసిబూసి మామిడి పండ్లమ్మ నొస్తివా మానములు బోయినంకా'' — అని తిరస్కరిస్తాడు రాజు మరి మానం ప్రాణం కంటే అధికం గదా? ''మసిబూసి మారేడు పండ్లమ్మడ''మన్నది సామెత. కాని ఈ గేయంలో ''మసిబూసి మామిడి పండ్లమ్మ నొస్తివా'' అన్న ప్రయోగం విశేషం. శిక్షకు గురి అయిన ప్రియ పుత్రుని గూర్చి రత్నాంగి విలపించిన మాటలు కరుణ రసాత్మకమై, సహృదయ హృదయుల్నేగాక కరకు గుండెల్నిసైతం ద్రవీభవింపజేస్తాయి —

''కోటినోములు నోమి కోటి తపుసులుబట్టి కొడుక నినుగంటిగదరా
చాల నోములు నోమి చాల తపుసులుబట్టి సారంగ నిను గంటినో
బోరు గజ్జెలుగట్టి బోగాన నిను సాక బోయిాలు పాలైతివో''

—ఈ మాటల్లో కన్నతల్లి కడుపుకోత మన కన్నులకు కట్టినట్లు కనిపిస్తుంది పైగా నిష్కారణ నింద; దానికిశిక్ష! ఇది దుర్భర విషయం. దోషులు, నిందితులు ఎందరైనా తప్పుకోవచ్చు గాక! సన్మార్గవర్తనుడు సరైన కారణం లేక చంపబడడం సాంఘి కాభివృద్ధికి సముచితంకాదు; అది గొడ్డలిపెట్టు! అది ఈ గేయం లోని సారాంశం. ఈ గేయంలో చక్కటి ట్రాజెడీ లక్షణాలున్నాయి. సామాన్యంగా సారంగధర చరిత్ర అంటే మహిమాన్వితుడైన సిద్ధు నిచే సారంగధరుని కాళ్లు చేతులు మళ్లీ మొలిచినట్లు సుఖాంతం కావడమే. ఈ గేయం మాత్రం సారంగధరుడు శిక్షితుడు కావ డంతో ముగుస్తుంది అందుకే అది 'విషాద' సారంగధర. కాళ్లు చేతులు మొలవడం అసహజం తద్విరహితంగా శిక్షించబడడం సహజం. ట్రాజెడీకి నిదర్శనం. కానీ భారతీయ ధర్మానికి విరుద్ధం. నిర్దోషి ఇక్కడ శిక్షించబడడం అంటే అంటే అధర్మానికి జయం. అందుకే మన భారతీయ సాహిత్యంలో ట్రాజెడీలులేవు. వాస్తవానికి దుఃఖాంతమైన వాటిని ఏ మునులవల్లో, దేవతలవల్లో సుఖాంతం చేయడం మన సాహిత్యంలో కనిపించే సత్యం.. ఆధునిక యుగంలో తెలుగులో మాత్రమే కరుణ రసాత్మకమైన, దుఃఖాంతమైన నాటకాలు వెలిశాయి. జానపదుల సాహిత్యంలోను కరుణరస పరి పూర్ణతమైన ఈ గేయం దుఃఖాంతమే అయింది.

ఇలాగా మోహం, వలపు, కక్ష, శిక్ష, కన్నతల్లి కడుపుకోత మొదలైన భావాలతో నిబిడమై, కరుణరస పరిపూర్ణతమై తెలుగు పలుకుబళ్లతో ఒప్పారుతూంది గేయం. ఇలాంటి జానపద సాహి త్యాన్ని విస్తారంగా సేకరించి, మన సాహిత్య చరిత్రని పునర్నించు కోవలసిన బాధ్యత సాహిత్యవ్రతులమీదుంది! అందుకై యత్నిస్తారని ఆశిస్తాను!!

## అధోజ్ఞాపికలు

1. The Dramatic History of the World p 226,
2. ఆంధ్ర నాటక సమీక్ష-పు. 56,
3. The Dramatic History of the World P. 226,
4. పైదే-పు. 12; 5. విభూతి; 6. కిన్నెర, 7. శరీరమంతా, 8. శోధకుడు, 9 పడతి, 10. నొసట, 11. రతనంగి— రత్నాంగి; ఉరుకుమాయ—నీళ్లాడింది—ప్రసవించింది, 12 లేఖ, 13. అర్థం తెలియదు; 14 సేవకులు కావచ్చు; 15. పరుగున వచ్చాడు; 16. అర్థం మృగ్యం, 17 సారంగధరుడు; 18. ఆకాశమార్గం, 19. చిత్రాంగి, 20. వెదకిరి, 21. తెలి వైనవారు కావచ్చు, 22. గోడలు, 23. పనిమనిషి నీలవేణి, 24 బంటులయ్యి-సేవకులయ్యి, 25. దివాణం, 26 సొంత, 27. బట్టబయలైంది; 28. కుచ్చిళ్లు, 29 బీడుగొడ్డు— చూలు కానిది; 30 తగినశాస్తి చేస్తానని; 31. పట్టు, 32 చిత్రాంగి; 33 కోడలినైతినో; 34. మానభంగంచేసి, 35. అన్ని విధాలా, 36 సామర్ధ్యుడు — పనికిమాలినవాడు, 37. సవతి, 38. తపస్సులు చేయడం; 39 మిక్కిలివైభవంగా.

# కలగూరగంప

## బాపురెడ్డి పద్య కవితలు

నా ప్రత్యేకత నిత్యనూతనత, వీణా వేణు సంగీతరాగ ప్రత్యూషము నా నివాసము. నిసర్గస్వాదు సౌందర్య పక్షేపము నా విలాసము. జగత్స్వప్న ప్రబుద్ధాంతరిక్ష ప్రస్తానము నా మహాశయము. నక్షత్రాలు నా కావ్యములు. ఆదిత్యాంశువులే గణమ్ములు సమస్తామ్నాయములే శాస్త్రములు. పాదములే గ్రహములు. ఉపగ్రహములే ప్రాసలు, యతులు. మానవద్యోదౌత్యాశయ దివ్య దిగ్విజయ సందోహములే భావములు. నాదబ్రహ్మయే శైలి అని నొక్కి వక్కాణింపగల ఆధునిక కవి శ్రీ బాపురెడ్డి.

ఈ పద్యకవితలు గడచిన దశాబ్దములో అప్పుడప్పుడు వ్రాసినవి. ఇందులో కవియొక్క వైజ్ఞానిక దృష్టి, ప్రకృతి పరిశీలనము, ఆంధ్రరాష్ట్రోదయ వాంఛ ప్రముఖముగా తెలియుచుండును. వీనిని గూర్చి ముచ్చటించుట ఈ వ్యాసోద్దేశము.

మానవుడు చంద్రమండలముపై అడుగుపెట్టి, మూఢ నమ్మకములను వమ్ముచేసి వాస్తవిక సత్యములను నెరుంగుటకు పరిశోధనకై తన శక్తిని వినియోగించి నూతన విషయములను అందించుచున్నాడు. శాస్త్రవేత్త తన నిర్జీవాంకము వీడి జాబిలి దగ్గరకు వెళ్ళి జిలిబిలి పలుకులతో వార్తలు భూమాతకు పంపించుచున్నాడు. జగదంబకు నేడెనలేని కన్నుల పండువయ్యెను. ఆధునిక శాస్త్రవేత్త భూమాతకు చంద్రమాతకు సంబంధము కల్పించినాడు. ఈతని శక్తి గణుతింపరానిది. నేర్చిన పదార్థ విజ్ఞాన శాస్త్రము అపారము. దానికి చిహ్నముగ నిది సాధించెను.

భూమి జయించె మానవుడు భూరిపయోధులన్ జయించెగా
వ్యోమము కూడ నేడ స్వసద్భుశోద్గమముందు జయించి మించె ఇం
కేమిటి—భావి జీవన గతిందర లక్షిత లక్ష్యమేమిటో
ఏమిటి ఏమిటంచు నినదించెనవే చకితాంతరాళముల్

(పద్య. 5 పుట. 70)

ఈ జగములో మానవుడు సాధింపలేని దేదియులేదు. స్వార్థ లోభములు లేనంతవరకు మానవు డజేయుడే. అవి ఉన్ననాడు మానవజాతికి ప్రగతి ఉండదని కవి ఊహ. దేశదేశముల యుద్ధములు కట్టిపెట్టి వసుధైక కుటుంబమును నిర్మించినపుడీతడు ధరణికి, స్వర్గమునకు వారధి నిర్మించిన వాడగును. అప్పుడే సర్వలోకములకు శాంతి ప్రాప్తించును.

కవికి ప్రకృతి పరిశీలనము మెండు 'వసంతోదయము', 'ఆశల ఉగాది'వంటి గీతికలు కవియొక్క ప్రకృతి పరిశీలనమునకు మచ్చుతునకలు. వసంతమున వృక్షములు ఫలపుష్ప సంభరితమై నవనవలాడుచుండును అది వసంతముయొక్క దివ్యత్వము. శిశిరము దీనికంటె భిన్నము. దుశ్శాసనుండు ద్రౌపది వలువ లూడ్చినట్లు శిశిరము గర్జించుచు వచ్చి పశువు చేలము లూడ్చినది. ద్రౌపదికి బృందావన విహారి వలువలందించినట్లు వసంతము పచ్చపచ్చని క్రొవ్వలిఫమ్ములు మరల నందించి వనకుమారిగా నొనర్చి వసంత గానము పాడించినది. కరుడుగట్టిన హిమశిలలు వాసంతకోష్ణ నిశ్వాసములందు ఝరిగా పారినవి. విప్లవోషస్వి క్రాంతి వీక్షణముల ప్రభావముచే దాస్యాంధకారము కరిగిపారుచున్నది. కనుకనే కవి —

నేడు వాసంతమున పొంగినాడు పాడి
నాడు శుభగీతి ముందుండినాడు నేడు

'ఆశల ఉగాది' గీతికలో కవి ప్రకృతిని కన్నులముందు చూపించినారు. 'ఉగాది'లో ప్రకృతి నయనానందకరముగా కాన్పించును. వసంతమువలె ఉగాది కూడ సంవత్సరమున కొకసారి వచ్చి జనావళిని ముద్దుముద్దుగా పలుకరించి ముచ్చట లాడుచుండును. వృక్షములు క్రొత్త చిగురుటాకులతో పంతములాడుచు నిగనిగలాడును. మన్మథుడు రతీదేవి పరిష్వంగంలో మురిసిపోవును. కోకిలల రాగాలాపనలు ప్రకృతికాంతకు సుప్రభాత గీతములుగ మేలుకొలుపులు పాడును. ఆ దివ్యసుందర గానములో ప్రకృతి అమృత నిష్యందయై వరవశించును. ప్రకృతిశోభను కవి దివ్యమంగళముగా వర్ణించెను. ఎటు చూచినను రాగమంగళార్భటి చెలంగ పటుతరోత్సవ ప్రభలు ప్రసరించును. ఊరూర వనలక్ష్మి భాసించి చిరునగవులు చిందించుచుండును. ప్రతిగృహమ్మొక పల్లవిత మహీరుహమట్లు పచ్చతోరణములతో పరిఢవిల్లుచుండును. బాలబాలికలు సుమములవలె ప్రభాతవేళ సంచరించుచుండును. ఉగాదిశోభ ప్రతి వ్యక్తికి మలయమారుత వీచులట్లు ఉజ్జ్వల భావితా విశ్వాసలు వెలార్చును కవిమాత్రము అరుణోదయ శుభవేళ ఆశలు నింపుకొని ఉగాది దొరసానికి స్వాగత గీతికల్లో అక్షర మాలికలతో సత్కరించును. అదే కవియొక్క ప్రకృతి ప్రీతిని తెల్పుచుండును.

ఆంధ్రదేశ మొకప్పుడు మదాసు రాష్ట్రములో కలసిపోయినది నాయకులు వినాయకులై ఆంధ్రులను గుర్తింపక శీతకన్ను వేసినారు. ఆంధ్రులలో స్వరాష్ట్ర సాధనకై వాంఛ ప్రబలినది. చివరకు ఆంధ్రరాష్ట్రమవతరించినది. రాష్ట్రావతరణము కవికి మహానందము కలిగించినది. కలలు యథార్థములై కవిముందు నిలబడి సొంపు ఘటించినవి. ఆంధ్రులు ముక్తకంఠంతో జేజేలు పలికి జే గంటలు మ్రోయించినారు. మహాంధ్రదేశ ప్రాగ్దిశా తీరమందు ప్రభాకరుడు కోటిహస్తములు సాచి మేటి తెలుగులను హృదయమున హత్తుకొనెను. కృష్ణవేణి, గోదావరి వాహినులు మహానంద విమల వీచులతో స్వాగత వాక్యములు పల్కినవి. ప్రజలు సంతసించిరి. కవి సమాజమునకు ప్రతినిధి గావున తన వాక్కునందు ప్రజల భావమును ప్రతిబింబింపజేసెను.

గత జీవితాల దుర్గతి సహించి
కఠిన తపమాచరించి నిక్కముగ నేడు
ఈ ప్రభాతాంశువులు సోకగా ప్రపుల్ల
మయ్యె తెల్గుల పద్మాళి శాంతి
సౌఖ్య సుమధురాశా భావ సరసిలోన

రాష్ట్ర మేర్పడిన తరువాత మూలనున్నవారు మూలనిరాట్టులై నాయకత్వమునకు ప్రాకులాడుట ప్రారంభింతురు. ఆ పదవి వ్యామోహములో విశాలభావము నశించి, సంకుచితత్వము ప్రబలిపోవును. ఈ అవలక్షణములు లేకుండ మనమందరము ఒకటై ఏలుదమని కవి ఉద్ఘాటించుటయే గాక రాష్ట్ర సమైక్యతను సూచించు చున్నారు.

సంకుచితత్వము, స్వార్థము
పంకిల రాజకీయములు, వ్యాపార కళల్
శంకత్వము, మౌఢ్యము నే
డింక విడచి శాంతిసుఖము లేలుదుమిటుపై.

ఆంధ్రమును విశాలాంధ్రము చేయవలయునని పెద్దల సంకల్పము. దాని కనుగుణముగా వారు ప్రయత్నించి ఆంధ్ర తెలంగాణ మును ఒకటిచేసి విశాలాంధ్రముగ నొనరించిరి. కవి యీ విశాలాంధ్రావతరణమును బహుధా మెచ్చుకొని కీర్తించినారు. ఆంధ్రాభిమానము వారిలో కడలి తరంగములా పెల్లుబికినది. కవి గళమున కంఠమాలగా అమరనదీ పద్యరత్నము తెలుగువారంతయు కలసియుండుటయే ప్రతి ఆంధ్రుని ఆశయము ఏకత్వమునకు కొందరు విముఖత్వమును ప్రదర్శించినప్పటికి విశాలాంధ్రము సిద్ధించినది. ఈ విషయమును కవి మనము సందిడుకొని

గున్నమామిడి తన ప్రియకోకిలమ్మ
వీడిపోయి ఆనాడు తపించి తిరిగి
నవ్యముగ నేడు కూడి గానమ్ము చేయు
నాంధ్ర తెలగాణా మేకమైనట్టి తమిని

అని తృప్తిని వ్యక్తీకరించినారు. ఇంతటి శుభాభ్యుదయమున వసంత వాకిట నడుగిడు కతమున దుర్ముఖమయ్యు సుముఖముగా కాన్పించి నది. ప్రజావిజయమే మహేంద్ర భాగ్యోదయము. అమృతోదయ ప్రబల యనలేని మహానుభూతిలో యెదలోని కల్మషమును నీటను దోసి, మనోజ్ఞ దివ్య శోభాయుతమైన ప్రేమ సుమ వాటిని నాటుమనియు, తత్కాళాత్మక శ్రీయుతమౌ సుగంధములు చిందగ సర్వ దిగంత వీధులందు వ్యాపింపచేయుమనియు బోధించుచున్నారు. ఈ ప్రబోధమున సందేశ మిమిడియున్నది. ఆ సందేశ మాంధ్రులకు నూతన మార్గములు చూపించును.

ఈ కవితలలో పైన పేర్కొన్న అంశములేగాక ఇతరములైనవి కూడ గలవు. అందులో పేర్కొనతగినది 'మృత్యువు'.

మృత్యువుపై వ్రాసిన గీతములు భావ వీణను మీటి అంతర జగమునకు గొనిపోవును. మృత్యువునకు తరతమములేవు. దరిద్రుడైనను, ధనవంతుడైనను దానికి తలవంచక తప్పదు. తరతరముల నుండి కనరాని వలలుపన్ని జీవులను పట్టుకొని భుజించును. చిన్న, పెద్ద, బీద, బిక్క అను తారతమ్యము లేకుండ అందరియందు దూర దృష్టిని పరపి లోకమునందు కలవరము పుట్టించును. పుట్టిన ప్రతి ప్రాణి మృత్యువు సమీపమునకే చేరుచున్నది. మృత్యువును గూర్చి కవి భావ గాంభీర్యముతో వివరించెను. మధురములగు పదముల కూర్పు గీతములందు స్పష్టమగుచున్నది. మృత్యువు పలు విధములుగ సంభవించును. అగ్ని ప్రమాదముగ, పాము కాటుగ, జారుపాటుగ, ఒకసారి ఆత్మహత్యా వాంఛయై, యుద్ధ రూపిణిగ, భూకంపముగ అవతరించి ప్రాణము తీయును. నరులు 'మృత్యుకాంత' పరిష్వంగమున హాయిగా కన్ను మూయుదురు. దేవతలు మృత్యుకాంతను జయించి నగుబాటు కలిగింపగల శక్తివంతులు. సృష్టిలో జరుగుచున్న చిత్రగతులకు మృత్యువు సమాధానము చెప్ప లేదు. ఇంతమంది ప్రాణములు బలిగా గ్రహించినను ఆశ తీరలేదు. మోహము నశింపలేదు. కాని మృత్యువుకు మరణములేదు. దానికి పాపము అంటనేరదు, అంతేగాక జీవితము శాశ్వతమై అమరసుఖము ననుభవించుచు ప్రాణికోటి మధ్య త్రుళ్ళింతలాడుచు జీవయాత్ర సాగించుచున్నది. ఈ విశాల విశ్వమునందు మృత్యువును ఎదుర్కొన్న వారెవ్వరు గలరు?

శ్రీ బాపురెడ్డి ఆధునికులైనను ప్రాచీన కవితా మధురిమను ఆస్వాదించినవారు. ఎన్నుకొన్న అంశములు పాత మధురములు. కేవలము ప్రేయసి హాసమే పరమార్థముగా భావింపక నిరుపేద వేదనలందు దృష్టిని పరపి కవితను లోకమున కందించిన వారు. ఈ కవితలు విహాయస వీధులనే వెలార్చుచు పోయెడి భావ తారకలు. యోగమార్గమున ప్రయోగమార్గమున దేశకాలములను లోని కన్నులతోడ కాంచునవి. ప్రబోధ భావగీళము సారించి నిదురలో గల యెదలను ఉత్తేజపరచు మేలుకొలుపులు. అయినను అభ్యుదయ భావములు గలవారు. కవికి కనుపించు ప్రతివస్తువు విచిత్రానుభూతి కలిగించును. ఆ యనుభూతి యందే కవి అంతరంగమును శోధించి, తాననుభవించి పాఠకులకు తెలియజేయుచుండును. అప్పుడు భావములు స్పష్టమై పాఠకులముందు సాక్షాత్కరించు చుండును

కవిలో పూచిన అనుభూతులను నాల్గు దండలుగా అల్లి కవితా జగత్తులోనికి రసజ్ఞులు సాగివచ్చు రాజమార్గములలో తీర్చి కట్టినారు. ఆ మాలికల సుంగధములు నల్దిక్కులకు వ్యాపించి మత్తెక్కించునవి. కలగాగాక కథగా మిగులునవి. రక్తిని అనురక్తిని జనింపజేయునవి.

కమ్మని శబ్దార్థములకు, రమ్యమైన భావ విలాసములకు, రసార్ద్రములైన వాక్కులకు హృద్యమగు పద్య రచన చేయగల కవి శ్రీ బాపురెడ్డి.

శ్రీ జి. రామమోహనరావు

## ఒక జిజ్ఞాస

ఈమధ్య మా మిత్రులొకరు ''వేంగి, వేళంగి, ముస్నంగి, మేరంగి, పోణంగి, కోరంగి, ఉప్పంగి, (కర్ణాటక) జిర్జంగి (ఒరిస్సా) అనే ఊళ్ళ పేర్లలోని ద్వితీయావయం, 'అంగి' అంటే అర్థమేమి''టని అడిగారు. ''అద్దంకి, వెల్లంకి,పాలంకి, తాడంకి'' మొదలైన వాటిల్లోని 'అంకి'కి, దీనికి ఏమయినా సంబంధముందా. మధ్య సున్నా లేకుండా 'యాడకి, నూతక్కి; మడికి, కోసిగి, ముత్తిగి' అనే పేర్లు కూడా కొన్ని గ్రామాలకు ఉన్నాయి కదా, సంస్కృతం లోని అంకణం, అంగణం శబ్దాలలో దేనికయినా ఇది తద్భవమా, లేదా చంపక — సంపంగి, పల్యంక — పల్లకి, మూలక—ముల్లంగి, కేతకి — గేదంగి, కుబ్జక — గొజ్జంగి మొదలయిన తద్భవాల్లో కనబడే 'ంగి', 'గి', 'క' అనేవి సంస్కృతంలో ఏథాది చివర కనబడే 'క'అనే దానికి వర్ణలోప వర్ణాగమ, వర్ణవ్యత్యాసాల వ్యుత్పత్తిశాస్త్రం వల్ల కలిగినా ంటూ శంకాతంక మనస్కులై చర్చించారు.

ఈ విషయమ్పై పెద్దలు తమకు తోచిన అభిప్రాయాన్ని క్లుప్తంగా 'భారతి' ముఖంగా వివరించాలని కోరుతున్నాను.

(పైన పేర్కొన్న 'జిర్జంగి' గ్రామనామం శాసనంలో 'జిజ్జిక గ్రామే' అని ఉంది )

— ఒక జిజ్ఞాసువు.

## పెద్దపల్లి

కలియుగ నాయకుడైన వెంకటేశ్వరుడు తెలంగాణంలో చాలా గ్రామాల్లో వెలశాడు వాటిలో ఇదొకటి. ఈ గ్రామం ప్రస్తుతం నాగర్ కర్నూలు తాలూకాలో ఉంది. ఇదొక బుగ్గ క్షేత్రం.

ఈ గ్రామం పూర్వం గ్రుద్దంటి సీమలోనిది. ఈ సీమలో అరవై నాలుగు పల్లెలుండేవి. వానిలో ఇది అన్నిటికంటె పెద్దగా ఉండటంవల్ల పెద్దపల్లె అని పిలిచారు. దీని స్థాపనోదంతం ఈ విధంగా ఉంది :

పూర్వం దేవేంద్రపురి, ఉపేంద్రపురి, నరేంద్రపురి అనే ముగ్గురు సన్యాసులు సంచారవశాన ఈ ప్రాంతానికి వచ్చి నేటి వెంకటేశ్వరాలయముండే బండపై ఓ రాత్రి నిద్రించారు. అప్పుడక్కడ నేలలోఉన్న స్వామి దేవేంద్రపురికి స్వప్నంలో సాక్షాత్కరించి, తనను వెలికిదీసి ప్రతిష్ఠించమని ఆజ్ఞాపించాడు. అది విని దేవేంద్రపురి మేలుకొని స్వప్నప్రకారాని కద్భుతపడి తెల్లవారిన పిమ్మట కొందరు కూలీలను తీసుకవచ్చి కలలో స్వామి కనిపించిన ప్రదేశం త్రవ్వించగా, నేలలో వెంకటేశ్వరుని ఓ శిలామూర్తి బయలుపడింది. అంతేగాక స్వామితోపాటక్కడో బుగ్గకూడా పైకి తేలింది. దాన్ని చూచి లోకులాదేవుని ''బుగ్గస్వామి' అని పిలిచారు.

ఉపేంద్రపురి స్వామివిగ్రహాన్ని బయటికి తీసి, రాత్రి తాము, నిద్రించిన బండపై నాటురాయితో ఓ ఆలయం కట్టించి అందులో ప్రతిష్ఠించాడు. అతడాస్వామి నెప్పుడు ప్రతిష్ఠించాడో తెలియదు కాని ఆలయంముందు బండపై

''వర్తమాన వ్యవహారిక రౌద్రినామ సంవత్సర ఆషాఢ శు॥ (౨ బుధవారం) నాడు (తెలకపలె) నరసంంభట్లుకు జిల్లెళ్ళ రెడ్డి దేశాయి వ్రాయించిన దానపత్రిక

బుగ్గ వెంకటాద్రికి తూర్పు దిక్కున కమ్మరి నాగోజు కుంటలో పొలముకట్ట (మొదలు) కొని కందకం లోనిది అంతా వెంకటపతి నిత్య నైవేద్యానకు యిస్తిమి. ఆ క్షేత్రం ఆచంద్ర తార్కం, పుత్రపౌరంపర్యం అనుభవించేది. ఇది దేవేంద్రపురి యిప్పించినది ''జిల్లెళ్ళ రెడ్డి వ్రాలు''

అని ఓ శాసనం చెక్కబడి ఉంది. దానిలో కుండలీకరణంలోని అక్షరాలు స్పష్టంగా లేవు. ఆలయం ఈ శాసనాని కనతి పూర్వం లోనే స్థాపింపబడి ఉండొచ్చు. దీని సమీపంలో వెలసిన శాసనాలీ ప్రాంతంలో లేవు గాబట్టి దీని కాల నిర్ణయం కష్టం బహుశః ఇది గోలకొండ నవాబులనాటిదై క్రీ శ 1561 ప్రాంతంలో చేయింపబడవచ్చు.

ఈ శాసనంలో పేర్కొన్న దేవేంద్రపురిని గురించి తప్ప తక్కినవారి వివరాలేవీ తెలియవు దేవేంద్రపురి శిష్యుడుపేంద్రపురి ఆలయం ముందు 'సదాసేవ'' అని మరో చిన్న శాసనం చెక్కించాడు.

''వర్తమాన తారణ సంవత్సర పుష్య శు॥ ౧౪ లు సోమవారం రా......... . దేవేంద్రపురి శిష్యుడు ఉపేంద్ర పురి విశ్వనాధునికి''

ఈ శాసనం మొదటి శాసనం తరువాత ఇరవైనాలుగేండ్లకు పుట్టింది. ఉపేంద్రపురి దేవేంద్రపురి శిష్యుడు ఇతడు తమ గురువు దేవేంద్రపురి దేవుని ప్రతిష్ఠింపగా తానక్కడ ఊరిని స్థాపించాడు.

ఈ శాసనంలో విశ్వనాధుడు పేర్కొనబడ్డాడు. ఇక్కడ వెంకటపతి ప్రతిష్ఠతోపాటు లింగ ప్రతిష్ఠగూడా ఉంది. అది యితడు చేశాడు. దీన్ని గురించి కూడా ఓ ఘటన ప్రచారంలో ఉంది.

ఇది పార్థివలింగం. వెంకటేశ్వరుడు లభించిన చోట బుగ్గ పడగా దాన్ని బావి త్రవ్వుతుంటె ఈ లింగం దొరికింది. మొదటి నాడు బావి త్రవ్వే వారికి నేలలో దొరకగా వారేదో గుండ్రాయి అనుకొని మట్టితో పాటు వడ్డున వేసి వెళ్ళారు. మరునాడు వచ్చి త్రవ్వుతుంటె కొంత సేపయిన తరువాత అదే లింగం వారికి మళ్ళీ దొరికింది అయినప్పటికీ వారు దానిపై శ్రద్ధ పెట్టక మళ్ళీ

వడ్డున వేసి వెళ్ళారు వారు మూడోనాడు వచ్చి త్రవ్వుతుండగా కొంతసేపటికా లింగం మళ్ళీ దొరికింది. అపుడు వారు దాని కాశ్చర్యపడి ఆ సంగతి ఉపేంద్రపురితో చెప్పారు. అంత ఆయన అది విని ఆ స్వామిని వెంకటేశ్వరుని క్షేత్రంగా కొంత దూరంలో స్థాపించాడు కాని గుడిగాని యేదిగాని కట్టించలేదు.

దేవేంద్రపురి దేవుని ప్రతిష్ఠించిన తరువాత ఉపేంద్రపురి నేడక్కడుండే ఊరిని స్థాపించాడు. అతడూరిని స్థాపించిన పిమ్మట వరేంద్రపురి ఆ ఊరి కోసం ఓ చెఱువు వేయించాడు. నేడా చెఱువుంది.

ఈ విధంగా ఆ సన్యాసులక్కడ స్వామిని, గ్రామాన్ని, తటాకాన్ని ప్రతిష్ఠించిన పిమ్మట ఇక అక్కడే ఉండిపోయారు. నేడు వారి సమాధులు గూడా గ్రామం వెలుపల ఒకే వరుసలో ఒకదాని కొకటి కూత వ్రేటు దూరంలో ఉన్నాయి.

ఉపేంద్రపురి అక్కడ మొదలు గ్రామం స్థాపించిన నాడు దానికేం పేరు పెట్టాడో గాని ప్రస్తుతం దానికి ''పెద్దపల్లె'' అని పేరు రావటానికి కారణం చెబుతారు.

## గుద్దంటి కథ :

ఇది గుద్దంటి సీమలోనిది. ఈ సీమకు కేంద్రం గుద్దంటి. సంస్కృతంలో ''గృధ్రాని'' అంటె గద్దవన్నె. ప్రస్తుతం ఈ గ్రామ సమీపంలోను, దీని సమీపంలోని బలుమూరు సమీపంలోను గుట్టలున్నాయి. ఆ గుట్టల్లో పూర్వం ఇనుప ఖనిజం రాయిదొరికేది. ఆ ఖానిని దీని సమీపంలోని నేటి మోదుగులపేటలో కరిగించేవారు. పూర్వం దాని ''కనంతవరమ''ని పేరు. ఆ కాలంలో అదొక పెద్ద లోహ క్షేత్రం (Iron plant). అక్కడందరు కమ్మరులే నివసించే వారు. పెద్ద పెద్ద కొలుములుండేవి. వారు ఖనిజమంతా కరిగించి, ఆనాటి సైన్యానికి కావలసిన పరికరాలు తయారు చేసేవారు.

మోదుగులపేటలో ఆనాటి బూడిద గుట్ట లిటీవలి వరకక్కడ ఉండేవి. వానినిపుడు రైతులు పొలాలకు ఎరువుగా త్వోలుకొన్నారు. ఇప్పటికీ ఆ భూమిలో ఇనుప చిట్టెం చాలా దొరుకుతుంది.

ఈ లోహ ఖనిజ సంపర్కం వల్ల ''గుద్దంటి'' ప్రాంతం నేలంతా కొంత నల్లంటుగా ఉంటుంది కాబట్టి వర్ణ సామ్యాన్ని బట్టి ఈ ప్రదేశాన్ని గుద్దంటి అన్నారేమో !

గుద్దంటికి ''గుద్దళ్ళ'' అని గూడా వ్యవహారముంది. ఇది పశ్చిమ చాళుక్యుల నాటికే పేరు చెంది ఉండేది. ఇక్కడి రామేశ్వరస్వామిని పండితా రాధ్యుని శిష్యుడు విభూతి గౌరయ్య దర్శించాడు. దేవరకొండ ప్రభువుల కాలంలో ఇది దేవరకొండ సర్కారులో ఓ పరగణాగా ఉండేది. రాయలు నల్లగొండను జయించిన పిమ్మట చివరి దనాల్లో సురభివారు దీన్నే తమ రాజధానిగా చేసికొన్నారు. ఆ కాలంలో ఇక్కడ బలిష్ఠమైన దుర్గముండేది. దానికి పన్నెండు బురుజులుండేవి.

సురభి వారిచ్చట వచ్చిన పిమ్మట కొంత కాలానికి క్రీ. శ. 1508 ప్రాంతంలో కుమార మాదా నాయడళియ రామరాజుతో జటప్రోలును బహుమతిగా పొందాడు. మాదానాయని అనంతరం అతని కుమారుడు పెద్ది నాయుడు తమ్ముడగు మల్లి నాయని గోదలులో ఉంచి జటప్రోలుకు తమ రాజధానిని మార్చి తానక్కడికి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిన, పిమ్మట అచిర కాలానికే రాచకొండ వారి సామంతులు స్వతంత్రు లయ్యారు. గోదలు పరిపాలనా వ్యవస్థ తారుమారై దాన్ని సురభివారు, బొజ్జావారు, గున్నవారనే మూడు కుటుంబాలవారు కలిసి పాలించసాగారు. వారిలో సురభి వారికి సగం, తక్కిన వారికి సగంగా ఉండేది. ఈ కుటుంబాల వారు తమకెప్పుడైనా డబ్బవసరమైనపుడు ధనవంతుల దగ్గరో, సామంతుల చెంతనో అప్పు తీసికొని వారికి తమ వంతు గ్రామలమ్ముతూ ఉండేవారు గూడ.

గోదలి ప్రాంతంలోని పరగణాలలోని కెల్లా పెద్దదై కేంద్ర స్థానంగా గూడా ఉండేది గాబట్టి గోలకొండ నవాబుల కాలంలో దానిపై మహమ్మదీయుల కన్నుపడి వారు దాన్ని వశపరచుకొన్నారు. ఆ విధంగా మహమ్మదీయులు దాన్ని వశపరచుకొనే వరకు సురభి వారక్కడ ఉండలేక పెద్ద పల్లెకు వెళ్ళిపోయారు. ఆ దొరలు వెళ్ళటంతో ఆనాడు వారి నాశ్రయించి బ్రతికే యోధులు, బంట్లు, బ్రాహ్మణులు ఇంకా ఇతరమైన అనేక వృత్తుల వారు తమ ప్రభువులతో పాటు పెద్ద పల్లెకు తరలివెళ్ళారు. దానితో అంత వరకు సామాన్యంగా ఉన్న పల్లెగోదలు పరగణాలోని పల్లెలన్నిటి కంటె పెద్దగా అయింది. దానివల్ల దాన్ని పెద్ద పల్లెఅని పిలిచారు.

పెద్దపల్లెలోని బుగ్గస్వామికి పూర్వం కపిలవాయి వంశానికి చెందిన విశ్వబ్రాహ్మణులు పూజారులుగా ఉండేవారు. వారు రామానుజ మతానికి చెందినవారు. కొంత కాలానికా వంశంలో బుగ్గయ్య అనే వ్యక్తి ఉదయించి, బుగ్గస్వామి ఆలయాభివృద్ధికి మిక్కిలి పాటుపడ్డాడు. స్వామివారి కుత్సవ మూర్తులు చేయించి, అంగరంగ భోగాలు జరిపిస్తూ, ఏటేటా ఉత్సవ మేర్పాటు చేసి రథోత్సవం నడిపించాడు గాని అతని పిమ్మట ఆ వంశీయులకెవరికీ మళ్ళీ ఆలయాన్ని గురించి పట్టలేదు.

బుగ్గయ్య వంశంలో మరికొంతకాలానికి పెద్దగట్టయ్య, చిన్నగట్టయ్య అనే సోదరుల దయించారు. వారిలో పెద్దగట్టయ్య వివాహానంతరం అచిరకాలానికే మరణింపగా చిన్నగట్టయ్య కుల వృత్తిని నమ్ముకొన్నవాడు కాబట్టి అర్చకత్వం పొట్టగడవక, శ్రీరంగాపురం వెళ్లిపోయాడు.

గట్టయ్య వెళ్ళిన తరువాత స్వామి నిత్యార్చనాదులకు విఘాతం కలిగింది. అందువల్ల అప్పటి దొరగారు గట్టయ్యగారికి

రెండు మూడు పర్యాయాలుత్తరాలు వ్రాసి, వచ్చి అర్చకత్వం స్వీకరించవలసిందని కోరాడు కాని దాని కాయన అంగీకరించలేదు. అంత అక్కడి దొరగారు స్వామి నిత్యార్చనా విఘాతం సహించలేక తత్కాలంగా గ్రామ పురోహితుని ఏర్పాటుచేశారు. కొంతకాలాని కతడు గతించాడు. అంత ఆయన తాము గోదలు విడిచినపుడు తమతోపాటు గోదలునుండి శ్రీపురానికి వెళ్ళిపోయిన వంగీపురం తిరువెంగళాచార్యులను పిలిపించి ఆలయార్చకత్వం ఆయనకు శాశ్వితంగా అప్పజెప్పాడు.

బుగ్గయ్య తరువాత ఆ ఆలయాభివృద్ధికి పాటుపడినవారిలో దొరగారొకరు. ఆయన పత్ని వెంకట జానకమ్మగారు స్వామికి వెండితో మైమరువు కిరీటాంగదాదులు చేయించింది. అవి చేసిన వాడు తెలకపల్లె కిష్టయ్యగారు ఆయన చెక్కడం పనిలో సాటి లేనివాడు. కపిలవాయి వంశీయుడు. ఆయన మైమరువు చేసే సందర్భంలో కొలతలకై విగ్రహాలను పరిశీలించాడు. వాని గద్దెలపై ఆ విగ్రహాలను చేసినవారి పేరు, చేయించినవారి పేరు, తేది చెక్కబడి ఉండేవి. కిష్టయ్యగారి కది చదివిన తరువాత తమ వంశీయొకడా విగ్రహాలను తెప్పించినందులకు, ఈనాడు తాను వానికి కిరీటాదులు చేయవలసి వచ్చినందుల కాశ్చర్యం వేసింది. తన వంశం వారితో వెలసిన స్వామి తనతో ఆభరణాలంకరణ సేవ చేయించుకొంటున్నందుకు సంతసించి, అది ఆ దైవేచ్ఛయే యని భావించి, స్వామికి చేసిన మైమరువుపై కిరీటాదులపై, తన పని నంతా గ్రుమ్మరించి తృప్తిగా నిట్టూర్చాడు. తన అనంతరం తన పని స్వామి సన్నిధిలో ఉంటుందని తన పనితనం చూడదలచినవా రచట చూడవచ్చునని చెప్పేవాడు కాని ఈనాడా విగ్రహాలుగాని, ఆయన కరీటాదులుగాని లేవు. వానిని క్రీ. శ. 1966 ప్రాంతంలో ఓనాటి రాత్రి దొంగలెత్తుకుపోయారు. అవి పోయిన పిమ్మట గ్రామస్థులిపుడు మళ్ళీ యర్చామూర్తులను కొత్తవానిని తెచ్చారు.

పెద్దపల్లె నిరాడంబరమైన ప్రదేశం. ఇక్కడ ఆలయం వెలసిన బండకు గ్రామం అర్ధక్రోసెడు దూరంలో ఉంటుంది. ఈ బండ నల్లని తెల్లని చారలతో అందంగా కూడా ఉంటుంది. దాని చుట్టు పరిసరం ఆహ్లాదమయంగా ఉంటుంది.

ఇక్కడ ముఖ్యంగా చెప్పదగింది బుగ్గబావి. దానిలోని నీరు టెంకాయపాలవలె స్వచ్ఛంగా ఉంటుంది. ఎంతటి వేసవి అయినా నీటికి తరుగంటూ ఉండదు కాబట్టి ఇక్కడి ఆలయాన్ని స్థాపించిన సన్యాసులు ముఖ్యంగా ఈ బావిని దృష్టిలో పెట్టుకొనే దీన్ని స్థాపించారని చెప్పవలసి ఉంటుంది.

యాత్రలు క్షేత్రాలు తీర్థాలు అని రెండు రకాలని శాస్త్రాలు చెబుతాయి. ఇది చిన్నపాటి గుట్ట ప్రదేశం. అంతేగాక ఇక్కడి బుగ్గబావిలోని నీరు విశిష్టమయింది. కాబట్టి ఈ ప్రదేశం సామాన్యమైనా ఈ యాత్రకు క్షేత్రతీర్థ మహాత్యాలు రెండూ సంక్రమించాయి. ఇక్కడి బండపై ఆలయం విస్తరించటానికూడా వీలుంది కాబట్టి భక్తులు ఆ పనిచేస్తే యిదే ప్రాంతంలో దర్శనీయ ప్రదేశంగా రూపొందగలదు.

—శ్రీ కే కిశోరుబాబు

—శ్రీ కే అశోకు బాబు

# వైష్ణోదేవి వేదాల నాటిదా ?

జమ్మూ — కాశ్మీర భారతీయ సాహిత్య పరిషత్ అధ్యక్షుడు శ్రీ జగదీశచంద్రశాస్త్రి పాత్రికేయులతో మాట్లాడుతూ శ్రుతుల్లో ప్రస్తావించిన జంబూ ప్రాంతం జమ్మూ అని, 'వైష్ణోదేవి ఆలయం వేదాలు, పురాణాలు రచనా కాలంలోనే ప్రసిద్ధి గాంచింది' — వార్త చదివాను.

ప్రసిద్ధ ప్రతిమా లాక్షిణికులు — గోపీనాథరావుగారు కూడా వైష్ణోదేవిని వివరించలేదు. సప్త మాతృకలు పురాతన కాలాని దేవతలు. అందులో వైష్ణవి ఈ వైష్ణోదేవి అనిపించదు సృష్టికి సంబంధించిన శక్తులు సప్తమాతృకలు, ఏడుగురక్కలు పోలిన దేవతలు సంఖ్య వేరైనా ఇతర దేశాల్లోనూ ఉన్నారు.



జమ్మూరాష్ట్రం కట్రావాసి వైష్ణోదేవి గర్భాలయ దృశ్యం.

వేదార్యుల పూజలన్నీ దేవుళ్లవిగా ఉన్నాయేగాని అమ్మవార్లకి కాదు ఉష, సరస్వతీ వారు పేర్కొన్న దేవతలు కాని పూజలు ప్రతిమలానాడున్న ట్లైనంలేదు. వారి దేవుళ్లకూ ఈ విగ్రహాలున్న ట్లైనం లేదు. సంజ్ఞా రూపాలుండెను.

హిమాలయ ప్రాంతాన అమరనాథ లింగమూర్తి — కారణం హిమపాతం—సంవత్సరం పొడుగునా యాత్రికులుండరు.

సింధు సంస్కృతి జనులకు నరరూప దైవాలున్నారు ఖుర్ల్లి, మొహెంజొదారో, హరప్పా శిధిలాలు వేదార్యులవి కావుట ఇతర మత పంథాల ఆరాధనాచారాలు బ్రాహ్మణ్యంలో లీనమైన చరిత్ర ఉన్నది.

వైష్ణోదేవి వేదాలనాటి దనిపించదు. నిర్ణయాలు చేయదగినది పురావస్తు శాఖవారే గాని సాహితీవేత్తలు కారు. ఈమెను దర్శించడానికి లక్షోప లక్షలుగా యాత్రికులున్నారు. ఆసియా, ఆఫ్రికా, ఐరోపాల్లో పురాతన దేవతలు ప్రతిమల్లో దేవదేవి — మహామాత గాథల్లో ఒక పోలిక వైష్ణోదేవిని వెంటాడిన 'రాక్షసుడు' ఒకడున్నాడు ఆవిడ గుహలో చేరి నిర్భయురాలైన కథ ఉన్నది. ఇతర దేశాల్లో మహామాత — నిత్య కన్య మన దేశంలో అమ్మవార్లు పతివ్రతలు, కన్యలుగా ఉన్నారు.

వైష్ణోదేవి రూపురేఖలు తెలియవు. దేశంలో ఉన్న ఆలయాలన్నిటి పోలికే ఆ రూపురేఖలు ముంచకుండా అర్చకులు ఏనాటి నుండో చేస్తోన్న మార్పులు ఇక్కడ ఉండవచ్చును:

''రాజ తరంగిణి'' చదివిన వారు వైష్ణోదేవి ప్రసక్తి ఉన్న వ్రాయగలరు. జమ్మూ కాశ్మీర ప్రభుత్వ సౌజన్యంతో వైష్ణోదేవి గర్భాలయ దృశ్యం — ఫోటో ఇందులో ప్రకటిస్తున్నాను. చూచి ఈమె వేదరచనా కాలానిదని నమ్మేవారున్న విశదం చేయ గోరెదను

*శ్రీ జి. ఆర్. వర్మ*

# లేఖలు

## సత్యాన్వేషణ

1978వ సంవత్సరం ఆగస్టు 'భారతి' కలగూరగంపలో శ్రీ సుందరేశ్వరరావుగారు రెండు సిద్ధాంత గ్రంథములపై తమ యభిప్రాయమును ప్రకటించుచు ''ఈ గ్రంథములందు అసత్యపు వ్రాతలు కుప్పలు తిప్పలుగా చోటుచేసుకొన్నవి.' విషయ ప్రతిపాదనలో ''క్షమింపరాని నేరం జరిగినదని'' వ్రాసిరి. ఆ రెండు సిద్ధాంత గ్రంథములలో మొదటిది ''ఆంధ్ర వాఙ్మయము — చారిత్రిక కావ్యములు''. దీనిని 1978 ఫిబ్రవరిలో ఆంధ్ర యూనివర్సిటీ వారు ప్రకటించిరట కాని దానిని చూచెడి అవకాశము మాకింకను లభింప లేదు రెండవది ''బసవేశ్వర వచనాలు—సమగ్ర సమీక్ష''. 1976-77లో తరళ బాళు విద్యాసంస్థ సిరిగెరె చిత్రదుర్గవారు దీనిని ప్రకటించిరి. దీనిని వ్రాసినవారు తెలుగు దేశమునకు చిరపరిచిత కవులగు డాక్టరు బాడాల రామయ్యగారు. వీరి యీ గ్రంథమును మైసూరు విశ్వవిద్యాలయము పరీక్షించి అత్యున్నతమైన డి. లిట్ పట్టము నిచ్చినది. ఇట రావుగారు పిహెచ్. డి. అనిరి. బహుశా వారికీ విషయము తెలియదేమో! ఆంధ్రదేశములో మొట్ట మొదట అత్యున్నతమైన పట్టమును పొందిన రామయ్యగారి సిద్ధాంత గ్రంథమున అసత్యపు వ్రాతలు కుప్పలు తిప్పలుగానున్నచో నిజముగా క్షమింపరాని నేరమే గాక యూనివర్సిటీవారి ప్రామాణికతనే శంకింపవలసియున్నది.

వీరశైవమత ప్రవక్తయగు బసవేశ్వరుని గూర్చి సమగ్రముగ తెలుసుకొన సుమారు ఎనబది యేండ్లనుండి శాసనశాఖ; సాహిత్య విమర్శకులు; లింగాయత మతాభిమానులు నిరంతరము శ్రమించుచునే యున్నారు. కాని కొన్ని విషయములు కొలుకుడు పడుటలేదు. ఇట్టి సందర్భమున డాక్టరు బాడాల రామయ్యగారి సిద్ధాంత గ్రంథము వెలువడినది. వారే వ్రాసిన కన్నడ ఇంగ్లీషు విమర్శ వ్యాసములు కూడ ప్రసిద్ధ పత్రికలయందు ప్రకటింపబడి యిచట కొంత సంచలన కల్గించినది. బసవనిపై రామయ్యగారి భావములే అపూర్వములు. అంత సులభముగా నంగీకరింపలేము. అట్లని త్రోసిపుచ్చుటకును వీలుకాదు. అది అట్లుండనీయండి. 'భారతి'లో రావుగారి యభిప్రాయములను చూచిన తరువాత రామయ్యగారి సిద్ధాంత గ్రంథమును మరల యొకసారి చూడవలసి వచ్చెను. అంత నాకు తోచిన భావము లివి:

పై సిద్ధాంత గ్రంథములపై రావుగారు రెండు దోషము లెత్తి చూపిరి. ఒకటి మొదటి సిద్ధాంత గ్రంథమున చర్విత చర్వణ దోషమును; రెండు ఆ మూలాగ్రముగ పరిశోధనాంశములు చూడక సుప్రసిద్ధ చారిత్రకులగు డాక్టర్ ఫ్లీటుగారి యభిప్రాయములకు విరుద్ధముగ పై రెండు గ్రంథములు తీర్పు చెప్పి, క్షమింపరాని నేరం చేసినవి. ఇట్లే అసత్యపు వ్రాతలు కుప్పలు తిప్పలుగానున్నవని యాక్షేపించిరి బహుశా ఆయన్ని తప్పుల నిట నెత్తిచూపవారికి వ్యవధి చాలకనో; దయదలచియో; ఎందుకులే యనియో వారు వదలినట్లున్నది.

ఆంధ్రయూనివర్సిటీ వారు ప్రకటించిన సిద్ధాంత గ్రంథమున ''మతము—ప్రవర్తకులు'' అనే అధ్యాయములో క్రింది విధముగా నున్నదని ''వీరశైవ మతోద్ధరణము చేసిన మత ప్రవక్తయగు బసవేశ్వరునిగూర్చి...... మన గోళిగ్రామమున గల 1161 నాటి శాసనమువలన తెలియుచున్నది (ఎ ఇం. సం. 5, 1888-89)''. ఇటులనే ఇ.పి రైస్ ''బాగెవాడికి పదునొకండు మైళ్ళదూరమున గల ''మనగ్గొలి'' యందు బిజ్జలుడు తాను రాజ్యమునకు వచ్చిన ఆరవ సంవత్సరమున బసవన దానమిచ్చినట్లు గలదు. (ఎ హిస్టరీ ఆఫ్ కానరీస్ లిటరేచర్, పేజీ 53), పై రీతిగ ''సిద్ధాంత గ్రంథములలోని ఉద్ధృతాంశాలలో 'మనగోళి; మనర్గొలి' అని రెండు సార్లు శాసన ప్రసక్తి తేవటం చర్విత చర్వణమే'' అని రావుగారి యభిప్రాయము.

ఈ ఆక్షేపణ చూచిన వెంటనే నాకు నవ్వు వచ్చినది. ఇది సిద్ధాంత గ్రంథమేగాని కావ్యము కాదన్నమాట మనము మఱచి పోరాదు సిద్ధాంత గ్రంథమున పరిశోధన చేయువాడు ఎవ్వరెవ్వరేమేమి ఎట్లెట్లు తెలిపిరో మొదటనే యథాతథముగా పూర్వపక్షమున చెప్పి, తరువాత యందలి గుణదోషముల పరిశీలించి, దోషముల ఖండించి, ఉత్తర పక్షమున తన వాదమును ప్రతిపాదింప

వలెను. ఇది పరిశోధనా క్రమములోని ప్రాథమిక ధర్మము ప్రామాణికత లక్ష్యము. ఈ సూత్రము ననుసరించియే ఆంధ్రాయూనివర్సిటీ గ్రంథమున ఫ్లీటు "మనగోలి" యనుటయు ఇ. పి. రైస్ "మనర్గోలి" యని యదే శాసనము ను కొంత యక్షర ప్రభేదముతో చదివి, చెప్పబడియున్నట్లు గుర్తింపబడినది. ఇట్టి సూక్ష్మ ప్రభేదములను గుర్తించుట సిద్ధాంత గ్రంథములందు సత్యాన్వేష కులకు అత్యంత అవసరము. మనమీ దృష్టితో చూచినచో నిది చర్విత చర్వణ దోషమని భ్రమింపలేము పరిశోధనా క్రమములోని ఈ ప్రాథమిక సూత్రమును కూడ రావుగారికి తెలియకపోయెనేయని జాలిపడవలెనో; తెలిసియు సిద్ధాంత గ్రంథములపై బడుమొండి సాహసమునకు మెచ్చవలెనో తెలియుట లేదు.

"రెండవ దోషమును చూపుచు" మనగోలి శాసన ప్రసక్తుడైన బసవేశ్వరుడు వీరశైవమత స్థాపకుడు కాడు. అతని పేరు బసవరసు. కాస్యపగోత్రజుడు. తల్లి దండ్రులు, చంద్రాంబా చందిరాజులు ఈ సత్యమును ఫ్లీటుదొర అబ్బులూరి శాసన సందర్భమున స్పష్టము చేసి యుండగ "బసవేశ్వర వచనాలు – సమగ్ర సమీక్ష" అనే సిద్ధాంత గ్రంథమున "వచనములు వ్రాసిన బసవన యెవ్వరు?" అనే అధ్యాయములో అబ్బులూరి శాసనమును కూడ చూడకుండా "మణిగవల్లి శాసన మున వచ్చు బసవరసయ్యయే లింగాయ మత స్థాపకుడు వచన కర్త అని ఫ్లీటు నిర్ణయించెను (పుటలు 6–7). ఈ తప్పు డభిప్రాయాన్నే వల్లె వేస్తూ 9 వ పుటలో అర్జునవాడ శాసనము వెలువడుటకు పూర్వము ఫ్లీటు గారు మణిగవల్లి శాసన మందలి బసవరసయ్యయే లింగాయత మత స్థాపకుడని యూహించిరి" అని యాక్షేపించుచు రామయ్యగారి వాక్యములనే రావుగారు పేర్కొనిరి. రావుగారి ఈ రచనాక్రమమును చూడగా ఫ్లీటు యభిప్రాయ మునకు వ్యతిరేకముగ డాక్టరు రామయ్య గారు నిర్ణయించిరని తేలుచున్నది. ఈ సందర్భమున రావుగారు ఫ్లీటు దొరగారి వాక్యములనే తమ వ్యాసమున ఉటంకించి దానికి తెలుగులో తమ యభిప్రాయమును కూడ దెల్పి మేలు చేసిరి. దీనిచే రెండుభాషలు తెలిసినవారికి ఫ్లీటు దొరగారి యభిప్రాయమేమో! తెలియకపోదు రావుగారి ఉభయభాషా ప్రాగల్భ్యము తరువాత చూడవచ్చును. అసలు ఫ్లీటుదొర అబ్బులూరి శాసన సందర్భమున మనగోలి బస వేశ్వరుని ఏటికి తెచ్చెనో మొదట మనము తెలిసికొనవలసియున్నది.

ఐదవ భారత శాసన సంపుటిలో డాక్టరు ఫ్లీటు మనగోలి; అబ్బులూరి శాసనముల రెండును పరిష్కరించి ప్రకటించియున్నారు మనగోలి శాసనమును గూర్చి 22 పుటలు (ఎ. ఇం. సం 5 పేజీలు 9–31) అబ్బులూరి శాసనమును గూర్చి 50 పుటలు (ఎ. ఇం. సం 5 పే 213–263)వరకు విస్తరించి వివిధ విషయములను దొరగారు చర్చించిరి. మనగోలి శాసనము కాస్యపు గోత్రజుడగు బసవరసును గూర్చి చెప్పుచున్నది. అబ్బులూరి శాసనము ఏకాంత రామయ్య చేసిన సాహసముల వర్ణించుచున్నది. ఈ యిరువురు గొప్ప శివభక్తులే. కాని ఈయిరువురికి యే విధమైన సంబంధము లేదు. మనగోలి బసవేశ్వరుని గూర్చి అబ్బులూరి శాసనమేమియు మాట్లాడదు. ఈ విషయము లన్నియు డాక్టరు బాడాల రామయ్య గారు తమ సిద్ధాంత గ్రంథమున 13; 440; 441 పుటలలో వివరించియున్నారు.

కాని ఫ్లీటు అబ్బులూరి శాసనమును చూచినప్పుడు ఏకాంత రామయ్యయే వీర శైవ మత ప్రవక్త అన్న సంశయము వచ్చినది. జైనులతో వివాదమురాగా ఏకాంతరామయ్య తన తలను తరుగుకుని ఏడు దినముల తరువాత మరల బ్రతుకును. అంత జినాలయములు శివాలయములుగా మారిపోవును. జైనులకు నిలువ నీడ లేకపోవును. కలచురి బిజ్జలుడు జయపత్రి మిచ్చి రామయ్యను గౌరవించును. ఆతడేకాదు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు నాల్గవ సోమేశ్వరుడు; కదంబ కామదేవుడు రామయ్య వీరభక్తికి మెచ్చి విశేషముగా గౌర వింతురు. శాసన మీరీతిగ ఏకాంత రామయ్య వీరభక్తిని చాటుచు నాతడే శైవమత స్థాపకుడనుచుండ లింగాయతల పురాణములు బిజ్జలరాయ చరిత్రము మాదాంబా మాదిరాజుల పుత్రుడగు బస వేశ్వరుడు వీరశైవ మత స్థాపకుడని ఘోషించుట ఫ్లీటు విని ఆయా పురాణములన్నియు నిట సంగహించి వ్రాయుచు దొరగారు "ఇవి యన్నియు పుక్కిటి పురాణములు. ఒక్కదానితొ నొక్కదానికి పొత్తు పొసగుటలేదు". ఈ యన్నింటికంటె తానే ముందు పరిష్క రించి ప్రకటించియున్న మనగోలి శాసనములోని బసవరసే లింగా యత మతస్థాపకుడనవచ్చునని ఆ శాసనము నీ అబ్బులూరి శాసన సందర్భమున సంగ్రహించి ఫ్లీటు వ్రాసెను. అంతేగాని అబ్బులూరి శాసనముతో మనగోలి శాసన ప్రసక్తుడైన బసవరసున కేవిధమైన సంబంధము లేదు. ఇట ఫ్లీటు సంగ్రహించి వ్రాసిన వాక్యములతో కొన్ని మాత్రమే రావుగారు మన ముందు పెట్టును. ఈ వాక్యముల పరిశీలించుటకు మునుపు మనగోలి శాసనమును మనము చక్కగ అర్థము చేసికొనవలెను. లేనిచో నిది అపార్థమునకు దారితీయును.

బసవ చెన్న బసవ పురాణము లందును, బిజ్జల రాయ చరి త్రమునను పేర్కొనబడిన బసవ, మాదిరాజు లనే రెండు పేళ్ళను మనగోల శాసనమున కూడ వచ్చుచున్నాయి. కాని పురాణములలో వచ్చు బసవేశ్వరుడు మాదిరాజు కుమారుడు. వీరశైవ మతప్రవక్త. మనగోలి శాసనమున వచ్చు బసవరసునకు, అచటనే చెప్పబడుచున్న మాదిరాజునకు నెట్టి సంబంధమును చెప్పబడలేదు. శాసనములోని బసవరసు కాస్యప గోత్రజుడు, చంద్రాంబ చందిరాజుల పుత్రుడు. ఈ శాసనములో వచ్చు బసవరసుని గూర్చి చెప్పబడిన పద్యము లన్నియు డాక్టరు రామయ్యగారు వారి గ్రంథమున ఉటంకించిరి. (పుటలు 7, 8) ఈ శాసనమునవచ్చు మాదిరాజు; పురాణప్రసక్తుడైన మాదిరాజు లిరువురు యొకరే యని భ్రమింపరాదు. ఈ భ్రమకు లోనైనవారు చాలమంది గలరు. కాని వారి వాదము లన్నియు అర్జునవాడ శాసనము వెలువడిన వెంటనే వీగిపోయినవి. కడకు ఫ్లీటుగారి వాదమూ నిలువలేదు డాక్టరు రామయ్యగారు ఈ వాదము లన్నింటిని ఖండించి ఉత్తర పక్షమున అర్జునవాడ శాసన మున వచ్చు మాదాంబా మాదరసుల పుత్రుడు; సంగన బసవడే

వీరశైవ మతస్థాపకుడు, వచనకర్త యని సిద్ధాంతము చేసిరి. రావుగారీ భాగ మేటికి చూడలేదో ఆశ్చర్యముగా నున్నది.

అబ్బులూరి శాసన సందర్భమున ఫ్లీటు పేర్కొన్న మనగోలి శాసన విషయ మిట్లున్నది:

The Managoli Inscription of A. D 1161 (above page. 9) That record gives us the names of Basava and Madiraja both of which appear in Basavapuranas in connnection with the foundation and endowment of a Linga temple evidently of some considarable size and repute at Managoli in the neighbourhood of Bagewadi; the alleged residence of Madiraja and brith place of Basava and indoing so; it really seems to give us the original of traditional Basava who figures in the Lingayat puranas and the Jaina book. And in disclosing the facts that the parents of Basava were not Madiraja and Madalambika; but Chandiraja of the Kasyapa gotra; and Chandrambika and that Madiraja belonged to altogether a different family namely the Harita Gotra If furnishes further grounds for questioning the correctness of Lingayat tradition which indeed seems but little better than a legend (E. I. Vol. V. Page. 242).

దొరగారి పై వాక్యములలో మధ్య కొన్నింటిని మాత్రమే గ్రహించి రావుగారు తమకు తోచినటుల వ్యాఖ్యానించిరి. కడకు వారు చూపెడి వాక్యము లందే "It really seems to give us the original of traditional Basava" అని స్పష్టముగ మనగోలి శాసనములోని బసవరసే జైన గ్రంథమునను; లింగాయత పురాణములందును చిత్రింపబడిన, నిజమైన సంప్రదాయానుసారముగ వచ్చు వాడని చెప్పుచున్నట్లున్నది. మరియు ఈ శాసనమున వచ్చు బసవరసుయొక్క తల్లిదండ్రులు మాదిరాజు మాదలాంబలు కారు కాని కాస్యప గోత్రజులగు చందిరాజా చంద్రాంబలు మాదిరాజు హరిత గోత్రజుడు కడపటి వాక్యమును రావుగారు చూడనే లేదు. ఆ వాక్యమును గ్రహించినచో ఫ్లీటుదొర బసవ చెన్న బసవ పురాణముల పుక్కిటిపురాణములని త్రోసిపుచ్చుట తెలిసియుండెడిది.

ఈ పుక్కిటి పురాణముల కంటె మనగోలి శాసనమే ప్రమాణమనుటకు ప్రబలాధారములు లభించుచున్నవని ఫ్లీటు 'అరటి పండొల్చి చేతికందించి'' నట్లుల ఆంగ్ల భాషలో వివరింపగా, రావుగారా వాక్యార్థములను ఇంద్రజాలికునివలె మార్చి, తెలుగులో విపరీతముగ వ్యాఖ్యానముచేసి తమ ఉభయ భాషాప్రాగల్భ్యమును ప్రకటించుకొనిరి. ఈ శ్రుత పాండిత్య ధురీణుల గూర్చి ఏమి చెప్పగలము ? విషయమును జీర్ణించుకుని, పూర్వాపరముల తెలిసి సిద్ధాంత ప్రక్రియ ననుసరించి జిజ్ఞాసతో తపించెడి వారికి తప్పక సత్యము తెలియగలదు.

డా. ఎన్. ఎస్. దక్షిణామూర్తి.

# వ్యర్థాన్వేషణ

డా ఫ్లీటు 'is rather suggestive' అన్న దానికి తెలివిడిగా కర్ణాటక మహీమండలంలో వృద్ధవిద్వాంసులు, ప్రామాణికులు అయిన డా. పి. బి. దేశాయ్‌గారు వ్రాసిన హెచ్చరిక వాక్యాలు ఉదహరిస్తే సరిపోతుంది. ఈ క్రింది రచన వారిదే.

"The view was first profounded by the late Dr. Fleet while the record in 1899. He averred

> "The occurence of the names of Basava and Madiraju in this Saiva Record from the neighbourhood of Bagewadi and in connection with the foundation and endowment of a Linga temple is rather suggestive of our having at last met with an epigraphic mention of the original of that Basava who according to Lingayat tradition as embodied in the Basavapurana and Chenna Basavapurana was born at Bagewadi to Saiva brahmin named Madiraja" (The italics are mine).

The view which first put forth cautiously as a suggestion and not as an authenticated fact, has mislead many a later writer on the subject" (Dr P. B. Desai. Basaveswara and His Times, Pages 138 - 9. Kannada Research Institute, Karnataka University, Dharwar 1968).

పై హెచ్చరికను శ్రీ దేశాయ్‌గారు 8, 9 సంవత్సరాలు క్రితమే చేశారు. న్యాయంగా తరవాత వచ్చిన సిద్ధాంత గ్రంథ కర్తలు ఈ హెచ్చరికను పాటించడం కాని, విమర్శించడం కాని చెయ్యాలి. ఆ విధంగా చెయ్యకపోవడమే కాకుండా శ్రీ దేశాయ్‌గారి గ్రంథాన్ని బాగా వాడుకొని కనీసం ఉపయుక్త గ్రంథాల లిస్టులో కూడా లేకుండా చేశారు సిద్ధాంత గ్రంథకర్తలు

ఈ వ్యాస రచయితపై చేసిన నిందాగర్భ వాక్యాలు ఎవరికి తగులుతాయో అనే 'రెండో ఆలోచన' లేకుండా రాసిన ఈ అమాయకపు మధ్యవర్తిపై జాలిపడవలసి వస్తోంది.

శ్రీ సుందరేశ్వరరావు

# శ్రీనాథుని జన్మస్థలము

మహాకవి శ్రీనాథుని జన్మస్థలమును గురించి మరల వివాదము ప్రారంభమైనది. పరిశోధన పరమేశ్వరులు, శ్రీకాకుళం జిల్లాలోని "కొలచన కోట" గ్రామమును కొత్త సిద్ధాంతమును ప్రవచించుటకు ముందుగా "కనకక్ష్మాధరధీరు"వను పద్యమును గార్తిగా విస్మరించుట ఈ రభసకు నాందిగాగా, నీ వాదమును ఖండింప యత్నించిన వారనేకులు, ఆ పద్యమును చంధోభంగముగల అపపాఠమును ప్రవేశింపజేసి, కొన్ని కొత్త సిద్ధాంతముల నిల్పుటకు ప్రయత్నించుట వాదస్థాయి హెచ్చింపతోడ్పడినది. వీరందరును మరచిన ముఖ్యాంశము "అవచితిప్పయసెట్టి"కిని "శ్రీనాథునకును" గల బాల్యసఖిత్వము, సన్నిహిత స్నేహసంబంధము తిప్పయసెట్టి ప్రకాశం జిల్లా శింగరాయకొండకు సమీపమునగల "సోమరాజుపల్లి" నివాసియై, సముద్రాంతర వ్యాపారము నిర్వహించిన వణిక్ప్రముఖుడగుట, అతని నివాసము రేవుపట్టణమై యుండవలయునన్నుట నిర్వివాదాంశము. అది "సోమరాజుపల్లి" యనుట చరిత్రకారు లంగీకరించిన సత్యము. వీరిరువురును సఖులై యుండవలయు నన్న శ్రీనాథుడా గ్రామమునకు సమీపమున నివసించి యుండవలయు ననుట ఆవశ్యకము. అగుచో శ్రీనాథుని జన్మస్థలమును గనొనుటకీ "కనకక్ష్మాధర ధీరు"డను పద్యపాదము అపపాఠము గలది. సమాధాన మిచ్చుననుట వృథాప్రయాస. చంధోభంగముగూడ గమనింపకయే, పరిశోధకులా పాఠము నెట్లు ప్రకటించిరో దురూహ్యము. "వారిధితటీ క్రొల్పట్టణాధీశ్వరు"డను ముద్రారాక్షసము, పరిష్కర్తల దృష్టిలోపమున నేటికిని సవరింపబడకుండుటచేతనే నేటికిని కవి సార్వభౌముని జన్మస్థలము నిర్ణయింపరాకున్నది "కొలచన కోట" గాదనుట కది గుండ్లకమ్మ తీరమున లేదనియు, "వారిధితటి"యని స్పష్టముగా నుండుటయు, "వార్ధితటి పాకలె"యను పాఠమున మరల చంధోభంగమగుటయు ప్రబలతర సాక్ష్యములు గావా? దగ్గుపల్లి—శ్రీనాథుని బావమరది దుగ్గన్న జన్మస్థలమగుటచేత, ఆ గ్రామమునకు దగ్గరగానున్న పొన్నపల్లి శ్రీనాథుని జన్మస్థలమగు టవసరమా ?

"క్రొల్పట్టణమ"ని ముద్రించుట విడవి, క్రొంబట్టణముగా సవరించి, మహాకవి జన్మస్థలమును, తిప్పయసెట్టి స్వగ్రామమగు సోమరాజుపల్లెకు పదిమైళ్ళ దూరమునను, రెడ్డిరాజుల రాజధాని "అద్దంకి"కి ఇరువదియైదుమైళ్ళ దూరమునను, సముద్రతీరమందుగల "కొత్తపట్టణము" రేవునకు జేర్చి, వివాదము నొక రేవునకు దెండు. ఇకనైనను ఒంగోలుకు పదిమైళ్ళ దూరమున గల కొత్త పట్టణమే. (చిన్నయసూరి దయవలన ప్రాతాది సంధికి లక్ష్యమైనదిగా గుర్తించి] "వారిధితటికి" విపరీతార్థ స్ఫురణగల్గజేయ నవసరము గలుగక, నేటికిని యథాతథముగా నిల్చియున్న రేవుపట్టణము—"క్రొంబట్టణము"గా స్వీకరించినచో, అపపాఠముల, అసంగితార్థముల ప్రయాస తప్పనుగదా?

క్రొల్పట్టణమని ఎవ్వడో ముద్రారాక్షసము జొరనిచ్చుట వలననే, అది ఎచ్చట గలదో వెదుకవలసిన దౌర్భాగ్యస్థితి దాపురించినది. సలక్షణమగు పద్యపాదమునకు అపపాఠము లేర్పడు దుర్ణయము గల్గినది. "తాళీదళ సంపుట ప్రకర కాంతారంబునం దర్పుపుం దెరువాటుల్ దెగగొట్టు" చోరులకు "చీకటితప్పు" చేయుటకు మరికొంత అవకాశము లభించుట కాస్కారమైనది వాస్తవస్థితి మరుగునబడు ప్రమాదము సంభవించినది. ఇంచుమించు ప్రతి తెలుగు కావ్యమునకు పారక లేఖ కాథముల చేతబడకుండ దప్పించుకొనలేకపోవుటచే ప్రతిదమునకును ప్రతి పదము గనిపెట్టుకొనవలసి వచ్చుచున్నది. సంశయాత్ములున్నచో "హరవిలాసము" మరల పఠింపుడని చెప్పుచు, వివాదమున కొక్కపర్యాయమే ముగింపు పెట్టుచున్నాను.

*శ్రీ పమిడిపాటి వేంకటరంగారావు*

# మరుపూరువారి సమీక్షలలో వింతలు!

మరుపూరు కోదండరామరెడ్డిగారి సమీక్షల గురించి ఇదివరకే రాయాల్సింది. సెప్టెంబరు 'భారతి'లో నిశ్శబ్ద సంగీతం' సమీక్ష ఇప్పటికయినా నాలోని బద్ధకాన్ని పోగొట్టింది.

మరుపూరివారి సమీక్షల్లో' 'అప్పటమైన, పొరటలు, ఆబాదులు, మక్కబారు, సేగేలేదు" మొదలయిన మాండలిక పదాలు చోటు చేసుకోవటం ఒక వింత! సందర్భాన్నిబట్టి అర్థాన్ని ఊహించుకోవాలి వీటికి. అప్రసిద్ధ పదాల్ని వాడుతూ 'స్వయం రాజా స్వయం మంత్రీ'లాగా తానే వ్యాఖ్యానం ఇవ్వడం రెండోవింత! ఉదాహరణలు—బాగాలా? (లేదా అనుటకు నెల్లూరుదేశ్యం), ఏలపదాలు (జానపద గేయాలు) కొరడు (ఇంద్రధనుస్సు), చాటవలు (సామెతలు), అమ్మవారి కసుమలు (స్ఫోటకపు మచ్చలు) వగైరాలు.

ఈ రోజుల్లోకూడా 'మా బోంట్లు', 'మంచిదినాలు', 'వ్రాయంగా వ్రాయంగా' మొదలైన ప్రాతవడిన మాటల్ని వాడటం, 'సంకర సమాసాలు' అని గింజుకోవడం మరోవింత ! కాలదోషం పట్టిన గ్రామ్యం, నింద్య గ్రామ్యం వగైరాలకి ప్రాణం పొయ్యాలనే మరుపూరివారి తాపత్రయం మరోవింత! "కొందరు నాగన్నలు మాండలీకాలను గ్రామ్యాలనుకొని గ్రామ్యవాదం చేస్తారు" అని ఓ సమీక్షలో రాసిన మరుపూరువారే 'నిశ్శబ్ద సంగీతం' ఉపోద్ఘాతం నింద్యగ్రామ్యంలో ఉన్నదనటం వింతలలో వింత! ఈయనలాంటి వారిద్దరో ముగ్గురో తప్ప 'గ్రామ్యం' పదాన్ని పట్టుకుని పాకులాడటంలేదు.

"మంచిభాష నాగరక లక్షణంగదా!" అని అంటున్న మరుపూరువారి కలంనుంచే "అచ్చుగుల", "నపుంసకక్రోధం" మొదలైన పదాలు దొర్లటం బహువింత! "బావుణ్ణు"వంటి పదాలు మరుపూరు వారికి 'కర్కశాలై చెవులకు ములుకులుగా తాకుతూంటే, వారి 'ఇట్లనే', 'అట్లనే', 'అరిపి' మొదలైనవి మరొకరికి ములుకులుగా తాకవా?

*శ్రీ ద్వా. నా. శాస్త్రి.*

## "సిద్ధాంతం"

సిద్ధాంతంవేరు. కనుక ప్రత్యక్షంగానో—పరోక్షంగానో విమర్శించే ధోరణి ఉత్పన్నం అవుతుంది. ఐతే సిద్ధాంతాన్ని ఎదుర్కొనే ముందు సిద్ధాంతాన్ని కూలంకషంగా అధ్యయనం చేయవలసి ఉంటుంది.

"కాటికి కాళ్ళు జాపుక కూర్చోవటం నేర్పెడి కర్మసిద్ధాంతం మూడు పువ్వులు ఆరుకాయలుగా..." కర్మసిద్ధాంతం కాటికి కాళ్లు జాపుక కూర్చోమన్నదా...? ఎక్కడ? ఎక్కడంటే అ, ఆ లు రాని, అధ్యయనంలేని ఒక మనస్సిద్ధాంత ప్రేరక ప్రారబ్ధంలో.

అంజయ్యగారికి నమస్కారములు: తమరు కర్మసిద్ధాంతాన్ని బాగా చదవండి. నక్సల్ బరీ, శ్రీకాకుళాలు—మార్క్సిజమ్ [మీకు వెన్నెముకలో—మరేదో కావచ్చు—ఐతే] ఏ సిద్ధాంతాన్ని ఉద్బోధించింది? కాటికిపోని అమృత సిద్ధాంతాన్ని అందిస్తే, ఆ సిద్ధాంతానికింత కరపత్ర ప్రచారం [చాటుగా] ఎందుకండీ? ఇదేం కర్మ...?

> "న కర్మణా మనారమ్భాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే
> న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి".

ఐతే తమరింతకన్న పండితులు కావచ్చు. తెలియపరచిన ఇంకా తెలిసికొందును.

— ***సాంధ్యశ్రీ***

## బ్రాహ్మణత్వం - బ్రాహ్మణాధిక్యం

సెప్టెంబరు '78 "భారతి" సంచికలో శ్రీ ములుమూడి ప్రసాదురావుగారు నా "సంప్రదాయం" వ్యాసం ముక్కను విమర్శిస్తూ వ్రాసిన ఉత్తరం ముక్కను చదివాను.

అసంఖ్యాక వర్గాలవారికి ఏలినవారు అన్ని సదుపాయాలు కల్పిస్తున్నారని ఒకవైపు అక్కసు ప్రదర్శిస్తూ అభ్యుదయం అక్కసుగా శ్రీవారు దర్శించారు. "ఏలినవారు ఇతరుల సుఖాన్ని, అర్హతలని ఉరి తీస్తున్నార"ని కూడ వారు అవేశపడ్డారు. ఆ ఇతరులంతా సమైక్యంగా పోరాడి, తమ హక్కులు సాధించుకోగల్గితే వద్దనే వారెవరు?

గత ముప్ఫయి సంవత్సరాలుగా బ్రాహ్మణాధిక్యత పోయిందన్నారు వారు. సంప్రదాయాధ్యయనానికి సంబంధించినంతవరకు ఇదివాస్తవం కానేరదు. గురుకులాల్లో, ఆశ్రమాల్లో ఇప్పటికీ కనిపించేది బ్రాహ్మణాధిక్యతే.

బ్రాహ్మణత్వమే సంప్రదాయం, కానీ బ్రాహ్మణాధిక్యతకాదు. బ్రాహ్మణత్వమంటే బ్రహ్మజ్ఞానం కలిగియుండటం. వ్యాసుడ్ని, వాల్మీకిని సమాదరించిన మన పూర్వుల విశాల దృష్టిలో బ్రాహ్మణత్వం ఉంది, కానీ బ్రాహ్మణాధిక్యతలేదు.

***శ్రీ సి. ప్రభాకర్***

## భారతీ!

పంతులుగారి వంశమునం బ్రాభవమంది 'ప్రసాదు' ప్రాపుతో
క్రాంతి సరోరుహమ్ము పయి గారవ మొప్పగం **గూడు**చుండి వే
దాంత సమీహిత ప్రబల తంత్రులతోడి విపంచి మీటుచున్
శాంత వివేక సామ్యనిజ సారస రాగములల్లు భారతీ!

> వ్యాసపుంబొట్టుంబెట్టి, యితిహాసపు చేలముదాల్చి మేలుగ
> శాసన భూషణమ్ములను చక్కదొడంగుచు, గేయపుష్పముల్
> రాసులుగా ధరించి తల, రమ్యముగా 'కలగూరగంప'**తో**
> మాసము మాసమున్ వడిగ మా దరిఁజేరిన నిన్ను గొల్చెదన్.

***శ్రీ పాయల సత్యనారాయణ***

## తోడు దొరకింది

నా సచిత్ర వ్యాసాల తొలి సంపుటి "మైలారదేవ" లో సాతవాహనులు శూద్రులన్నాను. కొందరు కోపించారు. శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణుల్ని శూద్రులంటారేమిటని వ్రాసారో పరిశోధకమిత్రులు. నేను ఆ రాజులను శూద్రులనడంలో ఆధారాలన్నీ 'వొల్చిపెట్టలేదు'.

"భారతి" (ఆగస్టు 1978) లో డా. కో. శ్రీరామమూర్తి గారి నిర్ధారణ నాకు నచ్చింది. సాతవాహనులు వ్యవసాయకులు, వ్యవసాయాభివృద్ధి చేసిన రాజులు. 'సాత, శాలి'తో పాటు 'శాకవాహన' కూడా ఒకనాటి వ్యవహారం —కన్నడ పరిశోధకుల దృష్టిలో ఉన్నది.

ఈ రాజులు సాతు / సార్థవాహ — పెటికాటం — వర్తక బిడారు నభివృద్ధిచేయడం గూర్చి మరో సంపుటంలో చర్చిస్తాను.

"నిజం నిలకడమీద" తెలియడం 1972 నాటి "మైలారదేవ"లో నే శూద్రులంటే 1978 "భారతి" లో శూద్రులనే నిర్ణయం పెద్దలు చేసారు.

"కళింగదేవ" లో పరిశోధకు లూహించనివి వ్రాశాను. శాసనాలు — సాహిత్యం బాపతు వారికీ, అంతా 'ఆర్య—సంస్కృత' భవం అనుకునేవారికీ నచ్చకపోవచ్చును. "భారతి"లో "కళింగదేవ" సమీక్షకులుకూడా నా "నిరాధార" వగైరా "సిద్ధాంతం" కానివి—సరేనేమో అనే రోజులు రావచ్చును.

గతజన, జీవనస్మృతి — రెండు అంశాలీ "కళింగదేవ" లో ప్రస్తావించాను. పెద్దలనేకుల దృష్టిపథం**లో** పడలేదు. ఒక్క "విశాలాంధ్ర" సమీక్షకులు దప్ప. నాల్గో సంపుటిలో సమీక్షకులకు సమాధానాలు వ్రాయదలచాను.

***శ్రీ జి. ఆర్. వర్మ.***

# గ్రంథ విమర్శలు

## రెండు వచన రచనలు

## 1. మహాభారతం

[ఆదిపర్వం. ప్రథమ భాగం. రచన — నాయుని కృష్ణమూర్తి, క్రౌను 128 పేజీలు. వెల రూ. 3=50. ప్రచురణ : విజయవాణి పబ్లిషర్స్, చౌడేపల్లి — Pin 517257. చిత్తూరుజిల్లా.]

## 2. భ్రమరగీత

[హిందీ మూలం : కవి శిరోమణి మహాత్మా సూరదాస్ తెలుగు సేత శ్రీ గోపీకృష్ణ. క్రౌను 62 పుటలు. వెల 4 రూ లు. ప్రకాశకులు — స్పందన సాహితీ సమాఖ్య, 26-162. బుట్టాయిపేట, మచిలీపట్టణం—Pin521 001.]

(1) వాఙ్మయంలో ఎన్ని మార్పులు వచ్చినా, ఎన్ని ప్రక్రియలు తల చూపినా భారత భాగవత రామాయణాలపై గౌరవం తగ్గలేదు. వచనంగానో, పద్యంగానో, నాటకంగానో, కథగానో, మరో విధంగానో కవులు వాటికి రూపాంతరాలు కల్పిస్తూనే ఉన్నారు. మహాభారతానికి సంస్కృతాన్ననుసరించీ, కవిత్రయాన్ననుసరించీ గ్రాంథిక భాషలోనూ, వ్యావహారిక భాషలోనూ వచానువాదాలు వస్తూనే ఉన్నవి. కొందరు భారతాన్ని ఆధారం చేసుకుని స్వతంత్ర పద్ధతిలో కథను చెప్పుకొనిపోయినట్లు సర్వజనాకర్షకంగా రచనను సాగించి, ప్రకటించి ఐహికంగానూ, ఆముష్మికంగానూ ప్రయోజనాన్ని పొందగలుగుతున్నారు. అట్టి వాటిలో ఉషశ్రీ పురాణ పండ వారి భారతం మంచి ప్రచారాన్ని పొందింది. ఈ భారత రచన కూడా ఆ పద్ధతిలోనే — కమనీయమైన శైలిలో రచించాలనే సంకల్పంతో ప్రారభించబడినట్లు తోస్తున్నది.

దీనిని ప్రకటించిన విజయవాణి పబ్లిషర్స్ "మహాభారతం కల్పితం అయితే, కల్పనా సాహితిలో యీ గ్రంథం వరసన నిలిచేవి చాలా తక్కువ. వాస్తవమయితే అంతా అద్భుతమే! ఆ కాలంలోకి, ఆ పాత్రలలోకి చొచ్చుక వెళ్ళగలిగితే అద్భుతం కానిదేదీ వుండదు. అందరికీ అర్థమయ్యే రీతిలో ఉత్కృష్టమయిన యీ అద్భుత సృష్టిని పాఠకుల ముందుంచడానికి చేసిన ప్రయత్నమిది" అని ఈ రచనను ఉగ్గడిస్తున్నారు.

ఇది ఒక కొత్త సృష్టి! రచన ఒక నవల మాదిరిగా సాగింది. ఆయా సందర్భాలను పురస్కరించుకొని పుస్తకంలో చేర్చిన నూతన పద్ధతి రేఖా చిత్రాలు కూడా దీని పఠనానికి మెరుగు పెడుతున్నాయి.

ఇది నన్నయ భారతానికి వ్యావహారిక రూపాంతరం. ఇది ఆదిపర్వంలోని మొదటి భాగం మాత్రమే! నన్నయ ఆది పర్వంలోని మొదటి నాలుగు ఆశ్వాసాల కథ ఇందులో చిత్రించబడింది. మిగిలిన నాల్గాశ్వాసాల కథ రెండో భాగంలో ఉండవచ్చును. రెండు పుస్తకాలతో ఆదిపర్వం ముగియవచ్చు. ఈ విధంగా ప్రకటిస్తే భారతం పూర్తి కావడానికి ఇరవై పుస్తకాలయినా రావలసి ఉంటాయని తోస్తున్నది.

అట్టమీది వర్ణ చిత్రం అందంగా ఉన్నది. రచయిత పట్టుదలతో వ్రాసి, ప్రకాశకులు వ్యయప్రయాసలు లెక్క చెయ్యకుండా ప్రకటిస్తే మంచిదే! అలా జరగాలనే కోరుతున్నాను.

(2) భాగవతం దశమస్కంధంలోని భ్రమర గీతాలు చాలా ప్రసిద్ధమైనవి. రేపల్లెలో గోపికలతో కలసి మెలిసి ఉండి, వారి హృదయాలను అపహరించిన శ్రీకృష్ణుడు, కొద్ది రోజుల్లోనే తిరిగి వస్తానని వారికి వాగ్దానం చేసి మధురకు వెళ్ళిపోయాడు. అక్కడి రాజకీయాల్లో చిక్కుకొని ఉండడం వల్ల చాలా కాలం వరకూ తిరిగి రావడం సాధ్యం కాకపోయింది. అతడు ఆలోచించి ఉద్ధవుణ్ణి గోకులానికి పంపుతాడు. గోపికలను ఊరడించి, వారికి తత్వోపదేశం చెయ్యమంటాడు. ఉద్ధవుడు గోకులానికి పోయి, గోపికలకు ఊరటను కల్గించి తత్వాన్ని ఉపదేశిస్తాడు. అతని మాటలు గోపికలకు నచ్చలేదు. ఆ సమయంలో ఒక తుమ్మెద అక్కడికి వచ్చింది. గోపికలు దానితో మాట్లాడుతున్నట్లు అన్యాపదేశంగా మాట్లాడతారు. ఉద్ధవుణ్ణీ, శ్రీకృష్ణుణ్ణీ నిందిస్తారు. ప్రాధేయపడతారు. భ్రమరంతో చెప్పిన మాటలకు గల ప్రాధాన్యాన్ని బట్టి ఇది "భ్రమర గీత" అయింది. దీనికి "భ్రమర గీతాలు" లేక "భ్రమర గీతికలు" అని పేరు పెట్టకుండా "భ్రమరగీత" అని పేరు పెట్టబడింది. మూలం గేయ రూపంగా ఉన్నా అనువాదం వచనం కాబట్టీన్నీ, భగవద్గీతాసామ్యం అనువాదకుని అభిప్రేతం కాబట్టీన్నీ ఈ పేరు పెట్టబడినట్లు అనువాదకులే చెప్తున్నారు.

భాగవతంలోని చిన్న అంశాన్ని తీసుకుని సుప్రసిద్ధ హిందీ మహాకవి సూరదాస్, భక్తి విధానాలలోని రూపోపాసను సమర్థిస్తూ భ్రమరగీతను రచించగా దానిని అనుసరించి యీ తెలుగు రచన ఏర్పడింది. మూలాభిప్రాయాన్ని తెలుపుతుందే గాని యిది యథా మూలానువాదం కాదని అనువాదకులు తెలుపుతున్నారు.

"సూరదాస్ పుష్టి మార్గంలో దీక్షితుడైన కారణం చేత వినయభావము, దాస్యభావము గల భక్తిని త్యజించి భగవానుని స్నేహితునిగా ఆరాధించే భక్తిని స్వీకరించాడు. పుష్టి మార్గంలో ప్రవర్తిల్లేది రూపానురాగ భక్తి. ఇందులో కామరూప, సంబంధ రూప అను రెండు భేదములున్నవి. సూరదాసు ఆ రెండు

రకములైన భక్తిని తన కావ్యమున చూపించాడు.'' ఇది అనువాదకుల అభిప్రాయం. ఈ పుస్తకాన్ని సావధానంగా పఠిస్తే యీ విషయం బాగా గోచరిస్తుంది

అనువాదకులు తమ 'రెండు మాట' ల్లో రెండు వందల మాటల్లో చెప్పదగిన పెక్కు విషయాలను తెలియజేశారు. భారతీయ సాహిత్యంలో కృష్ణుని స్థానాన్ని గురించీ, గోపిల కృష్ణ భక్తిని గురించీ, భక్తి తత్వాన్ని గురించీ చాలా విషయాలను చెప్పారు.

స్పందన సాహితీ సమాఖ్య వారు ఆధునిక కవితా ప్రక్రియనే కాకుండా ఇట్టి ఉపయుక్త గ్రంథాలను కూడా ప్రకటించడం ఎంతో బాగా ఉన్నది చిన్న పుస్తకాలలో ఎంతో ఉదాత్తమైన — విలువైన విషయాన్ని అందించే వీరి ప్రయత్నం మిక్కిలి మెచ్చుకోదగినది.

# ఎఱ్ఱాప్రెగ్గడ

[నాటకము, రచయిత : శ్రీ పోలూరి హనుమజ్జానకిరామ శర్మ, (బి.ఏ ఆనర్సు) ప్రాచ్యభాషా విభాగాధ్యక్షులు. వెంకటగిరిరాజ కళాశాల, నెల్లూరు. డెమ్మీ 122 పుటలు. వెల 5 రూ. ప్రాప్తిస్థానము — శ్రీ కారుమంచి కొండలరావు, సంపాదకులు ''విమలానంద భారతి'' బావాజీపేట, విజయవాడ—520003 ]

నెల్లూరు పురప్రముఖులు, వదాన్యశేఖరులు కీ. శ. తిక్కవరపు రామిరెడ్డిగారు ఒకప్పుడు ఈ రచయిత వ్రాసిన 'భువన విజయ' నాటక ప్రదర్శనాన్ని చూచి ''రాయలవారికి ముందు రెడ్డి రాజులు కూడా వాఙ్మయాన్ని పోషించారు కదా'' అని అన్నారట! ''ఉన్నారు, ఎఱ్ఱాప్రెగ్గడను ఆదరించి, అగ్రహారాన్నిచ్చిన వారు రెడ్డిరాజులే! ఆ సంవిధానాన్ని కూడా నాటకంగా రచిస్తాను'' అని వీరు సమాధానం ఇచ్చారట! మరికొన్నాళ్లకు ఈ రచన పూర్తయింది కాని రచయిత దీనిని వినిపించడానికి ముందే ఆ వదాన్యులు దివంగతులైనారు. ఈ నాటక రచనకు దోహదం ఇచ్చినవారు శ్రీ రామిరెడ్డిగారే! తర్వాత హనుమజ్జానకి రామశర్మగారు దీనిని ''విమలానంద భారతి'' పత్రికలో ప్రకటించి, అందులోనుంచి 250 రీప్రింట్లు తీసుకుని, గ్రంథరూపంగా ప్రకటించారు. తమ ఆప్తబంధువులూ, తత్పత్రికా సంపాదకులూ అయిన కారుమంచి కొండలరావుగారికే యీ కృతిని సమర్పించారు.

'ఎఱ్ఱనార్య సాహిత్యమ్ము నివతళించు.' ఈ నాటకంలో ఆరంకాలు ఉన్నవి. పాత్రలన్నింటికీ గ్రాంధిక భాషయే వాడబడినది సంస్కృత నాటకాలలో ఉన్నట్లే అంకాలముందు విష్కంభాలు చేర్చబడినవి కాని నాటక లక్షణాలన్నీ కుదిరినట్లు లేదు ఇందులో రసం ఏమిటో చెప్పలేం, పద్యాలు, కొన్ని వచనాలు ఆయా గ్రంథాల నుండి గ్రహించబడినవి. పాత్రల సంభాషణలలో ఉన్న గద్యభాగం మాత్రమే రచయితది. పాఠకులకు ఇది సంభాషణ రూపంలో ఉన్న ఎఱ్ఱాప్రగడ చరిత్రగానే తోస్తుంది. కాని నాటకంగా తోస్తుందని చెప్పలేము. పాత్రలన్నిటి సంభాషణా ఆయా పాత్రలకు తగినట్లు హుందాగా కూర్చబడింది కాని, కొన్ని పాత్రలు ఆయా గ్రంథాల లోని ఘట్టాలను చదివి వినిపించడం పురాణ పద్ధతిని తలపునకు తెస్తున్నది అది సంగ్రహంగా ఉంటే ఎంతో బాగుండేది.

ఎఱ్ఱనకు ప్రబంధపరమేశ్వరుడనుటకు కారణం అతడు పురాణకథను తీసుకుని నృసింహావతారాన్ని ప్రబంధంగా రచించడమే అనీ, నన్నెచోడుడు చాలా కథలను తన గ్రంథంగా చెప్పడంవల్ల అతని కుమారసంభవం పురాణమని చెప్పడమే సమంజసమని రచయిత అంటున్నారు. తిక్కయజ్వ ఉత్తర రామాయణాన్ని మాత్రం రచించడంవల్ల, ఎఱ్ఱన తాను మహాభారతాన్ని పూర్తిచేసినట్లుగానే, తిక్కన విడిచిన పూర్వరామాయణాన్ని ఆయన పద్ధతి లోనే నిర్వచనంగా వ్రాసినట్లూ, వచనం అర్థమయేరీతిని నిర్వచన గ్రంథం జనసామాన్యానికి అర్థం కానందున అది ప్రజాదరాన్ని పొందలేకపోయినట్లూ రచయిత అభిప్రాయపడుతున్నారు. ఎఱ్ఱాప్రెగడ రామాయణాన్ని వ్రాస్తున్నట్లు గ్రహించి, అది రావడానికి ముందే తనకు అంకితంగా సాహిణిమారుడు భాస్కరాదులచే రామాయణాన్ని రచింపజేసినట్లూ, అది మంచి ప్రచారాన్ని పొందినట్లూ వీరూహిస్తున్నారు. రంగనాథ రామాయణానికి పోటీగా భాస్కరరామాయణం వచ్చినట్లు ఒక వాడుక ప్రసిద్ధంగా ఉన్నది. వీటి సత్యాసత్యాలను పరిశోధకులే నిర్ణయించాలి. భాస్కర రామాయణముతో తిక్కనసోమయాజి దాత మంత్రి భాస్కరునకు సంబంధమున్నట్లు ప్రసిద్ధి. అతనికి సాహిణివారుడు రచింపజేసిన రామాయణంలో ఏమీ ప్రమేయం లేనట్లు ఈ దృశ్యకృతి వెల్లడి చేస్తున్నది.

రచయిత చివరి అంకంలో వీరశైవుడగు సంగమయ్యను వేమారెడ్డి సభలో ప్రవేశపెట్టి వీరశైవ మతాన్ని ఖండించడం ప్రస్తుత గ్రంథానికి అప్రస్తుతమేమో అనిపిస్తున్నది.

నాటకకర్త యిందులో వేమాలసెట్టి పాత్రను ప్రవేశపెట్టి ఆ కాలంలో ఇతర వ్యాపారాలతోపాటు పుస్తకాల వ్యాపారం కూడా సాగుతున్నట్లు వెల్లడించారు. తాటాకులు గంటాలు కొని, వ్రాస్తే వాళ్లకు తగినంత డబ్బిచ్చి, ప్రతులు వ్రాయించి వ్యాపారం చేసే వారికి ఎంత కిట్టుబడి అవుతుందో తెలియదు. పుస్తక వ్యాపారం వుంటే ఉండవచ్చునేమో! కాని అతి స్వల్పకాలంలో రామాయణం వంటి మహాగ్రంథాలకు వందలకొద్దీ ప్రతులు తయారుచేయించాడంటే వింతగానే కానవస్తుంది. మనం ఏది చెప్పినా ఆయా కాలాలకూ, పరిస్థితులకూ అతికేటట్లు ఉండడం అవసరం.

ముద్రణ విషయంలో తగినశ్రద్ధ తీసుకోలేదు. 72వ పుట చివర ''సశేషము'' అని పత్రికలలో ఉన్నట్లే ఉన్నది. తర్వాతి పుటలో ''ఎఱ్ఱాప్రెగ్గడ'' అని పెద్ద హెడ్డింగుతో 8 వ సంచిక తరువాయి — అని బ్రాకెట్లతో తెల్పి, గ్రంథం ప్రారంభించబడినది. 'పంచమాంకము' నకు బదులు 'చతుర్థాంక'మనీ, 'షష్ఠాంకము'

నకు మారుగా 'పంచమాంక' మనీ పడింది. ఇవికాక అచ్చుతప్పులు చాలా ఎక్కువగా ఉన్నవి. సమీక్షకు పంపబడిన ప్రతిలో చాలావరకు సిరాతో తప్పులు దిద్దబడినవి. మొదట నే కొంత శ్రద్ధచూపితే ఇలా తప్పులు పడిఉండవు.

కృతికర్త తొలిపలుకులతో ఈ కృతిని గురించిన్నీ, 'కృతిపతి' అనే శీర్షికలో కృతిని స్వీకరించిన కొండలరావుగారిని గురించిన్నీ తెలియజేశారు. దీనికి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆంగ్లంలో వ్రాసిన ప్రశంసా పత్రం కూడా చేర్చబడినది.

"ఆంగీరస"

## సదాశివ పంచాశిక

[రచన : శ్రీ మధునా పంతుల సత్యనారాయణశాస్త్రి. డెమ్మీసైజు 34 పుటలు, వెల 2 రూ.లు ప్రతులకు– రచయిత, త్యాగరాజనగర్, రాజమహేంద్రవరం—1.]

ఆంధ్ర సాహితీలోకంలో మధునాపంతుల వారిని ఎరగని వారెవ్వరూ ఉండరు ఈయన ఆధునిక కవుల్లో ఉత్తమ శ్రేణికి చెందినవారు. తెలుగు వాఙ్మయంలోని వివిధ ప్రక్రియలలో వీరు రచనలు సాగించారు ఆంధ్రుల చరిత్ర గ్రంథమైన 'ఆంధ్ర పురాణాన్ని' వ్రాశారు. 19వ శతాబ్దిలోని ఆంధ్రరచయితల సంగ్రహ చరిత్రను సంతరించారు. ఖండకావ్యాలను కూర్చారు. సంస్కృత నాటకాలను తర్జుమా చేశారు. నవలలు లిఖించారు. సమీక్షలు వ్రాశారు. అంతతో తృప్తిపడక పరిశ్రమించి అన్ని దర్శనాల తత్త్వాలనూ ఆకళింపుకొని యిదివరకే మధుసూదన సరస్వతి షడ్దర్శనసంగ్రహాన్ని సమీక్షాత్మకంగా వ్రాశారు. ఇప్పుడు "సదాశివ పంచాశిక" అనే పేరుతో సర్వదర్శన సిద్ధాంతాలనూ సూత్ర ప్రాయంగా ఏభై పద్యాలలో వివరించారు. సదాశివునియందు ఈయ నకు అపారభక్తి ఉన్నట్లు —

"లేఁడని కొందఱున్ గలఁడు
లేఁడని కొందఱుఁ గొందఱెంచి యు
న్నాఁడని పల్కునట్టి కథ
నంబులలో రుచిభేదపక్కిఁ జూ
ఱాడుచు నొక్క దివ్య రస
మై పసినవ్వులు వెల్వరించు చు
న్నాఁడవ యో త్రికాల కల
నావరణీయకరా ! జటాధరా !" (6)

మున్నగు పద్యాలవల్ల తెలుస్తున్నది.

ఇందులో చార్వాకం, బౌద్ధం, అద్వైతం, రామానుజం, మాధ్వం, పాశుపతం, శైవం, ప్రత్యభిజ్ఞ, రసేశ్వరం, జైమినీయం, గౌతమీయం, కాణాదం, సాంఖ్యం, పాతంజలం, పాణినీయం, శాంకరం అనే షోడశ దర్శనాలను గురించి ఉన్నది.

ఈ దర్శనాలను గురించి సులభమైన పద్ధతిలో వచనంగా వ్రాసినా అందరికీ బోధపడడం ఎంతో కష్టం సూత్రప్రాయంగా పద్యాలలో వీటిని గురించి చెప్తే అర్థం కావడం మరీ కష్టం. ఈ విషయాన్ని గ్రహించే రచయిత సర్వ దర్శనాలనూ బాగుగా అవలోడన చేసిన తత్త్వాభిజ్ఞులు, దర్శనాచార్య బిరుదాంకితులు జమ్ముల మడక — మాధవ రామశర్మగారిచేత దీనికి 'భావోపహార' మనే వివరణను వ్రాయించి, మూలంతో చేర్చి ప్రకటించారు. మధునా పంతుల వారి పద్యరూప దర్శన సూత్రాలకు మా శర్మ గారి భావోపహారం భాష్యం వంటిది. దర్శనతత్త్వ జిజ్ఞాసువులకు అది ఎంతో ఉపయుక్తమైనది.

సూత్రాలకు భాష్యం ఉన్నా, అది కొంత ప్రౌఢంగానే ఉండడంవల్ల దానికిన్నీ వ్యాఖ్యానం అవసరం ఇది అందరికీ తెలిసిన విషయమే. ఏ తద్గ్రంథ భాష్యకారులు ఆయా మతాల తత్త్వాన్ని విపులంగా వివరించారు. మొదట దానిని చదివి, అవగాహన చేసుకొన్న పిదప మధునా పంతుల వారి పద్యాలను చదివితే కొంత అర్థమవుతాయి. మా శర్మగారి భావోపహారం అవగాహన చేసుకో కుండా పద్యాలను అర్థం చేసుకోవడం కష్టం.

సూత్రప్రాయమైన ఈ గ్రంథం దురవగాహమైనది కనుక యిందులోని పద్యాలకు తాత్పర్యం కూడా ఇచ్చినట్లయితే సామాన్య పాఠకులను కూడా ఇది మిక్కిలి ఆకర్షించగలిగి ఉండేది.

షోడశ దర్శనాలలోని ప్రధానాంశాలను పద్యాలలో ఇమిడ్చి ఈ గ్రంథాన్ని రచించిన విద్వత్కవి సతంసులు మధునా పంతుల వారూ, ఏ తద్దర్శన సూత్ర భాష్యకారులు మహోపాధ్యాయ, దర్శనాచార్య మాధవ రామశర్మ గారూ మిక్కిలి అభినందనీయులు.

*శ్రీ బులుసు వేంకటరమణయ్య*

## "దేశదేశాల కథలు"

[అనువాదకులు : గాదంశెట్టి శ్రీరాములు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సహాయముతో ప్రచురితము. మూల్యము : రూ.5—00.]

"ఈ దేశదేశాల కథలు" లో అయిదు దేశాలకు చెందిన పదిహేడు కథలున్నాయి. అన్ని భాషల కథలనూ తెనుగించడంలో రచయిత గాదంశెట్టి శ్రీరాములు చక్కని శ్రద్ధ వహించారు అనువాదమవడం వల్ల తెనుగు సంప్రదాయానికి కొన్నిచోట్ల విరుద్ధశైలి కనుపిస్తుంది. ఇది న్యాయమే.

ఎన్నుకున్న కథలన్నీ కూడా బాగున్నాయి. గుజరాతీ రచయిత భగవతీ కుమార్ శర్మ వ్రాసిన "ఏది సంస్కారం" కథలో విదేశీ యుని కోసం తన దేశ, కుల సంస్కారాలను బయటవేసి, అసభ్యం పాలు కాకూడదని తాపత్రయపడతాడు వినాయక్ వేదాలను కంఠస్థం చేసిన తన తండ్రిని కాస్సేపాగోల ఆపమంటాడు. తీరా ఆ విదేశీయుడు వచ్చి భారత సంస్కృతిని, సంస్కారాన్ని పొగిడి,

సామవేదం మీద తనకున్న మక్కువను వెల్లడించి, వేదాలను అనర్గళంగా ఉచ్చరించి పాడగలిగే విద్వాంసుని తాను మళ్ళీ కలుసుకో గలిగితే తన భారతదేశ పర్యటన సార్థకమైనట్లేనంటాడు. తన తండ్రి ఆ విదేశీయుని ఆశ, ఆశయం నేరవేర్చగలిగినవాడు పశ్చాత్తాపంతో కుమిలినా, వినాయక్ ఆ విషయం చెప్పలేకపోతాడు.

ఇందులో కథలన్నీ లోగడ అనేక పత్రికలలో వచ్చినవేనట.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సహాయముతో ప్రచురింపబడిన యీ పుస్తకం వెల అయిదు రూపాయలు. ప్రతులు కావల్సినవారు : జి గోవిందలక్ష్మి, తూర్పు బ్రాహ్మణవీధి, 44/20ఎ గూడూరుకు వ్రాయాలట.

— ఫాలాక్షుడు

## 1. ఆరుబయట అరుణోదయం [కవిత]

[—విరియాల లక్ష్మీపతి. డెమ్మి 1/12 (ఈ సైజు నేటి కవిత ముద్రణానికి ఎత్తినట్లు సరిపోతున్నది. పేజీ వేస్టు కావడం లేదు. ఈ పుస్తకానికి కుట్టుతట్టు ఇంకా 3 ఎమ్ము చోటువదలితే బాగుంటుంది) 126 పేజీలు; వెల రు 4–50; ప్రతులకు – కళాకేళి ప్రచురణలు, పిఠాపురం–533450.]

ఒక్కరొట్టెతోనే మానవుడు బ్రతుకడు. బ్రతుకుదెరువుకు చలువ పందిళ్ళు బెట్టి, కంటికి ఇంపు, ఎదకు హాయినిగూర్చే ఫల పుష్పభారకుంచితాలైన వనవాటికలను పెంచి, భూతల జీవిత భారాన్ని తగ్గించి ఆనందమయంగా చేసేది-లలిత కళల ! ఇవి లేని జీవనపథంలో పల్లేరుకంపల పచ్చపూలతోనే మనుజ శరీరుడు తృప్తిపడవలసి ఉంటుంది.

ఈ కవి, విశాఖ నౌకాశ్రయంలో ఇంజనీరింగు శాఖలో పని చేస్తూ, చదువుల రాణికి జంటరూపాలైన సంగీత సాహిత్యాలను ఉపాసించడం ఒక అదృష్టం. అందులో వీణపై సాధన అపూర్వ మైనది. ఈ కవికి శహనరాగం ప్రీతట! ఈ మాటతోగూడ, ఆ సంగీతమూర్తి — పల్లడం సంజీవరావు వేణువుతో పలికించిన "గిరిపై నెలకొన్న" కృతి జ్ఞాపకానికి వచ్చి, ఒక సొక్కును మాకూ పుట్టించినది. అందువల్లనే ఈ కవి ప్రకృతి రహస్యాలకు, సౌందర్యాలకు ముగ్ధుడై సంగీత మూర్ఛనా మధురమైన భాషలో గానంచేస్తున్నాడు.

రామభూషణునికి సంగీత మెట్లా ద్వితీయ ప్రకృతో, ఈ యువకవికిగూడ అది ఒక ఊర్పుగా ఉన్నది. సహజ మధుర గంభీర భావుకతకు ప్రాణం పోసే భాష ఈయనది. విస్పష్టతా గుణంతో తెనుగు సంస్కృతాలు, బలిసి కారెలు దిరిగిన జోడెద్దుల వలె నడుస్తున్నవి.

"సాగరిక"లో విశాఖ యాంత్రిక పారిశ్రామిక సౌభాగ్యాన్ని వర్ణించి; "కార్మికులకు కర్మవీరులకు లోటు రానీయదు" అని

జ్యోతిర్మయ దృశ్యాన్ని చూపుతున్నాడు. ''ఏగుమతి అయ్యే ప్రతి రాయి ఒక రహస్యాన్ని చెపుతున్నది'' అని, షేక్స్ పియర్ మహాకవి వలె రాళ్లనుండి ఉపదేశ వాక్యాల గ్రహిస్తున్నాడు. కాబట్టే డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి ఎప్పుడో విశాఖను ''The city of Destiny'' అన్నారు.

తేరిన మనస్సుగల ఈ రచయితకు ''యంత్ర సౌందర్యం నుండి ఎప్పుడూ ఒక నవజీవన రసవత్తర కావ్యం ఆవిర్భవిస్తుంటుంది.'' ఇంకా ''నాగరికత, గరిక గూడా కప్పని వివస్త్రగా తిరుగుతోంది'' అని నేటి పచ్చినాగరకతకు అలమటిస్తున్నాడు. వర్ణనలలో వాస్తవికత వెల్లడిస్తాడు. హృదయాహ్లాదకారులైన కొన్ని నుడికారాలు: పిండి పిండిగా రాలిన వెన్నెలముగ్గు — మురళీనాదం దిగంతాల వైపు సుళ్ల తిరుగుతోంది — చినికి చినికి ఈర్ష్య కుండపోతగా కురిసింది — రా సు క పో యా యి జ్ఞాపకాలు — అష్టదిక్కులా మురిసిన సంధ్యారుణ రోచిస్సులు — చలత్ చలిత హర్షము — జాతి వసంత కేతన మెత్తిన శుభోత్సవ లిప్తలు — జుట్లు విరబోసుకుని తలవాల్చుకొన్న చెట్లు — ప్రతి ఒక్క గడ్డిపరకా ఒక్కొక్క బాలార్కుని కంటున్నది (నీటిబొట్ల వల్ల కదూ ? ఎంతటి చక్కటి భావం.?) ఇక్కడ పశ్చిమాద్రి ఎక్కడికో పూర్వాద్రి - అన్నది శ్రీనాథుని ''ఒక దీవికే కొండ ఉదయాద్రియైయుండు, అది నొండ దీవికి పశ్చిమశిఖరి'' అన్న కాశీఖండ పద్యం మనసుకు వస్తున్నది.

సరే! ''ఘంటాపథం''లో ఒక మిత్రుని గూర్చి ముఖారి జంజూటి అసావేరిలో ఆక్రందించినావే, ఆయన ఊరు పేరు చెప్పవేమి? ఈ పులుముడేలనయ్యా. వెనుదింగిడం తిరోగమనం కాదు, పెద్దలను అడిగిచూడు.

ఇక సోమసుందరం వ్రాసిన దీర్ఘ ఉపోద్ఘాతం ఎన్నదగి ఉన్నది. ఈయన నవ్యాంగ్ల సాహిత్య సాగరాన్ని పురిసిట బట్టిన అగస్త్యుడుగా కనుబడుతాడు. ఈయన అంటే — శివశంకర స్వామి పాత సాహితీ సమితి గమనానికి వస్తారు. విశ్వనాథం వారు ఉపోద్ఘాతాలు పనిలేదంటూరు; ఆయన కొన వెర్రిమాటలకేమి గాని, ఈ పరిచయ వాక్యాలు అవసరం. ఇది లేనిదే అర్థం చేసుకోలేని సమీక్షకులపై ఈయన మంచి విసరే విసరినాడు. అట్టి చూచే ఆ పుస్తకంపైన అనర్గళంగా ఆరుగంటలు మాట్లాడేవారు గదా మన వీరాంధ్రులు! ఈమాట కొంత అన్ ఛారిటబుల్ అయినా, అందరినీ ఒకే గాట కట్టివేయవద్దంటూ. కవిగాని వీని వ్రాత వ్యర్థమన్నది గదా సుమతి శతకం; కవి అంటే వ్రాయ నేర్చిన వాడని తీసుకొందాం. కవిత్వాన్ని గురించి మంచి వివరణం ఇచ్చి విరసం వారి గావు కేకలను బాగా విమర్శించినాడు. ఎంతటి వ్యావహారిక భాషావాదులైన భావాలకు తగినట్లు భాషను మలచుకోవాలన్నది ఏనాటికీ చెలామణి అయ్యే సత్యం. తిక్కన స్థానిక భాషనే వాడినాడని వీరు అనడం సత్యప్రియతను తెలుపుతున్నది. దీనితోనే ఆ కవిబ్రహ్మ ఆంధ్రావళికి మోదం గూర్చినాడని, నేను ఎప్పటి నుండో వాదిస్తున్నా. ఉత్తరాది వారు — తిక్కన నెల్లూరు తెలుగు బెట్టి భారతం పాడుచేసినాడు అన్నారట; దానికి వేదం వెంకటరాయ శాస్త్రి ''కాదు కాదు — అది పాడుగాదు, గుడికట్టి పాడిచేసినారు'' అని చమత్కరించినారు.

మీరూ ఆరు బయటకు వచ్చి ఈ అరుణోదయ శోభకు ఆనందించండి.

## 2. విభావరి (అనిబద్ధకవితా ఖండికలు)

[పి. హనుమయ్య డెమ్మి 1/8 — 96 పేజీలు; వెల రు. 10/; ప్రతులకు: వావిలాల సుబ్బారావు, ఎం.ఏ; అమరావతి, గుంటూరు జిల్లా.]

కవి - ఎం. ఏ.; పరిచయ వాక్యాలు వ్రాసిన పెద్దలూ తెలుగు మేస్టార్లు! వీరు తెనుగు భాషామతల్లిని ఖూనీ చేస్తూంటే చూస్తూ ఊరకుండవలసి వస్తున్నది. ఈ రచయిత ''పిచ్చివాని డెయిరీ'' అన రచనలలో ఒకటిగా పేర్కొంటున్నాడు. ఇది పాలు పెరుగు వెన్నదీసే చోటా ఏమి? లేక దిన చర్యను గూర్చి చెప్పి నట్లయితే ఈ పదం డైరీ కావాల. ఇట్లనే ఆంధ్రులు ఏర్ అనుటను ఎయిర్ అంటారు. చర్చిల్ బ్రతికి ఉంటే, బ్రిటిషు సామ్రాజ్య విచ్ఛితికంటె, తన భాష ఇట్లా మర్డర్ కావడం చూచి, అరచి చచ్చేవాడు. వావిలాల మేస్టారు శ్మశానాన్ని స్మశానం, సొంతాన్ని స్వంతం, తిరోగామి అంటాడు ఇక ఈయన విద్యార్థుల స్థాయి ఎట్లుంటుందో! డాక్టర్ పరుచూరు భీభత్సం అని, అన్నిటికీ ఘాటుగా ఒత్తు తగిలిస్తాడు. సో మంచివారు. ప్రియురాలిని నగ్నంగా చూచే తత్త్వం (రెండో త కు తావత్తులేదు) ఈ కవిది అంటాను. దిసమొలగా చూడడం రసికత కావచ్చునేమో గాని, సభ్యత మాత్రం కాదు. ఈ వ్రాతకాని భావం ఈ నగ్నత కాదేమో!

కవి — ''శ్రీమంతులు కుడిచే మృష్టాన్నం ప్రతి ముద్దా అన్నార్తుల చూపులతో మలినపడినదే'' అంటాడు భాష బాగున్నది గాని, భావం కారగ్గవ సరకు. కారుణ్యం మంచిదేగాని, ఈయన ఎందరు అన్నార్తులకు గోరుముద్దలు అందిస్తున్నారు? ''పాకీవాడికి పన్నీటి స్నానం పట్టువస్త్రాలు అందించాలనే నైసర్గిక న్యాయాని కింకా నాలుక మొలవలేదు'' అన్న నుడికారం ఎంత సొంపుగా ఉన్నదో, భావం అంత బూటకంగా ఉన్నది. మనవారికి ఆదర్శమైన రష్యా పాకీవారిని గొజ్జగి పన్నీట తిరుమంజనం చేయిస్తున్నదా? ఇదంతా ''ఉటోపియా'' వాదం; ఆచరణ యోగ్యంగాని పరిపాటి మాటలు.

''నా కవిత్వానికి నడకలేదన్న'' దానిలో భావమేమిటి? పల్నాటి వీరులను గురించి చెప్పినది రసస్ఫూర్తి కలిగి ఉన్నది. ''క్రీస్తుస్వామి సిలువమీద ఎన్నేళ్లున్నా'' అంటాడు; ఆయనకు పునరుత్థానం జరిగింది మూడవనాడే గదా! రాతిమీద పువ్వు చెక్కి ప్రాణం పోసిన శిల్పినిగూర్చి చక్కటి భావం వెల్లడించినాడు.

''ఆరడుగుల వెడల్పైన కాడ పరచుకుని ఉన్నవాడికి'' అన్న నుడికారం బాగున్నది. ఇట్టి మంచి భాషభావం అక్కడక్కడా తొంగి చూస్తూ ఆనందాన్ని కూరుస్తున్నవి.

## 3. వెన్నెల కుప్పలు (కవితా సంపుటి)

[—దిలావర్. క్రౌన్ 1/16 48 పేజీలు; ధర రు 3/– ప్రాప్తిస్థానం : సమతా ప్రచురణలు; వనంవారి కృష్ణాపురం; వయా—గోకినపల్లి; ఖమ్మంజిల్లా—507158.]

ఈ రచనలో విశేషం — ఒక ముస్లిం సారస్వత ప్రియుడు, ఆంధ్రభారతిని సేవించి, అమృతాక్షర వికాసమైన కవితను వరంగా పొందడమే! భావ శబలత మనోజ్ఞము — సహజ సౌభాగ్య సుగంధితము తెనుగు తేనె పారించి, సంస్కృతాన్ని చారుగంభీరంగా నడిపి, నవ్యరుచిర పదబంధాలతో సొంపు వాటింపజేస్తున్నాడు. భావము భాష ఒక నవ్యసుకుమారతతో ''సరస కవితా సరిత్తరణం చేస్తున్నది.'' అందువల్లనే ఈ కవి ''అరాచకత్వంపై ఇచ్ఛలేని మరో మధుర మంజుల సాహితీసీమంతిని కోసం, రసవచ్చైతన్యం కోసం అన్వేషిస్తున్నాడు.''

తెలుగు ముద్దబంతి పొరల్లోని ఆర్తి—సస్యాలిపై మంచు ముత్యాల సొంపు—కళ్లలో విషాదపు ఊటలు—ఎదలో రగిలే కష్టాల నెగళ్లు—చెలిమి వల్లూలారగిస్తూ — చీకటి గమిళ్లు తెరచుకొన్న—సంజ కెంజాయ లేజెక్కులకో కుంకుమపత్రభంగాలు దిద్దాలని, ఏ హృదయ విదారిత సౌందర్యనభాంకురాలకో క్రొన్నెత్తుటి గోరంటాకు అద్దాలని — పుడమితల్లి కడుపుపంట పచ్చదనం — ధనపిశాచాల మాయాకౌగిలింతలు—స్వాప్నిక విద్యుత్సౌధ ప్రాంగణం చలనమే గాని హృదయంలేని కాలం — ఇట్లా, రాయప్రోలు రామిరెడ్డి, జాషువాల కమ్మటి నుడికారంతో రచనంతా చవులూరిస్తున్నది.

తన ఉపాధ్యాయవృత్తిని ''సమాజానికి విద్యాభిక్ష పెడుతున్నది'' అని సగర్వంగా చాటుకొంటున్నాడు. ''గుండెలోనుంచి అతృప్తిని తీసివేస్తే శేషం స్వర్గం'' అనగలిగిన సంస్కారిత హృదయం — ఈ బడిపంతులిది సూఫీవాసనలు గూడ ఒంటబట్టినట్లున్నది. ''మనసులో ఎన్నో ఊహల పూవుల పూయించుకోమని'' కోరుతున్నా.

ఆ మధురకవి — మహమ్మదల్లీకిచ్చిన అంకితాన్ని ఆయన నిజసహజ కవితాశిల్పశోభిత పద్యాలతో స్వీకరిస్తున్నాడు. ఇదే చదువుకొన్నవారి సరసత? బ్లాక్‌మనీకి—నల్లలచ్చి అన్న తెనుగు పేరు బాగున్నది.

## 4. ప్రశ్నే ప్రగతి (రచనల రాణి)

[—రణధీర్. క్రౌన్ 1/16 — 80 పొరటలు; మూల్యం రు. 3/– ప్రతులకు : రణధీర్, నవయుగ బుక్‌హౌస్, సుల్తాన్ బజారు, హైదరాబాద్—500 001]

ప్రశ్నేప్రగతి — ఔను! ప్రశ్నించడం ఒక విశేష ప్రజ్ఞ అన్నారు... అందుకనే ప్రశ్నపాటవం అని అడగటాన్ని గద్దెపై కూర్చుండబెట్టినారు — చెప్పదంటు ప్రశ్నల సంగతిగదిది. ప్రగతినేగాదు విజ్ఞానాన్ని వెలికితీయగలగిన ప్రశ్నలు గొప్పవి. తీరని జిజ్ఞాసాపరుడే ప్రశ్నలు వేయగలడు. ప్రశ్నోత్తర రూపమేగదా మన ఉపనిషత్తుల విజ్ఞానభాండారమంతా! కేన—ఎవరివల్ల? అన్నపేరుతోనే ఒక ఉపనిషత్తు ఉన్నది. ఈ యువకుడు మంచి ఆయువుపట్టునే పట్టినాడు.

''కావాలని కూర్చోనిరాసే కవితేం కవితోయ్'' అని అర్థం లేని ఆవేశంతో అంటాడు సుఖదుఃఖాల రెండింటి అనుభూతి గూడ రసావేశాన్ని — అంటే రసస్ఫూర్తి కలిగిన కవిత్వాన్ని పుట్టిస్తవని ఈ కోవవారు గుర్తించాలి. ఇందలి సరకు మామూలుదైనా, బహువిధ సమస్యలను, కాలగతులను మర్మంలేకుండా విమర్శించినాడు బాగున్నదిగాని, భాషమాత్రం గ్రామ్యం గ్రాంధికాల మధ్య ఎగుడు దిగుడుగా, పాఠకుని కుదిరించివేస్తున్నది; ఒక స్టాండర్డును ఈ కవి నిలదొక్కుకోవాల. డ్యాడి, మమ్మి—కృత్రిమ నాగరకతను బాగా నూకులు పెట్టినాడు.

ఇందు ఎక్కువ భాగం చిన్న చిన్న తునకలు. ఈ లోకవృత్తవిమర్శన, భాష కుదుటబడితే ముమ్ముందు బాగు డగలదు. ఈ యువకునికి సాహితీ పరుడుగా మంచి భవిష్యత్తు ఉన్నది మొట్ట మొదట ఎగుపొగరుకు కళ్లెం వేయాల.

## 5. ముత్యాల గొడుగు (బాలల సాహిత్యం)

[మిరియాల రామకృష్ణ. డెమ్మి 1/8 — 38 పేజీలు, వెల రు. 3–60; ప్రతులకు - మిరియాల లక్ష్మీదేవి, 10–4–23 రామారావుపేట, కాకినాడ — 4.]

బాల సాహిత్యం తెనుగులో నిన్న మొన్నటి వరకు అరుదు. విశ్వకోశము దగిన — పుదూరు సీతారామశాస్త్రి పెద్ద బాలశిక్ష మనకు ఎన్నదగిన బాలశిక్ష. ఇటీవల చాలా మాస పత్రికలు బాలలకని వెలవడి, వ్యాప్తికి వచ్చి ఉన్నవి. పిల్లకాయల పేరుతో కొని పెద్దలే వీటిని ఎక్కువగా చదువుతున్నారు. అదీ మన చదువుల మట్టం!

ఈ ముత్యాల గొడుగు పాటలతో బాల బాలికలకు చరిత్ర ఇతర విజ్ఞాన విషయాలు గరపుతున్నది. ''మబ్బు విమానం ఎక్కివ చంద్రుడి మాట మంతి విన్నాను'' అని, శిశు ప్రవృత్తికి రుచిని కలిగించే విషయాలు చాలా చెప్పి ఉన్నారు. 'నిన్న కనిపించారు'' అన్న గీతంలో ఆంధ్ర భారత కర్తలను పిల్లల మదికెక్కునట్లు పాడినాడు ''వెన్నెలలు'' పిల్లలకు చక్కని గింతలు బెట్టి నవ్విస్తున్నది. ''బొమ్మలు'' మేఘాలు ధరించే వివిధ విచిత్ర రూపాలను (వీటిని గంధర్వ నగరాలంటారు) మనోరంజకంగా చెప్పినాడు. ''చివురాకుల తిండి''లో కోకిలను గూర్చి, కవి సమయపు పుక్కటి పురాణాన్ని గాక, అది ఋతువును బట్టి ఉనికి

మార్పే సత్యాన్ని బిడ్డలకు శాస్త్రయుక్తంగా చెప్పినాడు. ఇట్టి శాస్త్రదృష్టి బిడ్డలకు మొదటనే గరపటం అవసరం.

## 6. ముక్తధార (కవితా సంపుటి)

[బులుసు వెంకటసుబ్బారావు. డెమ్మి 1/8–80 పుటలు; **మూల్యం** రు. 5/– ప్రతులకు – స్పందన సాహితీ సమాఖ్య – బుట్టయ్యపేట, మచిలీపట్నం – 521 001 ]

మరుభూమిలో ఒక శాద్వల ప్రదేశాన్ని ఒక మంచినీటి పడియనుచూచి ఆనందించే తెరువరివలె, ఈ ఇన్‌కంట్యాక్సు పెద్ద ఆఫీసరుకు, లెక్కలనే రాళ్ళచేలో, ఈ కవితారాధనం ఒక ప్రీతికర వ్యాసంగం.

ఈయనది ఆధ్యాత్మిక చింత నాయత్తచిత్తం; కాబట్టే "భావబలమున స్వర్గంబు బడయువచ్చు, భావశూన్యత నరకంబు పరిఢవిల్లు" అని తన తత్వాన్ని తనలోనే వెదకుకోగలగుతున్నాడు. మంచిచెడ్డలు ఓతప్రోతం (పడుగుపేక)గా ఉన్న మానవజీవిత వసనాన్ని నేయడం తనవంతేనంటాడు. గుణాలు స్ఫటికంలో భిన్న వర్ణాలుగా భాసించినట్లు – అనడం మంచి మాట భగాతల జీవనానికి సర్వేశ్వరుడు కర్త అని, ఆ శుద్ధబ్రహ్మని పక్షపాతి చేసినాడు. మన వేదాంతమూలకందమైన కర్మవాదం ఈయనకు అంతగా నచ్చినట్లులేదు; ప్రారబ్ధం పురుషకారానికి మించినది అని ప్పుకోరేమో! ఆ డాల్టన్ వాదమేమిటో స్పష్టంగా లేదు.

"మనము మనుటకు సర్వము మట్టి యిచ్చు, మట్టిలేకున్న మనమెట్లుమనుట జరుగు" అని భూతలాన్ని వాస్తవిక దృష్టితో మాన్యపరుస్తున్నాడు.

ఈయన సాంప్రదాయిక కవితా రీతుల మెచ్చువాడు. భావం భాష ఆ త్రోవన నడచినవి మానవుడు మాధవుని ఎరుగాలని ఆకాంక్షిస్తున్నాడు. కవిత్వం ఆత్మోన్నతిప్రదమని నమ్మి, కవితను శుద్ధంగా, ధారావాహికంగా నడిపించినాడు. రచనకు శిల్పగుణం ఇంకా ఎక్కువగా అలవడితే ఎన్నదగిన కవి అవుతాడు.

## 1. అభ్యుదయ తోరణాలు (కవితలు)

[వంగల రంగాచార్యులు, క్రౌన్ 1/16–36; వెల రు2/– ప్రతులకు ; గ్రంథకర్త, 1 గ్రేడ్ లైబ్రేరియన్; జిల్లా కేంద్ర గ్రంథాలయం, నల్లగొండ–508001]

మొదట ఈ రచయిత సత్యసంధతకు నమోవాకాలు. ఎవరి పద్యమో తనదిగా చదివి, పరితపించి, మనసును శుభ్రపరచుకొని, కవి అయినవాడు.

కరపత్రాలంతటి పుస్తకాలను, ఒక బంతిని పదిగా విరచి చీల్చి, అమ్మవేసి, కాగితాన్ని వేస్టుచేసి ప్రచురించడం ఇప్పటి వాలాయంకాదు, ఫ్యాషన్ అయినది. కంటికి చేతికి తగిలే పుస్తకాలే రావడం మంచిదనుకొంటా

రచయితకు వక్రోక్తి హాస్యం ప్రీతి. భాషలో బిగువులేక, భావంలో స్పష్టత లేక వ్రాత నీరసించి ఉన్నది. కొన్నిచోట్ల, అర్థంలేని పులుముడు. "చేవగల రచన చేసేవాడే రచయిత" అని, దాశరథి–ఆస్థానకవిగా, ఈ పుస్తకంలో అభిప్రాయమిస్తున్నాడు; నిజమైన నిర్వచనం గదా ఇది !

మొదటి ఖండికలో "కావ్ కావ్, కావు నేటి రచనలు మహోత్కృష్ట ఆలోచనలు" అంటూనే, ఐదోలైనులో ఇవి అభ్యుదయ తోరణాలు అని స్వవచన వ్యాఘాతం చేసుకొంటున్నాడు కాదంటే – వ్యక్తీకరణశక్తి ఇంకా కుదుటబడలేదనాల. నీ తోబుట్టువులవలెనే అన్యకాంతలను చూడు (సంస్కారం) అన్నది నిజంగా హృదయ సంస్కారం. "కన్నుదోయికి యన్యకాంత లడ్డంబైన మాతృభావము జేసి మరలినవాడు" గదా ప్రహ్లాదుడు.

వివిధ సమస్యలమీద చిల్లర విషయాలమీద మామూలు మాటలు చెప్పినాడు. మాటలు విరిచి వేరే అర్థం చెప్పడం (పన్) ఈయనకు మహా ఇష్టం. సర్వేజనా అంటే జనాన్ని సర్వేచేసే వాళ్ళు, అనగా ఒళ్ళు తవిడేవాళ్ళు అని మంచి శ్లేష చేసినాడు దీనిపై ఇంకోక ఛలోక్తి ఉన్నది – "సర్వేజనానికే సుఖమైతే రెవెన్యూవాళ్ల గతి ఏమి ?" అన్నాడట ఎన్నికలు అన్నదానికి ఎన్ని కలలు అన్న విరుపు బాగున్నది. అర్థశాస్త్రాన్ని సగం శాస్త్రమని గేలిచేస్తాడు కాని, సగమని అర్థమిచ్చేమాట అర్ధంగాని అర్థం గాదు..., ఈ భేదాలను శ్లేషలో అంతగా లెక్కబెట్టవద్దన్నారు లేండి. కార్యానిజం మాట ఎత్తకుంటే అభ్యుదయ రచయిత కాడేమో అన్న భయంతో కాబోలు "ఒక్క భూస్వామిని నాగలి పట్టమను" అంటాడు. ఈ రచయిత లైబ్రేరియన్ పని వదలి, ప్యూన్‌పని చేస్తాడా ? కర్మవిభాగమేగదా సంఘరథానికి, దాని గతికి మూలము.

## 2. రాత్రి

[—కె. ఎస్వీ క్రౌన్ 1/16 – 48; ధర రు 3/–; ప్రతులకు : ఓరియంట్ పబ్లికేషన్సు; 266 మర్రిమాను వీధి; తిరుపతి–1]

పొందిక పొత్తు కుదరని వ్రాత ఇదంతా. మంద బుద్ధిని నాకు అర్థం కాలేదేమో అని, దీని భావాన్ని తిరుమలేశునే (కవి తిరుపతి వాడు కాబట్టి) అడుగుతున్నా. "పది రాత్రులు మేల్కొని ప్రకృతితో మాట్లాడిన వాడెవడూ పరులను ద్వేషించలేడు" అన్నది ఆణి ముత్యం. ఇంకొకటి – కోటి కోట్ల మందిలోనూ తన్ను మనసు ఒక్కదానికే, మరి దేనికీ చెలామణి ఉండకూడదు –" అన్న భావం బాగున్నది గాని, వివరణలో స్పష్టతలేదు.

చాలా విషయాలమీద (శీర్షికలు లేకుండా) వ్రాసినాడు. అభ్యుదయ సూచకంగా పనిబాటల వారి చెమట గూడా ఉన్నది. కాని, రచనలో బిగువు, లోతులేవు; నీళ్లమీద పాచిమాదిరి తేలిపోతున్నది. అయినా, ఈయన పట్టుబట్టి ప్రయత్నిస్తే మంచి

వ్రాత బయటబడగలదన్న సూచనలు పుస్తకం ఎలపాన కనబడుతున్నవి. తెనుగు నుడికారాన్ని చక్కదిద్దుకోవాలి. ఇసుక మైదానం— ఇది ఎడారి; కన్నీటితో ఆనంద బాష్పాలతో అంటాడు; దుఃఖానికైనా సంతోషానికైనా కారేవి కన్నీళ్లే.

## 3. పడమర గాలి

[పండిత కర్ల వీరనాగేశ్వర కవి. క్రౌన్ 1/16–44; వెల 150 పైసలు; కాపీలకు — డాక్టర్ కె. రాజాశేషగిరిరావు; హిందీ శాఖ; ఆంధ్ర విశ్వవిద్యాలయము; వాల్తేరు.]

సాహిత్య చక్రవర్తి — విద్యావాగీశ — మహామహోపాధ్యాయ వ్రాసిన దానిలో చాలా గొప్ప సంగతులు బయటపడతవని ఆశపడినా. కాని, ఒక వర్గం వారి పాతపాటే అంతా. భారతీయమైనది — చీపురుపుల్ల గూడ అన్యదేశాల మాణిక్యాల కంటె శ్రేష్ఠమైనది — అన్న బూజుపట్టిన పిడివాదపు సరుకీపుస్తకమంతా.

పడమరగాలి అంటే — పాశ్చాత్య ప్రాబల్యమని అర్థమౌతున్నది. ఇంగ్లీషు వల్లనే మనం అన్ని విధాల చెడినామని, హిందీ ఆవేశుల వాదం చేసి, నేటి నాగరకాంశాలను ప్రతి దానిని త్రోసి పుచ్చుతాడు నేడు భారతదేశమంతా ప్రతి విషయంలో కారు చీకట్లు కమ్ముకొని ఉన్నట్లు ఈ పండితుని భావన; ఒక్క మిణుగురు బూచి అయినా కనబడదు. ఇది గడ్డగట్టిన నిరాశావాదం — అతి అసహించుకొనే ఆర్షాభిమానం. సత్యం మొదలు స్వార్థం వరకు వర్ణింపబడి ఉన్నది. ఆంధ్ర భాషాభిమానం మాయమైనదంటాడు; ప్రపంచ తెనుగు మహాసభల జరిపిన ప్రభుత్వం ఒప్పుకొంటుందా? దైవభక్తి పూర్తిగా నశించినదని ఈయన వగపు; వేలాదిగా వచ్చే భక్తులచేత మ్రొక్కులందే తిరుమల వెంకయ్య అంగీకరిస్తాడా? అమరవాణిపై మమకారం మంచిదే గాని, ఇప్పుడు సంస్కృతాన్ని ఉపేక్షించేవారు శేరే! మూఢ విశ్వాసం అనలేము గాని, ఈ పండితుడు పాతవాసనలవాడని మాత్రం అనక తప్పదు. బ్రాహ్మణ శబ్ద నిర్వచనం సహేతుకంగా, సర్వజనామోదకరంగా ఉన్నది. అహింసను బోధించిన ఏసు శిష్యులే నేడు యుద్ధదాహంతో మారణ యంత్రాలు పోగుజేస్తున్నారన్న ఎత్తిపొడుపు ఘాటుగా ఉన్నది.

సంస్కృతము పాశ్చాత్యులను గురించి మనమెంత చెప్పకొన్నా తనివిదీరదు, ఆ దొరల ఋణం దీరదు. విలియం జోన్సు, మాక్సుమూలరు. శిధిలావస్థలో నుండిన సంస్కృతాన్ని కనుగొని, ఉద్ధరించి గ్రంథాలు ముద్రించకుండా ఉండి ఉంటే ఆ దేవభాష రామబాణాలపాలై నామరూపాలు లేకుండాపొయ్యేది. మిషనరీలు దేశభాషలను ఉద్ధరించినారు; ముద్రణాలయాల దెచ్చి ఆ భాషా జ్యోతులు ఆరిపోకుండా వెలిగించినారు. బ్రౌను తెనుగుకు చేసిన సేవను తలచుకోకుంటే పాపం చుట్టుకొంటుంది. కాబట్టి పడమటివారు చేసిందంతా తప్పనటం బాగాలేదు. పడమర గాలి వడదెబ్బగొట్టినా, తొలకరి మబ్బులను మోసుకొని వస్తున్నదిగదా!

ఈ రచనలో అనవసర ఆవేశంవల్ల భావం భాష చాలా పేలవంగా సాగిపోతున్నవి. కవితా గుణం చాలా పలుచబడినది.

## 4. దివ్వెలు (బాలగేయాలు)

[జ్యోతిర్మయి. డెమ్మీ 1/4 - 40; వెల రు 2–50/– ప్రాప్తిస్థానం : దేశిటుక్ హౌస్; నారాయణగూడ, హైదరాబాదు–500029]

బాలగేయం వ్రాయాలంటే శిశుప్రవృత్తి నెరిగి ఆకళంక శిశువై పాడాలి. ఈ పాటలకు లయ ప్రాణం. మాతృమూర్తి సహజంగా వెడలగ్రక్కే సహజ ప్రేమసూక్తులకు జీవం పొయ్యాలంటే కవి పెద్దవాడు కావాలి. అందుకనే కాబోలు చాలా మంది కవులు వీటి జోలికి పోకున్నారు. జిజ్ఞాసతో పిల్లకాయలు వేసే ప్రశ్నలకు కొమ్ములు దిరిగిన పండితులకే తలలు తిరిగిపోతవి.

మనకు బాల సాహిత్యం ఇప్పుడిప్పుడే రేకెత్తుతున్నది. రవీంద్ర కవీంద్రుని నెలవంక (క్రెసెంట్‌మూన్) మనోజ్ఞమైన రచన. జ్యోతిర్మయి ఈ దివ్వెల వెలిగించి బాలబాలికలకు జ్ఞాన జ్యోతిని కల్పించడం ముదావహం. ఈ పాటలలో భావం భాష, వాటిని ఒప్పించే సంగీతం లయ అమరి ఉన్నవి. ఒకటి రెండు చోట్ల మాత్రలు ఎక్కువై గతి తప్పినది. (చంద్రుణ్ణి పట్టి నా కివ్వవే అమ్మా — లేకుంటే నేనసలు బువ్వతిననమ్మా; ఈ రెండో చరణంలో రెండు మాత్రలు ఎక్కువైనవి. నేనసలు అనే దానికి బదులు నేను అంటేనే చాలు.)

''చుక్క'' లో లయ భావం; ''తమాషా కథ''లో శిశు హృదయం; ''పండుగ''లో హితోపదేశము ఉన్నవి. ''పండిన నవ్వు పసిపాప నవ్వు'' మొదలైన గీతాలలో మధుర భావన, తగిన భాష ఉన్నవి. వానవిల్లు అని ఇంద్ర ధనువుకు మంచి పేరు బెట్టినది. ఇంగ్లీషులో హ్యామిడ్ బౌ అంటారు గదా, ''అద్దాల పెట్టిలో అందాల చేప'' నిర్బంధానికి ఈ కవయిత్రి కోమల హృదయం పరితపించి, శిశువులవుల మనసును ఊగిస్తున్నది. ఈ ధోరణి శిశువుల మానసికాభివృద్ధికి దోహదం.

కోయిలపాట బాగున్నది. ఋతువును బట్టి ఉనికి మారుస్తుందని సూచిస్తున్నది. బాల బాలికలు నేర్చుకొని, పాడి, ఆడి ఆనందించవలసిన గీతాలు — ఇవి.

## 5. సరిగమలు (సంగీత కవితాసంపుటి)

[ఎస్వీ. డెమ్మి 1/8—పేజీల నంబరులేదు; వెల రు. 3/—; ప్రతులకు: హై. పా. ర. సం; 18-6-867, బాలోగంజ్, హైదరాబాదు—500 253.]

ఇందు, కవితా శిల్ప దీపకాలైన భావాలు, దానికి తగిన మధుర పదాలు పాటలై లయతో లాస్యం చేసి మురిపిస్తున్నవి. లలితమైనా, విరహమైనా, నైరాశ్యమైనా, జానపదమైనా (ఇవి ఈ కావ్య భాగాలు) అన్నీ లోకప్రియ గీతాల బాణిలో పల్లెపదాల మాదిరి సొంపుగా ఉన్నవి. ఇవి గ్రామీణుల స్వైర విహార చేష్టలైనా వెగటులేని శృంగారం, రసానుగుణమైన నుడికారం ఏర్పడి ఉన్నది:— నీ నవ్వు మోముపై పదివేల వెన్నెలలు — నీ పలుకు మధురంబు రాతినే పలికించు - నా మేను పులకించు నీ కలిమి చెలిమితో—తొలివెన్నెలేదొ పూచె ఒక కొత్త వెలుగుతోచె— అనురాగ రూపం ఒక చిన్న దీపం — నిట్టూర్పు తప్ప ఏ గురుతూ లేదు, ఇవీ కొన్ని నుడికారాలు.

నా మనసునందు నువు నిండి ఉండి నువు లేక చీకట్లో బ్రతుకీడ్చుచుందు - అధరాల తునుమాలు గగనాల తారలై వదనాన తొలిరేయి ఉదయాలు వెలుగంగ — మొదలైనవి మధుర భావాలు. ఊహాసుందరి ఖండిక మంచిగా ఉన్నది.

నైరాశ్య భావాల భాగంలో నేటి ప్రపంచ స్థితికి వగుస్తాడు: ప్రేమోన్మాదికి నిరాశ కలగడం విచిత్రమే.

జానపద బాణీలు, అనుభవించి బయటకు వెలువరించిన భావాలుగా ఉన్నవి అద్దానసూస్తుంటే అద్దాన ఆ రూపె సిద్ధమై ఉన్నదే అన్నది ఎంతటి తాదాత్మ్యభావం. నల్లడబ్బు వారిని బాగానే జాడించినాడు ''అపురామల్లయ్య'' కూలిమనిషి పాటల్లో హాస్యము లోకనింద నిండియున్నవి :— కూలి పైకమియ్య బోయి కన్నుగొట్టె కాపోడు, తట్టలు ఎత్తబోయి చేయిబట్టె ఉప్పరోడు, సరుకులు జోక్కుంటూనే సరసమాడె కోమటోడు, గుడికిబోతే బొట్టూ నొసట బెట్టి గుటకవేసే బాపనోడు; ఇందు భాష బాగా లొంగినది. ''అనుబంధ గీతం'' సోదరి ప్రేమను కరుణా రసంగా పారించినది. ''కులం'' లో — నీ అమ్మది గొప్ప కులం, నీ అయ్యదేకులమో ఎవడికెరుక. ఏమి బుజావు-అన్నమాట కుల మృషాస్వచ్ఛతపై ఎంతటి పిడుగుపాటు! ఇదేగదా సత్యకామ జాబిలి కథ.

చెన్నకేశవరెడ్డి కవి వీపుతట్టి — ''గో ఎహెడ్ మై డియర్ ఫ్రండ్'' అంటున్నాడు; అహెడ్‌కు ఎహెడ్, ఫ్రెండుకు ఫ్రండ్— ఎక్కడి నాటు ప్రొనన్‌సియేషన్ అయ్యా?

## 6. నడుస్తున్న గీతం (భావ చిత్రాలు)

[నండూరి భాస్కర్. డెమ్మి 1/8 – 80 పేజీలు; మూల్యం రు. 4/— దొరకు చోటు :— విజయ పబ్లిషర్స్, రోటరి క్లబ్ క్రాస్‌రోడ్, తణుకు, ప. గో.]

బాగా చదువుకొని, తన అనుభూతిని తెలిసేటట్లు విప్పి చెప్పలేని రచయిత—ఈయన. భాషలో సరళత, ధారావాహికమైన గతి, భావ్యవక్తీకరణ సౌలభ్యం ఈ గ్రంథంలో లేవంటే కోపపడినా పరవాలేదు. ఈయన ఇంగ్లీషు రచనలో గూడ పేశలత గాని, విస్పష్టతగాని,సహజతగానిలేవు పిడుసగట్టుకొనిపోయి కటువుగా వినబడే ధ్వనులుగా ఉన్నవి. చెప్పడంలో సొంపుగాని, స్పష్టతగాని లేనందున మర్మధోరణిలో అంతా పులుముడుగా ఉన్నది ఈ వ్రాత ఇంకా పై చదువు వారికంటే మా బోంట్లకు అభ్యంతరం లేదు.

పల్లవి పాడిన రామమోహనరావు అంటున్నారు:— ''భాస్కర్ గేయాలు దాదాపు అన్నీ అనుభూతికి Direct Channels; కాబట్టి చాలా చోట్ల పంక్తులకి Logical Connections ఉండవు (అందరి అనుభూతులూ ఇట్టివే గదా; వాటికి కనక్షన్సు ఉండగా వీటికి ఎందుకు ఉండరాదు) చాలా మంది అడిగినారు — ఈతని కవిత్వపు పంక్తులకి గల సంబంధాన్ని గూర్చి. అసలు గేయాన్ని ఎక్కడ మొదలుపెట్టి దేనివిూద రాసి (ఇదీ బయటబడదా ? ఏమి రాసిన అయ్యా?) ఎట్లా ముగిస్తాడో గూడ చాలా గేయాల్లో అంతుబట్టదు'' అని. ఈ అయోమయ అంధకారాన్నే నేను ఎత్తి చూపేది. ఈ అగమ్యగోచరమైన కవిత్వం సాధించేది ఏమిటో! ఒకరు అనుభవించిన అనుభూతిని చెప్పి, విన్నవారికి అట్టి అనుభూతిని కలిగింపడమే గదా కవిత్వ లక్షణం. ఆ పస ఈ పుస్తకానికి లేదు. ''అక్షర సర్పాలన్నీ ఆహుతి చేస్తున్నా'' (ఎస్కేప్) అంటాడు. ఇదే తెనుగు కారక మైతే మనం మాట్లాడేదేమున్నది? ఈ చిన్న వాక్యంలో విభక్తులకు కలిగిన భంగపాటు గుర్తించండి. సర్పాలన్నిటిని అని గదా తెనుగు నుడికారం పలికేది?

సొగసులేని వాక్యాలు తిలకించండి :— ఎవడో కనుపాపల్ని కరిచేశాడు — దిగంతాల ఊపిరి చీలుస్తూ సాగిపోతున్న రైలు పట్టాలు — గడియారం గోడను పగులకొడుతోంది. ఇది క్రియా ప్రయోగంలో వింత ప్రక్రియ అని పల్లవి వ్రాసిన ఆయన అంటాడు.

మనసు పండి, భావాలు దొరగిరి, వ్రాతలో చేయితిరిగితే ఈయన పాండిత్యాం రాణించి అక్కరకు రావచ్చు. ఈ కవి వృద్ధికి రావాలని అనుకొనే వారంతా అద్దేపల్లివారి పల్లవికి అనుపల్లవి పాడవలసిందే.

**శ్రీ మరుపూరు కోదండరామరెడ్డి**

## మహాకవి భవభూతి

[గ్రంథకర్త యన్. రామాచారి, కాకినాడ. పుటలు 114. క్రౌను, వెల 3–00.]

భారతీయ సంస్కృత నాటక సాహిత్యమున ప్రథమ గణ్యుడైన కాళిదాసు వెనుక ప్రసిద్ధుడైన మహాకవి భవభూతి. కాలక్రమమున ద్వితీయుడయ్యు కవితా రచనచేత భవభూతి అద్వితీయుడు.

అట్టి భవభూతిని గూర్చి హిందీభాషలో శ్రీ జ్వాలాదత్త శర్మగారు విమర్శనాత్మకమగు గ్రంధము రచించిరి. ప్రస్తుత గ్రంధము దాని కనువాదము ఇందు. అవతారికా భవభూతిచే వర్ణితములైన ప్రాచీన స్థలములు. అటవీ మార్గము, సామ్యములు, భవభూతి రచనల కాధార గ్రంధములు. భవభూతి కావ్యరచనా కౌశల్యము—కాళిదాసు భవభూతి, భవభూతి శబ్దతత్త్వము అను శీర్షికలు గలవు. వీనిలో అవతారిక చాలా పెద్దది. ఇందు భవభూతి 'ఉత్తర రామచరిత్ర, మహావీర చరిత్ర, మాలతీ మాధకము' అను మూడు నాటకముల విశిష్టత నిరూపింపబడినది భవభూతికిగల బౌద్ధ తాంత్రిక పరిజ్ఞానము, భారతీయ వైదిక లౌకిక సాహిత్య పాండితీ ప్రకర్ష ఇతర సంస్కృత కవులయందు కానరాని వైదిక వాఙ్మయాధికారము, ప్రమాణ పూర్వకముగా వివరింపబడినవి. పాశ్చాత్య విద్వాంసుల యభిప్రాయములు ప్రసక్తములైనవి.

అవతారిక కేవలము చారిత్రక దృష్టితో వ్రాయబడినను భవభూతి నాటక రచనా కౌశల్యమిందు చక్కగా వివృతమైనది. కాని మూలగ్రంధకర్త లెందువలననో నాటక రచనకు ముఖ్యమగు రసమునుగూర్చి ప్రత్యేక శీర్షికగా వివరించినట్లులేదు. వివరింపవలసిన యావశ్యకత గలదు. మహావీర చరిత్రమున వీరరసము, ఉత్తరరామ చరిత్రమున శృంగారము, ఉత్తర రామచరిత్ర కరుణ విప్రలంభము గలవు.

ఈ మూడింటిలో ఉత్తర రామచరిత్ర — ఉత్తమమేగాక లోకోత్తరమైనది. అందలి రసమునుగూర్చి తెలుగు దేశమున విశేషముగా రాద్ధాంత సిద్ధాంతములు జరిగినవి. ఇవి 'భారతి' పత్రికయందు, ఆంధ్ర సాహిత్య పరిత్పత్రికయందు నలుబదేండ్లక్రిందట ప్రకటితములైనవి కీర్తిశేషులు వేదము వేంకటరాయ శాస్త్రిగారు తామాంధ్రీకరించిన 'ఉత్తర రామచరిత్ర పీఠిక'లో (50 పుటలు) ఉత్తర రామచరిత్రలోని రసము 'కరుణరసము'' అని సోపపత్తికముగా నిరూపించినారు.

మూలకర్త తెలుపకపోయినను, పాఠకులకు భవభూతిని గూర్చి, అతని నాటకములను గూర్చి అనువాదకులు స్వల్పముగా తెలియబరచిన ఎంతో బాగుగా నుండెడిది. అనువాదకుల శైలి సరళముగా నున్నది.

114 పుటలుగల ఈ చిన్న గ్రంధమునకు 16 పుటల అభిప్రాయములు, అభినందనలు నుండుట ఆశ్చర్యకరముగా నున్నది.

## ఆంధ్రవాఙ్మయము - వావిళ్ల

ఆంధ్రవాఙ్మయమున వావిళ్లవారు ముద్రించినన్ని గ్రంధములు మఱెవ్వరును ముద్రింపలేదు. ఆంధ్రముద్రణ చరిత్రయందు వావిళ్ల సంస్థకు నొక ప్రత్యేక విశిష్టస్థానము గలదు. అట్టి వావిళ్ల సంస్థ ఆంధ్రవాఙ్మయమునకు చేసిన సేవను వివరించునది యీ గ్రంధము. గ్రంధకర్త ప్రసిద్ధ రచయితలు మరుపూరి కోదండరామరెడ్డిగారు.

ఇది ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారి పోటీ వ్రాతలో నగపాలు బహుమతి బడసినది.

కీ. శే. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్ఠ్యబ్దపూర్తి మహోత్సవ సందర్భముననేనిట్లు చెప్పియున్నాను:

''బాలశిక్ష మొదలు భారతంబువఱకు
గ్రంధమేదియైన కావలసిన
వ్రాయుడింక నేల వావిళ్ల కనియెడు
పలుకె తెలుగునాట నలమికొనియె.''

అనా డధ్యక్షత వహించిన కట్టమంచివారీ పద్యమును మెచ్చుకొన్నారు.

ఇందు 1) ఆంధ్రలో ద్రావిడులు 2) వావిళ్లవారు 3) ప్రాసంగిక ప్రకరణము 4) ప్రింటింగ్ ప్రెస్ భారతదేశంలో ప్రవేశించింది 5) మదరాసులో దేశీయుల ముద్రణాలయములు 6) వావిళ్ల ముద్రణాలయము 7) రామస్వామిశాస్త్రి 8) వేంకటేశ్వరశాస్త్రి 9) వావిళ్లవారి భూరి ప్రచురణకార్యం 10) రామస్వామి శాస్త్రి సాహిత్య కృషి 11) వేంకటేశ్వర శాస్త్రియుగం 12) వావిళ్లవారి తెనుగు ప్రచురణలు 13) వేంకటేశ్వరశాస్త్రి 14) ప్రాసిక్యూషన్ 15) అభినందన సభలు 16) త్రిలింగ రజతోత్సవము 17) నేటి దీనస్థితి భాషాభిమానుల కర్తవ్యము.

గ్రంధకర్తలు బహుపరిశ్రమచేసి, విషయ సేకరణము గావించి, దీనిని రచియించుట ప్రశంసనీయము. అయినను నిందు చేర్పదగిన కొన్ని విషయములను గూర్చి ప్రస్తావించుచున్నాను.

పుట 9. ''కొడవలూరు పట్టాభి రామశాస్త్రి.'' ఈతని పేరు వేదము పట్టాభిరామశాస్త్రి.

పుట 10 పెద్దబాలశిక్ష వ్రాసినది చదలువాడ సీతారామ శాస్త్రికాదు. ప్రదూరి సీతారామశాస్త్రి.

పుట 21. అవధానం పాపయ్య. అవధానమువారు తుమ్మగుంట ద్రావిడులలోనేకాదు, పాకనాటి నియోగులలోను గలరు. ఆనాడు రాజకీయములలో ప్రసిద్ధులైనవారు నియోగులే గాని ఇతర బ్రాహ్మణ శాఖలలో లేదు అతడు నియోగి.

పుట 23. ''శ్రీనాధుడు స్వర్గస్థుడయ్యె విస్సన మంత్రి మఱి హోమపాత్రాన్న మెవ్వని పంక్తిగలదు'' అన్న విస్సనమంత్రి ఆరామ ద్రావిడ శాఖీయుడుకాడు ఆతడు ఆర్వేల నియోగి.

''ప్రాణికోటికి నెల్ల బహుభక్ష్యభోజ్యాన్న

సత్రముల్ పెట్టె విస్స ప్రధాని''

(చాటుపద్య మణిమంజరి పుట 73)

ముప్పది యిద్దఱు నియోగిమంత్రులు.

పుట 27. ఫోర్టు సెంటు జార్జి కాలేజీ ఆధ్యాపకులు, మామిడి వెంకయ్య, ఆంధ్ర దీపిక కర్త, ఈతడు బందరు నివాసి. **ఈ**తనికి, ఆ కాలేజీకి సంబంధము లేదు. (మామిడి వెంకటార్యుని జీవితము).

పుట 28. ''జూలూరి అప్పయ్య శాస్త్రి : ఈతని పేరు **జూలూ**రి అప్పయ. ఇతడు మాధ్యుడు. శాస్త్రి కాడు. బ్రౌను 1844 లో వసుచరిత్ర ఈతని వ్యాఖ్యతో ముద్రించినారు.

పుట 29. చిన్నయసూరి హిందూధర్మశాస్త్ర సంగ్రహము వాడుక భాష**లో** లేదు. గ్రాంధిక భాష**లో**నే యున్నది. దీనిని నేను 1962లో చిన్నయసూరి జీవితముతో ముద్రించియున్నాను.

పుట 67. సేరాంపూర్(శ్రీరామపురము) సీతారామపురము **కాదు**. ఇచ్చట 1810 లో ఏసుక్రీస్తు నూతన నిర్ణ**య**ము 1812లో దేవునియొక్క సువార్తలు—అచ్చయినవి. **చూ**డుడు.

పుట 69. జెంటూ పదమునకు ''నెమ్మది వారు'' అని అర్థము కాదు. క్రైస్తవుడు కానివాడు **(Heathen)** అని అర్థము. ఈ పదమును **గూ**ర్చి ఈ గ్రంథమున నింత వ్రాయుట అనావశ్యకము. తెలుగున Great **P**rimer అను టైపును **మొ**దట పోత పోయించినవారు వావిళ్ల రామస్వామి శాస్త్రులుగారు

పుట 70. వెన్నెలకంటి సుబ్బారావు, 1789–1844 మధ్య వున్నవాడు. అతని గ్రంధము 1873 లో అచ్చయినది. కాబట్టి దాని రచన 1844 కు **పూ**ర్వము.

పుట 79. చెన్నపురి చరిత్ర – చెన్నపట్టణము. దామెర **అ**య్యన్నపతి తన తండ్రియైన చెన్నప్పనాయని పేర కట్టించినాడు. ఇది సుప్రసిద్ధమైన చారిత్రక విషయము. (చూడుడు: **Sources of Vijayanagar History**. మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణ.

పుట 89. చిన్నయసూరి స్థాపించిన ముద్రాక్షరశాల పేరు వా**ణీ** దర్పణ ముద్రాక్షరశాల ఈ గ్రంథమున 3) ప్రాసంగిక ప్రకరణము 4) ప్రింటింగ్ ప్రెస్సు భారతదేశంలో ప్రవేశించింది. **ఈ** రెండును 42 నుండి 77 వఱకు 35 పుటలాక్రమించినవి. ఇవి **పూ**ర్తిగా అనావశ్యకములు. తెలుగు **ము**ద్రణ ప్రారంభము వివరములు తెలిపిన యెడల నెంతో సమంజసముగా నుండెడిది. ఇంతకు గ్రంధకర్తలే దీనిని **Diagression** అన్నారు. పరిశోధనాత్మక గ్రంథములలో ప్రాసంగికము లుండవు.

వావిళ్ల రామస్వామిశాస్త్రి, అనంత నారాయణశాస్త్రి ఇరువురు కలిసి 1857లో ముద్రించిన రాఘవ పాండవీయము వ్యాఖ్యా సహితము. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమున నున్నది.

వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి చిత్రపటముతో వారి జీవిత చరిత్ర 1924**లో** ''సారస్వత సర్వస్వము'' అను పత్రిక యందు ప్రకటితమైనది. ఆ చిత్రపటము వేంకటేశ్వర శాస్త్రిగారి చిత్రపట**ము** ఇందు చేర్చిన గ్రంధమంతకన్న చక్కగా నుండెడిది.

పుట 201. ఇట్లా**కూ**డా మిగిలిపోయినది ఎఱ్ఱన కొక్కోక మాత్రమే. ఎఱ్ఱన కొక్కోకము పద్య కావ్యము. బొమ్మలతో బందరులో కె. జి. మూర్తిగారు ప్రచురించినారు. జగ్గకవి చంద్రరేఖ విలాసము యధా మాతృకముగా ఆయన అచ్చువేసినాడు

# ప్ర బం ధ ము లు

ఆముక్తమాల్యదను **గూ**ర్చి 10 పుటలు 134 – 144 **అ**నావశ్యకములు. వావిళ్లవారు ప్రచురించిన ప్రబంధములు వేరెవ్వరు ప్రచురింపలేదు

# శ త క ము లు

వావిళ్ల సంస్థ ప్రచురించినన్ని శతకములు వేరెవ్వరు ప్రచురింపలేదు వంగూరి సుబ్బారావుగారిది శతక కవుల చరిత్ర. దీనికి వావిళ్ల వారికి సంబంధము లేదు. దీనిని కాశీనాధుని నాగేశ్వరరావు గారు—ఆంధ్ర గ్రంధమాలలో 1923లో ప్రకటించిరి. వావిళ్లవారి శతక**ము**లలో చాలా వానికి శేషాద్రి రమణ కవులు పీఠికలు వ్రాసినారు.

# విమర్శన గ్రంథములు

వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి ''వసుచరిత్ర – విమర్శనము'', అక్కిరాజు ఉమాకాంతము గారి ''నేటి కాలపు కవిత్వం'' వావిళ్లవారే ముద్రించిరి. వఝ్ఝల వారికి పేరు ప్రఖ్యాతులను తెచ్చినది వావిళ్లవారే

# వ్యా క ర ణ ము లు

పుట 169. సులక్షణసారము, అప్పకవీయము, ఛందో దర్పణము, కవిజనాశ్రయము, వ్యాకరణ**ము**లుకావు. ఛందోలక్షణ గ్రంధములు. నరస భూపాలీయము, అలంకారశాస్త్ర గ్రంధము, సంస్కృతములో నున్న ఆంధ్ర శబ్ద చింతామణి, బాల సరస్వతీయము దాని తెలుగు వ్యాఖ్య వావిళ్ల వారే ప్రచురించినారు. తెనుగు వ్యాకరణములలో ఆంధ్ర భాషాభూషణము (పద్యకావ్యము)1816 నుండి 1858వఱకు వచనములోనున్న రావిపాటి గురుమూర్తిశాస్త్రి వ్యాకరణము, పుదూరి సీతారామశాస్త్రి ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము, వేదము వేంకటరమణ శాస్త్రిగారి లఘువ్యాకరణము, వీరు **ము**ద్రించినారు. వేదము పట్టాభి రామశాస్త్రిగారి పట్టాభిరామ పండితీయము తొలిసారిగా వీరే ముద్రించినారు.

ఇంకను చేర్చవలసిన యంశములు గలవు గ్రంధ విస్తరభీతి చేత విరమించుచున్నాను.

వావిళ్లవారు ఆంధ్ర వాఙ్మయమునకు చేసిన సేవ అపారమైనది. ఆంధ్ర భాషోద్ధారకమైనది.

అట్టి వావిళ్ల సంస్థ నేడు మూతబడినది. దానిని పునరుద్ధరించుట ఆంధ్ర మహాజనుల అవశ్య కర్తవ్యము.

*కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు*

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**



AMRUTANJAN
Pain Balm
SALOFEN
SALOFEN
SALOFEN
AMRUTANJAN
LTD.'S
Gripe Mixture
AMRUTANJAN LIMITED
Anoleum